# మా దే మా ట లు!

(1) దేశాభివృద్ధికి భాషాభివృద్ధి గొప్పసాధనము. దేశములోని గ్రంథసంగ్రహంబును వార్తాపత్రికలును నేదోయొక దైవికకారణమ్ముచే నేదు లేకుండనయ్యెనేని ఆ దేశము తన యాదిమ యుగములోని యనాగరికతకు దిగునని చెప్పుట యతిశయోక్తి గానేరదు. దేశమునందలి వాఙ్మయము ఆ దేశమునకు మేలుగాని కీడుగాని కలుగఁజేయఁగల యొక నిరంకుశాధికారి యని చెప్పవచ్చును. ఇట్టి శక్తిగల వాఙ్మయమున దగిన గ్రంథములులేని భాష శిశువులవచ్చిరాని పలుకులవంటిదై వ్యవహారమునకును జ్ఞానసంపాదనమునకును పనికి రాకుండును.

(2) ఈ యుద్దేశమును మనము నందిడుకొని మేము దేశచరిత్రలను, ప్రకృతిశాస్త్రములను, వ్యక్తిచరిత్రలను, చరిత్రవిషయక నవలలను, నీతిబోధక గ్రంథములను ప్రచురింప సమకట్టితిమి. ఆ ప్రకారము విజ్ఞానచంద్రికా గ్రంథమాలయందిప్పటికి **27** గ్రంథములు ప్రచురితములైనవి. అందు **14** ప్రకృతిశాస్త్రములు, **5** దేశచరిత్రలు, **4** వ్యక్తిచరిత్రలు, **4** నవలలు. ఇవియన్నియు తజ్జ్ఞులగు వారిచే వ్రాయఁబడినవి. చిత్రపటములచే శోభిల్లుచుండును. సుందరమైన క్యాలికో బైండు చేయబడినవి. గ్రంథమాలరూపమున వెలువడు నీ గ్రంథములను ప్రసిద్ధ వాఙ్మయమని విద్వాంసుల అభిప్రాయము.

(3) ఈ గ్రంథములు జనసముదాయము కొనుటకు వీలగునట్లు బహుకొద్ది వెలల కిచ్చుచున్నాము. శాశ్వతపు చందాదారుల పద్ధతిని యమ్మబడును. మేము ప్రచురించు పుస్తకములన్నిటిని గొనువారు శాశ్వతపు చందాదారులు. అట్టి వారికి నూరు పుటలకు **0-8-0** ల చొప్పున ఇయ్యబడును. పోస్టేజి వేరు. ఇతరులకు పోస్టేజిగాక **0-6-0** లగును. ఇంతకుముందు ప్రచురింపఁబడిన గ్రంథములలో కనీసము మూడురూపాయలవెలగల గ్రంథములను కొనువారు ప్రవేశరుసుము మియ్యనక్కరలేదు. వెనుకటి పుస్తకములనుగొనక ముందు పుస్తకములను మాత్రము గొనునెడల **1-0-0** ప్రవేశరుసు మియ్యవలెను. పుస్తకముల వి. పి. గా పంపి సొమ్ము రాబట్టుకొందుము.

నవంబరు నెల.
**1914.**

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.
మే నే జ రు.

# తయారగుచున్న గ్రంథములు

5.30

---

పాతాళభైరవి ఎ. వి. నరసింహము పంతులుగారు.

స్వీయచరిత్రము (రెండవభాగము)

రా. బ. క. వీరేశలింగము పంతులుగారు.

సద్వర్తనము కె. వి. లక్ష్మణరావు పంతులుగారు ఎం.ఏ.

ఆంధ్రుల చరిత్రము (మూఁడవభాగము)

చిలుకూరు - వీరభద్రరావు పంతులుగారు.

భూగర్భశాస్త్రము (Geology)

త. పానకాలరావు పంతులుగారు, బి. ఏ.

అస్తమయము భోగరాజు. నారాయణమూర్తిగారు.

అర్థశాస్త్రము (ద్వితీయభాగము)

కట్టమంచి - రామలింగారెడ్డిగారు.

మహారాష్ట్ర మహాయుగము

కె. వి. లక్ష్మణరావు పంతులుగారు, ఎం. ఏ.

రెండవసారి !

రెండవదఫా!

# నవలా బహుమతి

## రు. 500-0-0 లు.

కథ

హిందూ దేశ చరిత్రాత్మకముగా

నుండవలెను

గ్రంథము

1915-వ సంవత్సరము ఏప్రిల్ 31-వ తేదిలోగా

విజ్ఞానచంద్రికా కార్యాలయమునకు

చేరవలెను.

నిబంధనలు మునుపటివలెనే

విశేషములు తెలిసికొనగోరువారు మాకు వ్రాయవలయును

ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి., సి. ఎం.,

నవంబరు_1914]

మేనేజరు - విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట-మద్రాసు.



మ. రాఘవచంద్ర అయ్యవారు.

విజ్ఞాన చంద్రికా గ్రంథమాల

# విజయనగర సామ్రాజ్యము

ఇది

దుగ్గిరాల - రాఘవచంద్రయ్య చౌదరిగారిచే

రచింపఁబడినది.

విజ్ఞానచంద్రికా మండలి వారిచే

ప్రకటితము.

చింతాద్రిపేట

మద్రాసు.

౧౯౧౪

 [ వెల 1-4-0

Rs 0.13-0
[illegible]
[illegible]

# కృతిసమర్పణము

---

అత్యంత ప్రేమతో నన్నుంబెంచి సకల విద్యాబుద్ధులంగరపిన

మత్ప్రియజనకుండు

మ-రా-శ్రీ దుగ్గిరాల పురుషోత్తముగారికిని

ప్రియజనని

శ్రీ పుల్లమాంబగారికిని

ఈకృతిని

భక్తితో సమర్పించుకొనుచున్నాండ.

ఇట్లు

విధేయుండు

గ్రంథకర్త

# పీఠిక

1913-వ సం॥ ఏప్రేలునెల 26-వ తారీఖున వేసవి సెలవులం గడపుటకై స్వగ్రామమగు నంగలూరునకేగి గ్రంథమేదేనొకఁడు వ్రాయ నిశ్చయించి కథకై హిందూదేశచరిత్రము పఠింపఁదొడఁగితి. విజయనగర సామ్రాజ్యనాశము నాకెంతయు ననుకూలించునని తోఁచుటయు దానిం గైకొంటి. గ్రంథమును విజ్ఞానచంద్రికామండలివారి పోటీపరీక్షకుఁ బంపవలయునని యూహజనించుటయు, అత్యంత త్వరితగతి మేనెల 1-వ తారీఖునఁ బ్రారంభించి 26-వ తారీఖున (అనఁగా 26 దినములలో) ముగించితి. మండలివారి పరీక్షయుఁ బ్రోత్సాహమును లేకయున్న నింతత్వరలో ఈనవలను రచించి యాంధ్రపాఠకలోకమున కొసంగఁబూనియుండువాఁడఁగాను. కాన మండలివారికిం గృతజ్ఞుఁడ.

ఇట్లు స్వల్పకాలములో వ్రాసినదగుటచేతను, సంస్కరణమునకైనఁ దగినయవకాశము లేకుండుటచేతను, ఇందుదొరలినదోషములను లేశమేని దిద్దకయే పరీక్షకులకుఁ బంపవలసినవాఁడనయితి. దానింజేసి పరీక్షకులకుఁ జాల శ్రమ కల్గించితి. అయినను ప్రయాసతో విమర్శించి నవలకువన్నెఁదెచ్చిన పరీక్షకులకు వందనములు.

ఇందలి కథను మ-రా-శ్రీ కే. వి. లక్ష్మణరావు పంతులుగారి మహమ్మదీయ మహాయుగమునుండి స్వీకరించితిని. కావున శ్రీపంతులుగారి సాయము నొకపరి యిచ్చుట సంస్మరించుట నాకుంగర్తవ్యము. ఈ గ్రంథమును శీఘ్రముగను, శుద్ధముగను, అచ్చువేయించిన హెచ్. వి. కృష్ణ అండు కో వారికిని అందందు మార్పులఁజేసి వన్నెబెట్టిన శ్రీయుత ఆచంట లక్ష్మీపతి బి. ఏ., ఎం. బి., సి. ఎం., గారికిని నాకృతజ్ఞతావందనములు.

మండలివారీ గ్రంథమును చిరకాలముక్రిందనే ప్రకటింప నిశ్చయించిరి. అయినను నాకుఁదగిన సావకాశము గల్గమింజేసియు శరీరస్వాస్థ్యములేమి మొదలగు మఱికొన్నియనివార్యములగు ఆటంకముల వలనను మండలివారికిని ఆంధ్రపాఠకప్రపంచమునకును ఆశాభంగము కల్గించితిని. నేఁజేసిన యాలస్యమునకెల్ల నోర్చినమండలివారి యౌదార్యము, శాంతము ప్రశంసనీయములు. పాఠకమహాశయులీ యాలస్యమును మన్నింతురుగాక. గుణదోషనిర్ణయమునకుఁ బ్రాజ్ఞలోకము శరణ్యము.

ఆపరితోషా ద్విదుషాం నసాధుమన్యేప్రయోగవిజ్ఞానం
బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయంచేతః (కాళిదాసు)

బాలసరస్వతీపుస్తక
భాండాగారము
అంగలూరు
19-9-14.

ఇట్లు
విధేయుఁడు
దుగ్గిరాల- రాఘవచంద్రయ్యచౌదరి.

# సంపాదకీయ భూమిక

ఇది ౧౯౧౩-వ సంవత్సరపు బహుమతి పరీక్షలో రు. ౫౦౦ ల బహుమతిగన్న నవల. దీని నిదివరలోఁ గొంత కాలము క్రిందటనే ప్రచురింపఁదలఁచితిమి కాని గ్రంథకర్తగారు పీఠికలో సూచించిన కొన్ని కారణములచే నింతవఱకుఁ జందాదారుల కందఁ జేయఁజాలమైతిమి.

ఆ సంవత్సరపు బహుమతి పరీక్ష కంపఁబడిన పది గ్రంథములలో నీ గ్రంథముయొక్క యాధిక్యతను దీనిని బఠించిన చదువరు లెఱుఁగఁగలరు. తాము నిర్మించిన చిత్తరువులకుఁ దక్కినవారు చక్కఁగాఁ బ్రాణమును బోయలేకుండుటయు నీ గ్రంథకర్త తన కల్పనాచాతుర్యముచేఁ దానిని సజీవముగాఁ జేయుటయు నందలి రహస్యము. ఐనను బరీక్షకు లీ గ్రంథము నందు సుగుణములని యెంచిన కొన్నియంశములను సంక్షేపముగా నిందుదాహరించెదము.

i. విజయనగర సామ్రాజ్యనాశనము కథాసారమైనను గ్రంథకర్త చేతులలో నీ సామ్రాజ్యముయొక్క వైభవము మిక్కిలి చక్కఁగను, ఉత్కృష్టముగను బ్రకాశించుచున్నది. ఇందలి కల్పనాచాతుర్యము పటుత్వమును, గాంభీర్యమును గలిగి చదువరుల కానందమును, పరవశతను దుదవఱకుఁ గలిగింపఁగలదు. మహమ్మదీయ చక్రవర్తులు బహిరంగముగ యుద్ధమునను గాక జిత్తులచే నీ సామ్రాజ్యమును నశింపఁజేయఁ బ్రయత్నించుటయు హిందూసామ్రాజ్యముయొక్క ప్రతిభావిశేషమును వేయిరెట్లు హెచ్చించుచున్నది.

ii. గ్రంథకర్తయొక్క వచనరచన మృదుమధురమై, ప్రౌఢమై, స్వాభావికమైన ప్రవాహముఁగలదై, కొండలంతటి లోపములనుగూడ నొక్కొక్కతరి నలుసులవలెఁ జేయుచున్నది.

iii. ఇందలి వర్ణనలు స్వాభావికములై, ఆయాపాత్రముల కనుగుణములుగా నున్నవి. రామరాజు బహుధైర్యశాలియు, న్యాయమూర్తియునగు చక్రవర్తి. ఇతని కాత్మవిశ్వాసము హెచ్చు. కౌటిల్యము తెలియదు: స్వామిద్రోహులగు, ఆదిల్ శాహా చక్రధరులు ద్రవ్యగోతులను బుద్ధిసాగరుఁడు చూపించినను లక్ష్యపెట్టక, కన్నులుమూసికొని వానిలోఁదుమికెను. తుదకీతఁడు తనలోపములనుగనుఁగొని మిక్కిలి పశ్చాత్తాపపడుచు తన్నుఁదాను నిందించుకొను వాక్యములు పలుమారు పఠింపఁదగినవి.

బుద్ధిసాగరుని నీతియు, నిరుపమానరాజభక్తియు నెంతయు శ్లాఘాపాత్రములు. స్వర్ణకుమారీ జగన్మోహినులు రూపరేఖాలావణ్యాతిశయములును విద్యాబుద్ధులునుగల యాకాలపు హిందూనారీమణులు. వీరుతమభర్తలు వలదన్నను వారితోయుద్ధరంగమున కరుగుట వారిపాతివ్రత్యమును శూరత్వమును జాటుచున్నది. ఆకాలపువీరుఁగుణములన్నియు విజయసింహునియందు మూర్తీభవించియున్నవని చెప్పవచ్చును.

ఈ గ్రంథమునందలి చరిత్రాంశములను సుబోధకములుగ జేయుటకుఁగాను గొన్నిపటముల నందందిమిడ్చితిమి. మఱికొన్ని రంగుపటములను బాత్రోచితముగఁ జిత్రింపఁబ్రయత్నించితిమి. కాని ప్రస్తుతము మన దేశమునందు సంక్షోభముఁ గలిగించుచున్న మహాయుద్ధమువలన గలిగిన యాటంకముల చేతవలనుపడినదిగాదు. అందులకెంతయుఁ జింతిలుచున్నాము.

చింతాద్రిపేట,
5-10-14.

ఇట్లు
సంపాదకుడు.

# విషయసూచిక

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 16 | 14 | ప్రస్థితస్తోత్రగాణాం | ప్రస్థితస్తోత్రగాశాం |
| 50 | 14 | ఈ మాధవిని మంటపము | ఈ మాధవీమంటపము |
| 53 | 2 | తత్ప్రియ | త్వత్ప్రియా |
| 58 | 14 | కోడుప | కోదప |
| 62 | 3 | కనులకు | కనులను |
| 82 | 8 | ఇదిగో ! | అదిగో ! |
| 88 | 8 | అధిషించెను | అధిష్ఠించెను |
| 92 | 3 | శిశిఋతువు | శిశిరఋతువు |
| 98 | 14 | బహిప్రపంచము | బహిఃప్రపంచము |
| 108 | 8 | కుంకమురాగ | కుంకుమరాగ |
| 115 | 20 | బిక్షుకుఁడు | భిక్షుకుఁడు |
| 124 | 8 | యోజనమగ్నమై | యోచనామగ్నమై |
| 142 | 19 | అంకకములతో | అంగకములతో |
| 148 | 1 | చిత్రపలకము | చిత్రఫలకము |
| 194 | 4 | నసించునని | నశించునని |
| 216 | 18 | మహామ్మదీయానవాబుల | మహమ్మదీయపాలకుల |
| 278 | 8 | రణశిక్షకుశలులగు | రణశిక్షాకుశలులగు |
| 306 | 5 | యాతురఁబడు | యాతురపడు |


౧౧వ శతాబ్దములోని
దక్షిణహిందూ దేశము.
కుందాపుర్
బర్కూర్
మంగళూర్
కన్ననూర్
కలికట్
కొచిన్
క్విలన్
కన్యాకుమారి
శ్రీరంగపట్నం
మైసూరు
కావేరి
చంద్రగిరి.
తిరుపతి
పులికట
మద్రాస్
మైలాపూర్
వేలూరు
పాలార్
తిరుచినాపల్లి
తంజావూరు
నాగపట్నం
మధుర
దేవిపట్నం
రామేశ్వరం
లంక
0
100
200
300
400
75
80
10

# విజయనగర సామ్రాజ్యము

## మొదటి ప్రకరణము

---

"Breathes there the man, with soul so dead,
Who never to himself hath said,
This is my own, my native land,
..............................................."

*Sir Walter Scott.*

### యోగి

మనమున్న యీశతాబ్దమిరువదియవది. కాని యిపుడు మన మొకసారి 16-వ శతాబ్దము వంకఁ జూడవలసియున్నది. కాల మొక తీరుగా నుండదు. అది చక్రమువంటిది. క్రిందు మీఁదగును, మీఁదు క్రిందగును. ఆకాలమునఁ బ్రస్తుతము హాంపీ విరూపాక్షమను చోట జగద్విఖ్యాతమగు నగర మొకటి కలదు. అది విజయనగరము. తుంగభద్రాస్రవంతీ తుంగతరంగ మాలికా ధౌతోత్తరభాగము. తన్నగర రక్షణమునకుఁ గాను పరమేశ్వరుండు నిర్మించిన యత్యున్నత కుడ్యజాలములో యన నొప్పు కొండగుట్ట లాపత్తనపుఁ బూర్వదక్షిణ పశ్చిమ భాగముల వెలయుచుండెను. ఇట్లు స్వాభావిక సృష్టిసౌభాగ్య రాసులయిన యాపర్వతములలో నొకచోట మిక్కిలి ఎత్తయిన

ప్రదేశ మొకటుండెను. ఆప్రదేశము సకలవిధ లతాసంకులమై నానావిధ తరు సంతతులచే నొప్పారుచుఁ జూపఱకు నానంద దాయకముగానుండెను. అందొక విశాలమగు నుటజముకలదు. అందు మునులుందురు. అది ప్రకృతము శ్రీధరుఁడను నొక యోగి సత్తముని యధికారమున నుండెను.

ఆయుటజమునకుఁ గొంతదూరమున, దాని యావరణమున నే, చిన్న మండప మొకఁటుండెను. దానిపైఁ గృష్ణాజినము పఱచియుండెను. అందు మన శ్రీధరుఁడు చేతనొక వీణను గైకొని పాడుచుండెను. అపుడపుడే తూర్పు తెల్లవారెను. ప్రపంచమెల్ల నిశ్చలమై మందసమీర సౌరభ సౌభాగ్య విభాసురముగాఁ దోచుచుండెను. నిర్భయముగా హరిణకిశోరములతని ప్రక్కలఁ దృణాంకురములం గొఱుకుచు బహువిధముల గంతులిడఁ జొచ్చెను.

అతఁడు కనులు మూసికొని పాడుచుండెను. ఆగీత మమరలోక విలాసినీ ప్రస్తుతి పాత్రము. మధురము,అస్వాదు[?] భము. ఆగానసారస్య సౌభాగ్యము చవిఁగొన్న వారికిని, అప్పటి యా ప్రకృతి నిశ్చలభావమును నైర్మల్యమును గన్నవారికిని, ప్రపంచమెల్ల నతని యలోక సామాన్య, సుభగ, సంగీత సారస్యమును గ్రోలుచుఁ దన్మయావస్థం జెందెనని తోఁపకపోదు. కాని, యామృదుమధురగానముతోఁబోల్చి చూడఁగోరిమో లేక తనకంటె నధికుఁడను విచారముననో చెప్పఁజాలముకాని;

కోకిల మాత్ర మప్పుడప్పుడు 'కూ'యని పాడకమానినదికాదు. అతఁడింకను బాడుచుండెను. అతని కను లర్ధనిమీలితములై చలించుచుండెను. మొగము పరమానందమును సూచించుచుండెను. శాంతభావము, తృప్తి, నైర్మల్యము తప్ప, మఱొక వికార మందుఁ గన్పట్టుటలేదు.

అతఁడా వీణెను గ్రిందనుంచెను. ఆ మొగమింకను శాంత భావమును బ్రస్ఫుటము సేయుచుండెను. ఆకను లింకను హర్ష ప్రపూర్ణములై తోఁచుచుండెను. ఒక నిముసమతఁ డటు నిటు చూచెను. అంత నతనికిఁ గృతపరిచయమగు మానవ విగ్రహ మొకటి కన్పట్టెను.

ఆ యుటజమునకు దారులు పెక్కులు గలవు. అందు పెక్కుదారులు రహస్యములయినవి. వాని నితరులెఱుఁగరు. అతని మిత్రులు కొందఱు మాత్ర మెఱుఁగుదురు. ప్రస్తుత మీ పురుషుఁడందొక త్రోవనుండివచ్చెను.

అతనింజూడఁగనే మన శ్రీధరునిహృదయము కుముదినీ మనోహరుంగాంచిన కల్వయుంబోలె వికాసవంత మాయెను. తోడనే యతఁడు "ఓహో! బుద్ధిసాగరా! ఎన్ని నాళ్లకు దర్శన మిచ్చితివి? మామీఁద దయరాలేదు గాఁబోలును?" అని యెను.

బుద్ధి:- అవును, చిరకాలమే యైనది. మీయజ్ఞ యాగాదులన్నియు నిర్విఘ్నముగా సాగుచున్నవా?

శ్రీధ:-మా యజ్ఞ యాగాదికములమాట కేమిలే! సుస్థిరమగు విజయనగర సామ్రాజ్యలక్ష్మికి మీఁబోటి మంత్రులును, రామరాజువంటి చక్రవర్తులును గలుగ, మాబోంట్లకు భయమేమి? కాని, మీరాజ్య కార్యములెట్లు సాగుచున్నవి?

బుద్ధిసాగరుఁడు తలకొంచెమువంచెను. అతని మొగము సరిగాఁ గనఁబడుటలేదు. కాని, యతని మొగమున నెంత చూచినను మార్పేమియుఁ గాన వచ్చుటలేదు.

"రాజ్యకార్యములంగూర్చియే నీతో నిప్పుడు మాట లాడవచ్చితిని. కొంచెము కాలము మనము మాటలాడవలసి యున్నది. కొన్ని చిక్కులు తటస్థించినవి" అని మెల్లగా బుద్ధి సాగరుఁడనెను.

శ్రీధరుని కేమియుఁ దోఁచలేదు. అతనికి యోచనలు పెక్కులు గలుగఁజొచ్చెను. సర్వమును విసర్జించిన సన్యాసికీ వ్యవహారము లన్నియు నేలకో? శ్రీధరుఁడటునిటు పరికించి చూచెను. బుద్ధిసాగరుఁడును విలోకించెను.

"బుద్ధిసాగరా! అదిగో! అకనఁబడుచున్న ప్రదేశము రహస్యాలోచనమునకు మిక్కిలి మంచిది. కాన నటకుఁబోవు దము రా" అనియెను. ఇద్దఱును బోవఁదొడఁగిరి. వారిరువురు నొకరితో నొకరు మాటలాడలేదు. కనులెత్తి యచ్చటి ప్రకృతి సౌందర్యము నరయలేదు. మెల్లమెల్లఁగ శ్రీధరుఁడు ముందు

వోవుచుండెను. అతనిహృదయము మాతురతతో నిండి యుం
డెను. బుద్ధిసాగరుఁడతనిని వెంబడించెను.

ప్రస్తుతము బుద్ధిసాగరునకును, శ్రీధరునకును, గలసం
బంధ మేమో తెలిసికొనవలయునని మీ హృదయము తొందర
పడుచున్నదా ? ఈ యిరువురును బాల్యమునుండి మిత్రులు.
సహాధ్యాయులు. ఇరువురును జాణాక్యాది మహాశయులచే రచిం
పఁబడిన న్యాయశాస్త్రంబులను, ధర్మశాస్త్రములను, రాజ
కీయ విజ్ఞాన శాస్త్రంబులను, సమముగాఁ బఠించిరి. వారిరు
వురకుఁ బరస్పరము స్నేహ మమితము. శ్రీధరుఁడు సన్యసించి
తన సర్వమును దేశక్షేమమునకై వినియోగించు చుండెను.
బుద్ధిసాగరుఁడు మంత్రియై దేశక్షేమమును బాలించుచుండెను.

అట్లు వారిరువురును గమ్యస్థానమున కరిగిరి. అంత
శ్రీధరుఁడు "మిత్రమా! సత్వరముగాఁజెప్పుము. నామనము కల
వరపడుచున్నది. విజయనగర సామ్రాజ్యమునకుఁ జిక్కులు
తటస్థించినవిగా?" అనెను.

బుద్ధి:-ఆ ! సమీపించుచున్నవి. కాలసర్పమును బక్కక్రింద
నుంచుకొని నిద్రించువానికిఁ జావు రాకుండఁగలదా ?

శ్రీధ:-అవును. నీవన్నది యాదిల్ శాహాను గూర్చికాదా ?
అతఁడంత పనికిఁదగినవాఁడే. అయ్యో ! రామరాజా !
నీ వివేకమెల్ల నేమైపోయినది?

అని నిట్టూర్పు పుచ్చెను. అత్యంతవైభవము ననుభవించి విమత నృపాలురకు భీకరంబులై జగద్విఖ్యాతి గాంచిన సామ్రాజ్యములలో విజయనగర సామ్రాజ్య మొకటి. ఉచ్చదశ యందది దక్షిణహిందూదేశములోఁ • జాలభాగమువఱకు వ్యాపించి తన యపారసాహస వంతులగు భటులచేతను, సేనాధిపులచేతను, మేధానిధులగు మంత్రి సత్తములచేతను, నిత్యవిజయ విభవవిభాసురులగు రాజ మార్తాండులచేతను, విపక్షులగు యవనావనీధవుల గుండియలు బ్రద్దలు చోవఁజేసినది. తదితర హిందూనృపులకు వంద్యమై క్రాలినది.

ఆసామ్రాజ్యమెవ్వారిది ? విపక్షద్విరద మృగేంద్రులగు నారాజులెవరు ? పాఠకులారా ! ఆసామ్రాజ్యముమీది. మీపూర్వులు, పరాక్రమ విజిత వితత విపక్షులు, దానిని స్థాపించినారు. దానిని స్థాపించిన దాంధ్రులు. పరిపాలించిన వారాంధ్రులు. ఆంధ్రులా సామ్రాజ్యమునకు మంత్రులై వన్నెకెక్కిరి. ఆ సామ్రాజ్యముంగూర్చి, యా ప్రభువులంగూర్చి యామంత్రులంగూర్చి, నేటికిని మనపెద్దలు గృహములలో వర్ణించుచుండఁగా మీరు వినలేదా ? కృష్ణరాయల శౌర్యసంపత్తిని, తిమ్మరుసు బుద్ధివైభవమును, పసిపిల్లలుగూడ నేటికిని గీర్తించుచుండుటలేదా ?

అట్టి యుత్కృష్టసామ్రాజ్య నిర్వాహకుల వంశముల జన్మించిన యో పాఠకులారా ! ప్రస్తుత సామ్రాజ్యమునకుఁ

జక్రవర్తి రామరాజు. పేరునకు సదాశివరాయ లున్నను, సర్వ విషయములందును రామరాజే చక్రవర్తియై కార్యముల నిర్వ హించుచుండెను. ఈ విజయనగర సామ్రాజ్యమునకు నుత్తర మున సరిహద్దుగా విజాపుర మను రాజ్యముండెను. ఆరాజ్య మునకుఁ బ్రభువులు తురుష్కులు. ప్రస్తుతపు నవాబు పేరు అలీ ఆదిల్ శాహా. ఇతని తండ్రి పేరు ఇబ్రహీం అదిల్ శాహా. వీరిరు వురును విజయనగర సామ్రాజ్య చక్రవర్తులతో స్నేహమున మెలంగుచుండిరి.

తండ్రియగు నిబ్రహీం ఆదిల్ శాహా చనిపోవఁగా నె కొడుకు అలీ ఆదిల్ శాహా నవాబాయెను. పిదపఁ గొలఁది కాలమునకు మన విజయనగరసామ్రాజ్య చక్రవర్తియగు రామ రాజుకొడుకు గతించెను. అపు డాదిల్ శాహా పరామర్శింప వచ్చి తన్నే ఆ చనిపోయిన కుమారునిగాఁ జూచుకొమ్మని ప్రార్థింప రామరాజందు కంగీకరించెను. నాటినుండి యాదిల్ శాహా రామరాజును 'దండ్రీ' యని పిలుచుచుండు వాఁడు. రామరాజు భార్యయు నాదిల్ శాహాను 'పుత్త్రికా' యని పిలుచుచుండెడిది. ఇట్లు మన విజయనగర చక్రవర్తి కపూర్వ పుత్త్రి రత్న మొకఁడు గలిగెను.

ఆ పుత్త్రిరత్నముం గూర్చియే శ్రీధరుఁడు నిట్టూర్పు విడిచి యతనిం బుత్త్రిప్రేమతోఁ జూచుచు నమ్మియున్నందు లకు రామరాజును నిందించినాఁడు.

బుద్ధి:-కార్యములు నూతన ఫక్కిం(ద్రొక్కుచున్నవి. ఆదిల్ శాహా రాక విశేష మగుచున్నది. అతఁడు పయోముఖవిష కుంభము. గోముఖ వ్యాఘ్రము. అతని వర్తనము నుదార స్వభావుఁడగు రామరాజేమి తెలిసికొనును ? తిరుమల రాయలును వేంకటాద్రియు 'యథారాజా తథాప్రజాః' అన్న సామెత ననుకరించుచున్నారు. మఱియు వారిరువురు నిపు డిచట లేరు. పాపము ! నిష్కపటులగు వారిహృదయ మునకుఁ గపటియగు నాదిల్‌శాహా స్వభావ మెట్లు బోధ పడఁగలదు ?

శ్రీధ:-తురకలకు హిందువులన్నఁ దలనొప్పి. అట్టియెడ నిట్టి గండ్రగొడలిని దెచ్చుకొని కంఠముపైఁ బెట్టుకొన్న విజయ నగరసామ్రాజ్య భవిష్యత్తు చెప్పుట సుకరముగాదు. ప్రకృతము చెప్పుము. అతఁడిపుడేమి చేయుచున్నాఁడు?

బుద్ధి:-కార్యనిర్వహణమున నతనికీఁడు వచ్చువాఁడు మఱొకఁడు లేఁడు. అతని దూరదృష్టి, వివేచనాశక్తి, సంస్తుతి పాత్రములు ! అతఁడిపుడు రాజుగారి సహాయమంత్రియగు చక్రధరుని దనవలలో వేసికొనియున్నాఁడు.

శ్రీధరుని హృదయము కలఁగఁజొచ్చెను. అతనికన్నులు చింతనిప్పులవలెఁ బ్రకాశించుచుండెను. అతని మొగము తీక్ష్ణ భావ మండితమై చూచుటకు భయంకరముగనుండెను. అంతఁ డిట్లనెను.—

"ఓరీ! చక్రధరా! మహాపాతకా! తుచ్ఛ ధనమునకును, తుచ్ఛభోగములకును, ఆశపడి సుప్రసిద్ధాంధ్ర సామ్రాజ్యమును నశింపఁజేయ సమకట్టితివా? నిన్నుఁ గాకులకును, గ్రద్దలకును జిన్నిచిన్ని ఖండములుగాఁ గోసివేసినను బాపము రాదు."

బుద్ధి:-అతఁడిప్పుడు తనతోఁ గొందఱ నితరులనుజేర్చుకొని—

శ్రీధ:-చక్రధరునకు ఆదిల్ శాహా యేమిచ్చెదనని యాశపెట్టెనో?

బుద్ధి:-అర్ధరాజ్యము నిచ్చెదనని యనెనఁట.

శ్రీధ:-తరువాత.

బుద్ధి:-అతఁ డితరులంగూడఁ దనలోఁ జేర్చుకొనుచున్నాఁడు. సేనాధిపులలోఁ గొంద ఱతనిపక్ష మవలంబింతురని వినికి.

శ్రీధర:-సరే! ఇపుడు వారేమి సేయుచున్నారు?

బుద్ధి:-క్రమక్రమముగా రాజునకు రాజ్యపుంబిచ్చి యెక్కించి గోల్కొండ మొదలగు తురుష్క రాజుల నోడించుటకుఁ దాముసాయపడెదమనియు, విజయనగరసామ్రాజ్యమును బెంపు నేయవచ్చుననియు, నాశలు కల్గించి యతనిని యుద్ధప్రియునిగావించియున్నారు. అతఁడు, తమ్ములునుగూడఁ గ్రమ క్రమముగా నాదిల్ శాహా చేతిలోని కీలుబొమ్మలైనారు! రాజ్య లక్ష్మిలోలురకును, స్త్రీలోలురకును, మంచి చెడుగులు తెలియవుగదా?

శ్రీధ:-తమ్ములుగూడ నింతవివేకశూన్యులైనారా?

బుద్ధి:-ఆ తమ్ము లాయన్నమాటలకు నడుగుదాటరు. 'అతఁడు క్రమక్రమముగా నన్నుఁగూడఁ గల్పుకొనవలయునని సంకల్పించుకొనినాఁడు. కాని నేనందులకు లోఁబడువాఁడను గానని యెఱిఁగి, భేదోపాయముచే నాకును రాజునకును విరోధముఁ గల్పించి, రాజ్యవిషయములందు రామరాజకుమారతలనాధునకు నా మంత్రి మనవసరముగాఁ జేయఁ జూచుచున్నాఁడు.

శ్రీధ :-ఓరీ! తుచ్ఛుఁడా? నీవలె ధనమునకాశపడి బుద్ధిసాగరుఁడు విపక్షులం జేరుననుకొంటివా? అగుఁగాక! మీ పాపమునకుఁదగిన ఫలము నందుదురుగాక!

బుద్ధి:-పాపమునకే వృద్ధి. వారికే విజయ మగునట్లున్నది.

శ్రీధ:-ఏమి! ఇందువారునెగ్గుటరిది. తండ్రితాతల నాటనుండి మీవారు మంత్రిత్వమున విఖ్యాతిఁగాంచుచు రాజ్య సంరక్షణ మాచరించినారు. అట్టివంశమున జన్మించి యేకపటమునులేక చరించుచున్న నీయెడ రాజునకుఁ గ్రోధము గల్గింపఁగలరా? అదియునుంగాక నీయందుఁ బూర్వము నుండియు రాజునకు మక్కువగలదు.

బుద్ధి:-అది నశించుచున్నది. నాయందు రాజునకుఁ బూర్వగౌరవములేదు. లేకపోవుఁగాక. నామంత్రిత్వము పోవుఁ

గాక. నాకందులకు విచారము లేశమును లేదు. కాని, సుప్ర సిద్ధమై, శత్రు భీకరమై, చిరకాలమునుండి వచ్చుచున్న యీవిజయనగర సామ్రాజ్యము నాకాలమున—

అతని కన్నీల నీరు గిఱ్ఱునఁదిరిగెను. స్వరముమారెను. క్రోధవిచారపూరితమై ముఖము ప్రకాశింపఁజొచ్చెను. అతఁ డింక మాటలాడలేకపోయెను.

శ్రీధ:-అయినచో నీసలహాలను రాజుగారు పూర్వమువలెనంత హెచ్చుగాఁగైకొనుచుండుటలేదు ?

బుద్ధి:-లేదు.

శ్రీధ:-ఆదిల్‌శాహా మిక్కిలి సమర్థుని వలెఁ గన్పట్టుచున్నాఁడు. చేయునది ద్రోహమైనను, దూరాలోచన, కార్య నిర్వహణ చాతుర్యము కలవాఁడు.

బుద్ధి:-అవు నతఁడట్టివాఁడే. విశాల మగు సామ్రాజ్యము గలదు గదా యని మనప్రభువులు గర్వించుచున్నారు. కాని, క్రిందు మీఁదు లరయుటలేదు. చూచుఁడు! ఆదిల్‌శాహాయొక్క కార్యనిర్వహణము. ఆచాతుర్యము! అతఁడు గోల్కొండ నవాబుతో స్నేహము గావించినాఁడు. అంతియకాక చిర కాలమునుండి యాదిల్‌శాహాకును, నిజామునకు, విరోధ ముగలదు. అదిపోవుటకుగాను దాను నిజాము కూతురైన చాంద్‌బీబీని బెండ్లాడినాఁడు! మఱియుఁ దనచెల్లెలిని నిజా ము పెద్దకుమారుఁడగు మీరిజా కొసంగెను.

శ్రీధర:-నిజమే. ఆ! ఈవిషయములనేని రామరాజు తల పోయలేదు గాఁబోలు.

బుద్ధి:-ఇదియెల్ల గమనించిచూడ నాకుఁ దురుష్కరాష్ట్రముల వారెల్లఁగలిసి విజయనగరముపైకి వత్తురను నమ్మిక నోడ ముచున్నది.

శ్రీధర:-ఈ తంత్రములెల్ల నితఁడు కడు చమత్కృతితో నడుపు చున్నట్లు తోఁచుచున్నది. మంచిది! దినదినము నా శిష్యుల నంపి వార్తలనెల్లఁ దెప్పించుచుందును. కాని, నీవు మాత్ర ము మిక్కిలి జాగరూకుఁడవై మెలంగవలయును జుమీ! వారు నీ కేమేని హానిసేయుదురని నాకు భయము వొడము చున్నది. ఆహాహా! యెంతపని జఱుగుచున్నది! ఎంతపని జఱుగుచున్నది! కానిమ్ము. వీరిపని నెల్లను విఘ్నముసేయఁ జాలిన తంత్రమే దేని లేదా?

బుద్ధి:-వారు నా బొందిలోఁ బ్రాణ మున్నంత వఱకు నాకే హానియుఁ జేయఁజాలరు. విజయనగర సామ్రాజ్య రక్షణకు నా ప్రాణము వలయునేని సంతోష పూర్వకముగా నొసం గెదను. నా కంతటి భాగ్యముగూడునా?

శ్రీధ:-సరే. కర్తవ్యమేమి?

బుద్ధి:-శిష్యుల నాయాస్థలములకుఁ బంపి తెలిసికొనుట మొద టిది. రెండవ దత్యంతా వశ్యకమగు విషయము. ఆదిల్

శాహో తన కుట్రలోఁ జేరడని యెఱిఁగి విజయసింహు నెటు లైనఁజంపఁబ్రయత్నము సేయుచున్నట్లు పొడకట్టుచున్నది. అతఁడు నేఁడు శృంగార పురమునకుఁ బోవుచున్నాఁడు. దారిలో నతని కేయాపదయు రాకుండఁ జూడవలయును. నీ విప్పుడేపోయి యతనింగలసికొమ్ము. తక్కిన విషయ ములు తర్వాత మాటలాడు కొందము.

శ్రీధ:-సరే. నేఁబోయెదను. నీవును, ఈ దారినిబొమ్ము.

బుద్ధి సాగరుఁడు తలయూఁచెను. శ్రీధరుఁడు నిష్క్రమిం చెను. బుద్ధిసాగరుఁడును ముందడుగు వైచెను. తలను బైకెత్తి ఆకసమువంక దృష్టి సారించెను. 'దేవా! విజయనగర సామ్రా జ్యమును రక్షింపుము' అని యతని పెదవు లుచ్చరించు చున్నట్లుగఁ జరించుచుండెను.

# రెండవ ప్రకరణము

## తారానాథుఁడు

ఆకాలమునఁ బ్రపంచమునఁ గల విశ్వవిఖ్యాత మహా నగరములలోఁ బ్రథమస్థానముఁగాంచి, హిందూదేశ యశో వైభవ సంపత్సమార్జనమున నగ్రస్థానము వహించి, యత్యద్భుత శిల్పకళా విశేషముచే నెసఁగు ప్రాసాద జాలముల మించి, ప్రకృతి సౌందర్య సౌభాగ్యమునకు సంపూర్ణ నికేతనమై, సకలలోక కవి పండిత సంస్తుత్యమై, అనిర్వచనీయమై, అనన్య లబ్ధ విభవమై, ఖ్యాతినందిన విజయనగర పట్టణము నొకసారి చూతము వచ్చెదరా? మీకు హుషారు లేదా? కొంచెము కాలము తప్ప మఱేమియు మనము వ్యయము సేయ నవసరము లేదు! ఆకసమును ముద్దు పెట్టుకొనుచు విశుభ్రకాంతి పుంజములచేఁ గల ధౌతశిఖరులోయను భ్రమఁబుట్టింపఁ జాలిన యాహర్మ్యములను, ఆ ప్రాసాదములను, ఆ యుత్తమ భవనములను, ఆ రాజమందిరములను, ఆ విద్యాశాలలను, ఆ నాటకశాలలను, జూడుఁడు! ఇట్టి వెందేని గలవా? అదిగో దూరమునుండి పాడుచున్న యా సుందరుల మృదుమధుర కలవరములను వినుఁడు! ఆపాడుచున్న దెవరు? అప్సరసలో? గం

ధర్వ భామినులా? మఱెవరు? నయన సుభగములై యొప్పా రుచు, సకలవిధకుసుమఫలాకీర్ణములైన యీ యుద్యాన వనముల ప్రకృతి సౌభాగ్యమును విడిచిపెట్టుటకు మీ మనసొప్పు చున్నదా? ఆహా! అటుచూడుఁడు! సాయంతన వినోద కేళీ విహారార్థమై వచ్చి సౌధోపరిభాగముల నిటునటు తిరుగుచున్న యాచపలాక్షుల మొగము లెంత మనోహరములుగా నున్నవి! బంగారు తేటవలె భాసిల్లుచున్న వారి మొగములపై కెట్లు మందమారుత ప్రేరణమున ముంగురులు వ్యాపించు చున్నవో చూడుఁడు! ఇదిగో, చెటాపటీలు పట్టుకొని షికార్లు సేయుటకుఁ బోవుచున్న యీవయసుకాండ్ర విలాసము, సౌందర్యము, చాకచక్యము నవలోకింపుఁడు! అల్లదిగో, ఆ వర్తక స్థానములఁ జూడుఁడు! రత్నములు, మణులు, ముత్యములు, గుట్టలు గుట్టలు!!

"వక్రః పన్థాయ దపి భవతః ప్రస్థిత స్యోత్తరాశాం
తీరోత్సంగ ప్రణయ విముఖో మాస్మ భూరుజ్జ యిన్యాః"

నగర సామాన్యమగు నుజ్జయినికే యింతగా నుబ్బి తబ్బిబ్బయినకాళిదాసీనగరముం జూచెనేని యేమగునో? ఎచటఁజూచినను గీతములే! మృదు మధురగానములే! సౌందర్యమే! సౌభాగ్యమే, హర్షమే!—ఇదియేమి? స్వర్గమా? భూలోకమా? యక్షలోకమా? మఱేమి? ఏమి, ఆ ప్రాసాదములు! రాచబాటలు! వీధులు! నాటకశాలలు! సంగీత శాలలు!

అట్టి యీవిజయనగర సౌభాగ్యమును గనులారఁజూడ వలయునని కాఁబోలు సుధాకరుఁడు తనకాంతులను దిరస్కరించుచున్న యాహర్మ్యములయు, రాజసౌధములయు, శిఖరములపై వ్యాపించి తన్నగరవీధులలోఁ బరిక్రమించి, యాభవనముల గవాక్ష మార్గములగుండ లోనఁబ్రవేశించి, స్వర్గలోకమునుండి విలోక నోత్సాహియైవచ్చిన ద్రష్టయోయన నొప్పి యప్పట్టణమునసంచరించుచుండెను. ఇంతప్రణయముతో నిట్లుచరించుచున్న యాశుభ్రాంశుఁడా మహానగరము నంధకారమున ముంచిపోవునా ? అట్టియెడ నాచంద్రునికి సమకాలికుఁడై మఱియొక నూతనపురుషుఁ డా నగరముంబ్రవేశించెను. అతని మొగము చంద్రునివలె గుండ్రముగానుండెను. అతఁడా పట్టణమునకు వెలుపలగానున్న యొక బాటదగ్గఱఁగల యొక సరస్తీరమున నిలుచుండియుండెను. బహుశః అది యతనికి సంకేతస్థలమై యుండవచ్చును. అడఁడా రజనీ మనోహరతనుగాని యాచంద్రుని విలాసమునుగాని చూచుటలేదు. అతనికా చల్లగాలిలో షికారుచేయవలయుననియు లేదు. అతని మొగముఁజూచిన నతఁ డతిదీర్ఘమగు నాలోచనయందున్నట్లు మనకు స్ఫురించును. అతఁడిట్లనుకొనఁ దొడఁగెను.

" ఆహా ! రాజకీయ వ్యవహారములు మిక్కిలి పాపకరములు. ఛీ ! ఛీ ! ఇంతకంటెను బిచ్చమెత్తుకొని జీవించుట మేలుగానుండును. అయ్యో ! రాజుల కొల్వులలోనుండు

వాఁడు పాపమునకు జంకఁగూడదు. కొంపలుతీయుటకు జంకఁగూడదు. ఒకరిని నాశముసేయుటకు జంకఁగూడదు. ఛీ! నేనిప్పు డీకార్యము నెట్లుసేయుదును?"

"అయ్యో! సుప్రసిద్ధమగు విజయనగర సామ్రాజ్యమును నాచేతులతో నాశముసేయవలసి వచ్చుచున్నది. నే నీపనికేమని పూనుదును? ఇదివఱకు నీ సామ్రాజ్యమువలన దక్షిణహిందూదేశమునఁ దురకలకుఁ గాలువెట్టవలను పడినది కాదు. ఇఁక నిదిగూడఁ దక్కినహిందూదేశమువలె వారిహింసలకు లోనుగావలసి వచ్చునుగాఁబోలు! ఛీ! కాదు. నాబోఁటి యల్పునివలననేమగును? సర్వము కాలవశము. మనుజులవలన నేమగును? మనమేపాటివారము? సామ్రాజ్యములు పోవుటకుఁ గాని నిలుచుటకుఁగాని నావంటితుచ్ఛమానవులు కారణము గాదు. దైవముతప్ప మఱేదియు నీ పనులుసేయఁజాలదు."

"ఇట్లని శాస్త్రిములు చెప్పుచుండఁగా నేను వృథాగా నిట్లు భయపడనేల? నేనిప్పుడు చింతింపనేమి ప్రయోజనము? ఇదివఱకే గోల్కొండ నవాబునకు మాట యిచ్చితిని. అది తప్పిన ద్రోహముకాదా? వెనుక నూయి, ముందు గోయి. ఎట్లు కావలసియున్న నట్లగును. వృథాగా నాకు వచ్చు లాభమును బోఁగొట్టుకొన నేల? గోల్కొండ నవాబు చెప్పినట్లు నడచుకొని రామరాజును మోసపుచ్చితినేని రాజ్యమువచ్చును. సామంత రాజు నగుదును. అంత యదృష్టమా?"

ఇంతలో నచటికొక వేత్రహస్తుఁడువచ్చి యతనిముందు నిల్చెను.

మన గోల్కొండ మంత్రి యతనివంకఁ జూచి తన్నుఁ గొంపోవ వచ్చిన వాఁడని గ్రహించెను. వేత్రహస్తుఁడు ముందు నడచుచుండెను. మన మంత్రి యతనిని వెంబడించెను.



# మూఁడవ ప్రకరణము

## చదరంగము ప్రారంభము

విజయనగరపట్టణమున నొకచోటి కిప్పుడు మన మరుగ వలసియున్నది. ఆ మహాసముద్రమున మనము మన గమ్య స్థానముం గనుగొనఁ గలమా? మనకిపుడు రాజబాటల నడువ వలసిన యగత్యము లేదు. వీధులజోలికి మనము పుచ్చుకోఁ గూడదు. మనకిపుడు గావలసినవి సందుగొందులు. ఇదిగో! యీసందులోఁ జొఱఁబడి నడువుడు. ఈసందునుండి యాసందు, ఆసందునుండి యీసందు, ఇట్లు పోవలయును. ఇవియన్నియుఁ జిన్నసందులన్న మాటయేగాని పాఁడుపడ్డవిగావు. ఇదిగో! ఇప్పుడు మనమువచ్చిన చోటుచూడుఁడు! ఇచటఁ గొంచెముపాడువడినయిండ్లు గనఁబడుచున్నవి. ఇదిపట్టణము వెలుపల. అదిగో! అచ్చట చిన్నకొండ యగుపడుచున్నది. చూచితిరా? అందు గుహ యొకటికలదు. మన మచటకిఁబోవల యును. మనమందుఁ బ్రవేశించితిమేని యదిమనలనొకయుపవనమునకుఁ దీసికొనిపోవును. అందొక చిన్నబంగళా కలదు. చూడుఁడు! ఆబంగళాలో నొక తురుష్కుఁడొక కుర్చీపైఁ గూర్చుండి యున్నాఁడు.

అతనిమొగము బంగారుచాయగలది. అందు రాజకళ లగుపడుచున్నవి. అతనిని మనము చూచియుండలేదుగాని యిదివఱకతనిగూర్చి పెక్కుసార్లు వినియున్నాము. అతఁడే యాదిల్ శాహా. అతఁడు మనగోల్కొండ మంత్రికొఱ కెదురు సూచుచుండెను. ఇంతలో నొకభటుఁడతనిం దనవెంటఁబెట్టు కొని తీసికొనివచ్చి నవాబు నతనికిఁజూపించి పోయెను.

ఆదిల్:- ఓహో! తారానాథులుగారూ! తమకొఱకే యెదురు చూచుచుంటిని. సమయమునకే వచ్చినారు. మీకునూ రేండ్లాయువు. మిమ్ము నల్లా రక్షించునుగాత!

తారా:- నాకన్నులు ధన్యతంగాంచినవండీ! నేఁడు సుదినము మీదర్శనభాగ్య మబ్బుటచేత.

ఆదిల్:-చిత్రము. కార్యమేమి చేసికొని వచ్చినారు? శ్రీ గోల్కొండ నవాబుగారికి క్షేమమేగదా?

తారా:-పైసంగతులు మాటలాడుకొందము. ముందీ యుత్తరముఁ జదువుకొనుఁడు.

అని యతఁడొక యుత్తరముందీసి యాదిల్ శాహా కరమున నుంచెను. అతనికి నాతురత హెచ్చెను. తోడనే యతఁడు దీపము వెలుఁగునఁ దనలోఁ దానిట్లు చదువుకొనఁ జొచ్చెను.

‘ మిత్రశేఖరా! మీరు వ్రాసిన యుత్తరమందినది. మీ యుద్దేశ్యమెంతయు సంస్తవనీయమై యున్నది. మీరు మహా

స్మదీయ మతమునకై సేయుపనికి మన రాజ్యముల వారెల్లరుఁ దోడ్పడుదురని నమ్ముచున్నాఁడ. దేవుఁడయిన యల్లా తప్పకయిందు సాయముచేసి తీరును. ఏలయన నిది న్యాయమైన కార్యము. కాఫరులు రాజ్యము సేయుటకు తగువారు గారు. మనలో మనకు సరిగాఁ గుదురకుండుటచేతఁగాదా యిట్లు దేశమెల్ల హిందూరాజులు రాజ్యముల నేలుచున్నారు? ఆ విజయనగరసామ్రాజ్యముపేరు విన్న గుండెలు పగిలిపోవు చున్నవి. ఎంత సామ్రాజ్యము! ఎంతసామ్రాజ్యము! ఏమి వైభము! అది మనకుఁ బ్రక్కలోని బల్లెము. దానివలన మనమెన్ని కష్టములను బొందుచున్నదియు దైవమునకెఱుక. నిన్నమొన్ననే నన్నుఁ బెట్టినపాట్లు మీరెఱుఁగరా? ఇంతియేగాక గత యుద్ధములలో విజయమందిన హిందూసైనికులు మనకును మన మతమునకును జేసిన యపకారములు............... చెప్ప శక్యముగాదు. నిజముగా మన మతమును మనము రక్షించుకొనవలసి యున్నది. అది యల్లాకుసమ్మతము. కాని మీరన్నట్లు వారిని యుద్ధములో జయింపలేము. స్నేహము నటించుచునే వంచించి విజయమందవలెను. ఆ యాంధ్ర వీరుల పేర్లు తలఁపఁగనే గుండెలు వ్రక్కలగుచున్నవి! అట్టి సామ్రాజ్యము తోడను, ఆ సైనికులతోడను మనమెల్లరమును గూడఁగలిసియెదుర్కొనినను జయింపఁజాలము. ఇప్పుడు మీ

కడకుఁ దారానాథునంపితిని. మీరు సమయోచితముగా నేదియోపన్ని, ఇతనిని రామరాజుసేనలోఁజేరునట్లు సేయుదురని వేఱుగాఁజెప్పవలయునా? మీరక్కడ మిత్రభావముతోడను, పుత్త్రీభావముతోడను, ఉండి శత్రువుల గుట్టు తెలిసికొనుట మనకెంతయుఁ బ్రయోజనకారి........................'

క్రమక్రమముగా నదియెల్లనుజదువుకొనునప్పటి కాదిల్ శాహా మొగము షోడశకళాపరిపూర్ణమయిన చంద్రబింబము వలెఁ బ్రకాశింపఁజొచ్చెను. అతని మొగమునఁ జిఱునగవు దోఁచుచుండెను.

అతఁడు మిగుల జిత్తులమారి. అతనికినిశ్చయముగామత మునందు భక్తిలేకపోయినను మతావేశమును గల్గించినఁగాని తురుష్కులెల్లఱును జేరరని తంత్రముపన్నెను. మతము మిక్కిలి భయంకరమయినది. మతకక్షలచేఁ బ్రపంచమున నెన్నియో సామ్రాజ్యములు నశించినవి. అనేక లక్షలుజనులు మతయుద్ధములలోఁ దమ ప్రాణములను నిశ్చింతగా వదలిరి. ఈ కాలమున మనకంతగా మతపుఁబిచ్చి లేదు. కానిపూర్వమట్లుగాదు. మతమునకుఁ బ్రాణము లర్పించువారు. ఆకారణముచేతను దురుష్కులు తమ్ము పెట్టిన బాధలకుఁ దగిన ప్రతీకారము సేయవలయునని హిందువులు గతించిన రెండుమూఁడు యుద్ధములందుఁ గల్గిన విజయములలో మహమ్మదీయులను జాల

బాధపెట్టిరి. అందుచే నుభయపక్షములలోను క్రోధము రాజుచుండెను.

ఆదిల్:-మఱి మీరు కొల్వులోని కెప్పుడు వచ్చెదరు?

తారా:-మీ చిత్తము వచ్చినప్పుడు.

ఇట్లు వారిరువురును గొంతసేపు మాటలాడుకొనిరి. యోచనలు పెక్కులు కావించిరి.

---

# నాల్గవ ప్రకరణము

## ఢిల్లీకిఁ బ్రయాణము

రజనీకాంతధరించిన నీలవస్త్రమువోలె నల్గడలం జీకట్లు వ్యాపింపఁదొడఁగెను. మృదుమధురావ్యక్త కలనిస్వనంబులు మీఱ విహంగములు వృక్షములనుండి శ్రవణానందముగాఁ గూయుచుండెను. రజనీసుందరి విశ్రమించు మంచముయొక్క పందిరియో యన నాకసము శోభిల్లుచుండెను. చుక్కలందలి పాదరసపుబుడ్లకరణిఁ బ్రకాశించుచుండెను.

అట్టియెడ విజయనగర పట్టణములో నొకచోటఁ బ్రాసాదముమీఁద నొక మానవ విగ్రహము షికారుసేయుచుండెను. అతని మొగ మతిగంభీరముగాఁ దోఁచుచుండెను. అతని వయ సరువదియేండ్లకు మించియుండును. మీసములు నెరసినవి కాని యేవో నల్లనిరంగులు వానివర్ణమును మార్చినట్లు కానవచ్చుచున్నది. అతఁడొక యుత్తమవంశీకుఁడైన రాజువలెఁ దోఁచుచుండెను. అతఁడే మహాసామ్రాజ్యమునకు నాథుఁడు. చక్రవర్తి. అతఁడేదో దీర్ఘముగ నాలోచించుకొనుచుండెను. అతఁడున్న యీభవనమునసే చక్రవర్తికిఁగల రహస్యవ్యవహా

రము లాలోచింపఁబడును. యుద్ధవిషయములు మొదలగు విశేషముల నిందుఁ జర్చింతురు.

అతఁడింకను నాలోచించుకొనుచునుండెను. ఇంతలో నొక మానవవిగ్రహము రంగస్థలమునకు వచ్చెను. అతఁడు మనరామరాజునకు సలాముచేసెను. రామరాజు కను సన్న చేసి కుర్చీపైఁ గూరుచుండెను. ఆ నూతన విగ్రహమును గూర్చుండెను.

రామ:-ఆదిల్ శాహా! మఱి గోల్కొండవార్తలేవియు వచ్చుట లేదేమి?

ఆది:-చిత్తము. రాకేమండి? ఎప్పటివార్తలప్పుడే వచ్చుచున్నవి.

రామ:-విశేషము లేవేని గలవా?

ఆది:-చిత్తము. సంతోషకరమైన వార్తలే గలవు. గోల్కొండ రాజ్యములో నంతఃకలహములు ప్రారంభమైనవి.

రామ:-ఏమి? అంతఃకలహములా? ఎట్లుసంభవించినవో తెలిసినదా?

ఆది:-చిత్తము. సాంతముగాఁ జెప్పెదను. ఆ నవాబు మిక్కిలి పాపవృత్తిగలవాఁడని మీరెఱుఁగుదురుగదా? అతనికిఁ దారానాథుఁడను మంత్రికలఁడు. ఆయన పుత్త్రిక మిక్కిలి చక్కనిది. ఆమెను దనకిమ్మని నవాబు నిర్బంధించి నానా విధముల బాధించెను.

రామ:-అవును, తారానాథునిపేరు వినియుంటిని. అతఁడు రాజకార్య నిర్వహణమున మిక్కిలి నేర్పరి యఁట. పాపము! తరువాత నతనిగతి యేమయినది?

ఆది:-అతఁడందుల క్లిష్టపడలేదు. దానిపై నవాబు కోపించి తారానాథుని, అతనిభార్యను బిడ్డలను, జెఱసాలలోనుంచి హింసింప నారంభించెను. పాపము! మంత్రిమాత్రమట్టిస్థితిలో నెట్లో తప్పించుకొని కార్యమును సాధింప నన్యదేశమేగి నట్లు తెలిసినది. భార్యకు బిడ్డలకుమాత్రము పాట్లు తప్పి నవికావు......ఛీ! ఇట్టిరాజులను ముక్కలుగాఁ గోసి నను బాపములేదు. రాజులే యిట్లు ప్రజలను హింసించిన నిఁకఁ బ్రజలకు దిక్కెవరు?

రామ:-హరహర! ఎంతపనిచేసినాఁడు! అతని కంత్యకాలము ప్రాప్తించియుండును.

రామరాజు మొగము కొంచె మెఱ్ఱవడియెను. దానిని ఆదిల్ శాహా కనిపెట్టి, 'హిందువు లుదారస్వభావులు. పాప దూరులు. మా మహమ్మదీయు లట్టివారుకారు. ఎన్నియో విజయములుగాంచినను, ఒక్కహిందూరాజైన నిట్టి యకార్యము మును జేయలేదు. ఇఁక మావారో, ఒక్కనాఁడొక్క చిన్న విజయము ప్రాప్తించిన నుబ్బి గుళ్లు గూల్చి, యూళ్లుగాల్చి, మనుజుల పచ్చిరక్తములఁ బీల్చెదరు. ధర్మమని యధర్మమని విచారింపరు' అనెను.

రామరాజేమియుఁ జెప్పలేదు. కాని, యతని మనసు మాత్ర మూరకుండలేదు. ఏమేమో యోజించుచునేయుండెను. ఆదిల్ శాహా చెప్పిన వాక్యములను విశ్వసింపక సర్వము నసత్య మని తలపోయుచుండెనా? పుత్త్రుని మాటలను నమ్మకుండు వారెవరేనిగలరా? అతఁడొక నిట్టూర్పు విడిచెను. అతని యధరాగ్రములనుండి యీక్రింది మాటలు వెల్వడెను.

"హిందువుల కష్టము లెన్నటికిని గట్టెక్కవు. మూఁడు నాల్గు వందల వత్సరములనుండి వారు పడుచున్న కష్టములు దైవమున కెఱుక. ఎక్కడనో మీవంటి సత్స్వభావముగల రాజు తక్కఁదక్కిన మునల్మాను రాజులెల్ల హిందువులను—పెక్కు బాధలుపెట్టి హింసించుచున్నారు. ఇది యంతయును, ఇట్లు కావలయునని దేవుని సంకల్పమే యై యుండవలయును. కాకున్నచో నిట్లు జఱుగునా? పరాత్పరుఁడు ప్రజలకుఁ గష్ట ములు వచ్చువేళ నవతారములెత్తి రక్షించునని వాఁడుక. అతఁ డిట్లు బాధపడుచున్న హిందువుల నుద్ధరించి ధర్మరక్షణ మేల చేయఁడో?"

ఆది:-అవును. శాంతస్వభావులగు హిందువులు మహమ్మదీయుల వలనఁ జాలఁ బాట్లువడినారు. ఆ పాపఫలమును వీరనుభ వింపకతీరదు—దేవుని యవతారములు తమవంటివారే. తప్పక తమరే ధర్మరక్షణకుఁ బూనుకొనవలయును. నేను మహమ్మదీయుఁడనయినను నాకు హిందూమతమునందుఁ

ప్రీతి చాలఁగలదు. ధర్మ మెచటనుండునో అచట జయము గూడ నుండును.

రామః-తారానాథుని మనకడకు వచ్చునట్లుచేసిన నేదేని లాభము మనకుఁగల్గునా?

ఆదిల్:-చిత్రము. మీకుఁదెలియని దేదికలదు? లాభము చాల యుండును.

రామ:-అతఁడచట మంత్రిగదా?

ఆదిల్:-కావుననే యతనికిఁ జాల సంగతులు తెలియఁగలవు. గోల్కొండ నవాబు మనకు విరోధిగదా? అతని నెట్లేని సాధింపవలయును. అందునకితఁడు మనకుఁ జాల సాయము సేయఁగలఁడని తలఁచెదను.

రామ:-అతఁడు చిరకాలము తన్ను బోషించిన రాజుగుట్టును మనకుఁ జెప్పునా?

ఆదిల్:-అతఁడుగూడ మనవలె నతనికి గర్భ శత్రువుకావున నతఁడు రహస్యములను మనకుఁ జెప్పవచ్చును.

రామ:-ఏమో! హిందువులలో నిట్టి స్వామిద్రోహు లుందురని తలఁపను.

అదేమి? ఛలోక్తియాలేక యాదిల్ శాహాతంత్రమునకల మునెఱింగెనా!ఆదిల్ శాహా గుండియలలోఁ 'గలక్కు' మనియె. అతఁడు నిర్ఘాంతపోయెను. కాని, యతనిసాహసము, ధైర్యము

మాత్రము మిక్కిలి చెడ్డవి. రామరాజు ఛలోక్తిగా నప్పుడప్పుడు ప్రసంగమధ్యమున నిట్లనుచుంట నతఁడు వినియుండెను.

ప్రపంచయాత్ర మిక్కిలి దుర్ఘటమైనది. జనసామాన్యమునకే ప్రపంచయాత్ర సేయవలయునన్నఁ గొన్ని గుణములు గావలయును. అందుదూరదృష్టిమిగులనగత్యము. అదిలేనివాఁడు యాత్రసరిగాఁ జేయఁజాలఁడు. మనుజుల స్వభావము లొకతీరుగానుండవు. కొందఱు తమప్రాణస్నేహితులనుగూడ నమ్మరు. మఱికొందఱు నమ్మినట్లుండియు లోపలనమ్మరు. ఇంకకొందఱు తమహృదయములు సరళములగుటచేఁ బ్రపంచమెల్ల నట్టిదియే యనిభావించి యందఱను నమ్ముదురు. సామాన్యకార్యములలో నెట్లున్నను రాజకీయ విషయములలో నమ్మక మొకప్పుడు పెక్కు కష్టములం దెచ్చుచుండును. రామరాజు, ఆదిల్ శాహాయెడల నిజముగాఁ బరిపూర్ణ విశ్వాస ముంచెనో లేదో మన కింతవఱకుఁ దెలియదు.

రామ:- పాపము! మఱియిపుడు తారానాథుని గతియేమైనది? అతఁడేమయినాఁడు?

ఆదిల్ శాహా కొంచెముసేపు విచారించెను. అతఁడేమి చెప్పుదునాయని యోచించెను.

ఆదిల్ :- అతఁడు దయామయుఁడగు ఫిల్లీశ్వరుఁడు తనయాపదనుదీర్పఁగలఁడని ఢిల్లీకిఁ బ్రయాణమైపోవ నిశ్చయించుకొనెను.

రామ:-మఱి యతఁడు మనకడకు వచ్చునట్లు సేయుమార్గ మేది?
ఆదిల్:-అతని నిదివఱకే పిలిపించి యుంటిని.
రామ:-అతఁడిపు డిచ్చట నున్నాఁడా?
ఆదిల్:-ఆ! ఇచటనే యున్నాఁడు.
రామ:- రేపొకసారి యతనిని మనకొలువులోనికి రప్పింపుఁడు.
ఆదిల్:-చిత్తము.

ఆదిల్ శాహా మొగమునఁ దోఁపకపోయినను మనమున నాహ్లాదము హెచ్చుగాఁజొచ్చెను. చేయు ప్రయత్నము ఫలోన్ముఖమైన నెవనికి ముదముగల్గదు? మన తారానాథుఁడిటు విజయనగర సామ్రాజ్యపాలనమున భాగమువహించెను. ఆదిల్ శాహా సెలవుగైకొని మెల్లగాఁ దన గృహమునకరిగెను. కాని రామరా జింకను నేదోయాలోచించుచు నే యుండెను.

---

# ఐదవ ప్రకరణము

## ఒక వీర పురుషుఁడు

కృష్ణకు నుత్తరమున విశాలమైన యొక మహారణ్యము గలదు. అది గోల్కొండ రాజ్యములోనున్నది. అది నీరంధ్ర తరుప్రకరకల్పిత గాఢాంధకారమై, భయంకరముగఁ దోచుచుండెను. ఎచటఁజూచినను భీకరారణ్య మృగసందోహములే కానవచ్చుచుండెను. అతిభయంకరములగు హర్యక్షముల గర్జితములును, దుర్వారపరాక్రమసమేతములగు శార్దూలముల భీకర నిస్వనంబులును, మత్తకరీంద్ర ప్రకరకృతములగు ఘీంకారములును గలిసి యీవనము నలంకరించుచుండెను. ఇంకను సాయంకాలము కాలేదు. ఆభీకరారణ్యమున నొక ప్రక్క నొక బాటగలదు. ఆబాటయంత విశాలమైనదిగాక యిరుకుగా నుండెను. ఆబాట నొక బాటసారి పోవుచుండెను. అతని మొగ మత్యంత మనోహరమైనది. ప్రఫుల్లపద్మమైనను సంపూర్ణశరచ్చంద్రుడైనను ఆమొగమునకు సాటికాదు. ఆ మొగ మన్యదుర్లభములగు పరాక్రమ పౌరుషములను దోఁపించుచుండెను. అతనిమేను బంగారు కాదుగాని దానికిని బంగారునకును నిజముగా భేదములేదు.

అతఁడొక యుత్తమాశ్వము నధిష్ఠించియుండెను. అతని శిరమున నమూల్యమగు నొకపట్టుపాగా చుట్టఁబడియుండెను. అతని బాహువులు మిక్కిలి దీర్ఘములు. కనులు విశాలమైనవి. అతని మొగమున నేదేని యైంద్రజాలికశక్తి కలదా యేమి! లేనిచోఁ జూచువారినెల్ల నట్లాకర్షించుటేమి?

అతఁడు గుఱ్ఱమును మిక్కిలివడిగాఁగాక మందముగాఁ గాక యొక్కతీరునఁ బోనిచ్చుచుండెను. అతఁడు వెనుతిరిగి చూచుటలేదు. ప్రొద్దుగ్రుంకెను. అసలే యంధకారముగానున్న యాయడవిలో నిపుడు కన్నుబొడుచుకొన్నను కానవచ్చుట లేదు. అప్పుడప్పు డాకసమున నక్షత్రములుమాత్రము చెట్ల యాకుల సందులనుండి మినుకుమినుకుమని ప్రకాశించుచుండెను. గాఢాంధకారమైనది. అతనిగమ్యస్థానమిఁకఁ జాలదూరము లేదు. అతడిపుడు తనఁగుఱ్ఱమును గొంచెము తన్నెను. అది వేగముగాఁ బర్విడుచుండెను.

అతని వెనుక, మార్గమున గుఱ్ఱపుడెక్కలచప్పుడు వినవచ్చుచుండెను. కొందఱాశ్వికులును, కొంత కాల్బలమును వచ్చుచుండెను.

వారతనిని సమీపించిరి. మనకుఁ దిన్నగాఁ గనఁబడుట లేదుగాని వారికడ నాయుధములు లేకపోలేదు. వారు పెద్ద మనుష్యులవలెఁ గన్పడరు. వారిలో నొకఁడిట్లనియెను.

'ఇది మంచితరుణము. లెండు. రండు. అతని పైఁ
బడుదము.'

మఱియొకఁడు.

'కాలముపోవుచున్నది. ఆలస్యమేల? అతఁడు గమ్య
స్థానమునకుఁబోవుచున్నాఁడు. ఇకవి శేషదూరము
లేదు. త్వరపడుఁడు.' అనియెను.

ఇంకొకఁడు.

'కండ్లుమూసికొని మన మందఱమును మీఁదబడు
దము రండు. ఆలస్యముచేసినఁ గార్యముచెడును.
స్వామికార్యమును దీర్పఁజాలకపోవుదుము' అని
చెప్పెను.

వేఱొకఁడు.

'ఇదిగో నేఁబోవుచున్నాను. కార్యము మీఱినతర్వాతఁ
జింతిలిన నేమిప్రయోజనము? రండు' అనిపల్కెను.

మాటలకుఁ గ్రియలకును జాల నంతరమున్నది. వా
రతనిని బాగుగానెఱుఁగుదురు. వారిమాటలు, ఆలోచనలు,
ఎలుకలన్నియుఁ గలిసి పిల్లి నిజంపఁ బ్రయత్నించిన విధాననుం
డెను. ఒకరును ముందునకు రాలేరి. క్షుధాతుర వ్యాఘ్రమునకు
లేడిపిల్లలట్లు ముందుఁబోయినవారతని ఖడ్గమునకుఁ గబళ
మగుదురని వారికి భయము జనించెను. ఇంతలో సతఁడీసందడి
కొంతయెఱిఁగెను. గుఱ్ఱమును నాల్గుకాళ్ళ సవారికి వదలెను.

'అదిపర్వులెత్తుచున్నది. ఇఁక జాగుసేయఁదగద'ని యాభటు లెల్లరు నొకపరిగా నతనిపైఁబడిరి. వారువచ్చి తనపైఁబడుదురని యెఱిఁగి వారినెదురుకొన నతఁడు సంసిద్ధుఁడై యుండెను. అతఁడు పొడవై యతితీక్ష్ణమగు ఖడ్గమును ధరించియుండెను. రెండవచేతిలో డాలుండెను. అతని మొగము కడు నాకలిగొన్న సింగపుం గొదమ మొగమువోలె భయంకరమైయుండెను. ఇంతలోఁగత్తి పోట్లువచ్చి యతనిగుఱ్ఱమునకుఁ దగిలెను. అతని గుఱ్ఱము ముందుకాళ్ళెత్తి యొక్కపెట్టున నుఱికెను. అతఁడు వెంటనే గుఱ్ఱమును వెనుకకు మఱలించెను.

ఇపుడాతని వెనుకప్రక్క సైనికులులేరు. అబ్బా! ఏమి యాలాఘవము! ఆగుఱి! ఆశ__! ఆనేర్పు! తనకు దెబ్బలు తగులకుండ డాలును గిరగిరఁద్రిప్పి కాపాడుకొనుచుండెను. అతని దేహమెల్ల రక్తము గ్రమ్మెను. గుఱ్ఱమును వెనుకకు నడపి సైనికులను వెనుకప్రక్కకు రాకుండ గదుముచుండెను.

ఒకటి-రెండు-మూఁడు-నాలుగు-అయిదు తలలు క్రిందఁబడెను. అతనికి భార మధికమగుచుండెను. శత్రువులు మీఁదికి వచ్చుచుండిరి. గ్రీష్మకాలమధ్యాహ్నమార్తాండుని వలె నతని మొగము భాసిల్లుచుండెను. క్రోధము హెచ్చుచుండెను. ఒకఁడు పాపమెంతసేపని పోరఁగలఁడు? ఆమధుర వదనారవిందము, ఆ కుసుమసుకుమారశరీరము, ఆ పౌరుష

మూర్తి, యచట—ఆ దుర్గము కాంతారమున నశించిపోవునా యేమి ?

దూరమునుండి మఱల డెక్కల చప్పుడు వినఁబడు చుండెను. సాయుధులైన నల్గురు జనులు నాల్గు గుఱ్ఱములపై నెక్కి యా మహారణ్యమున మిక్కిలి వేగముగాఁ బరుగెత్తించుచు వచ్చుచుండిరి. వారిప్పుడు మిక్కిలి సమీపించిరి. కేక వేటుదూరమున నుండి యిట్లు వినఁబడెను. 'ఓవిజయసింహా! మేమును వచ్చుచున్నాము. భయపడకు, భయపడకు. శత్రువులం జించి చెండాడుము'

విజయసింహుఁడు మఱల నొకపరి విజృంభించెను. మండుచున్న కార్చిచ్చువలె శత్రువులను దహించుచుండెను.

నాల్గుఖడ్గములువచ్చి నాల్గుతలల నొక్కపట్టున భూమిపైఁబడఁ గొట్టెను. మఱి నాల్గుతలలు నేలపైఁబడెను. జనము పల్చనాయెను. మిగిలిన తలలకు భయము హెచ్చాయెను. తోడనే పలాయనమునకు దిగిరి. అరనిముసము గడచినది. ఎదుర్కొనిపోర నొక మనుజుఁడుగూడ లేఁడు. వచ్చిన వారిలో నొకఁడు మనమెఱిఁగినవాఁడే. అతని మొగమువంకఁ బరీక్షించి చూడుఁడు. అతఁడు శ్రీధరుఁడు. పాపము విజయసింహునకు గాయములు చాలఁ దగిలినవి. అందొక పెద్దగాయము భుజములపైఁ దగిలెను. వేఱొకటి తొడలపైఁదగిలెను. మఱొకటి శిరమునఁ దగిలెను. అతఁడు డస్సిపోయెను. రక్త నాళముల

నుండి రక్తము చిమ్మటగొట్టములనుండివోలె బయటకిఁజిమ్ము కొని పోవుచుండెను. అతని స్వరము క్షీణించెను. అతనికి మాట వచ్చుటలేదు. శ్రీధరుఁడు 'నాయనా విజయసింహా!' అనియెను.

అతఁడు పల్కలేదు. అతనికి స్మృతి తప్పిపోయినది. శ్రీధరుఁడు తనగుఱ్ఱముమీఁదనుండి దిగివచ్చి యతనింబట్టు కొని తానుగూడ నాగుఱ్ఱమెక్కెను.

కడమ మువ్వురును దారి తీయఁగా నచటికి రెండుమైళ్ళ దూరమున నున్న యొక యుటజమున కభిముఖులై వెళ్ళిరి.

---

# ఆఱవ ప్రకరణము

---

## ఏమియు లేదు

రమారమి రాత్రి పదునొకండు గంటలైనది. శ్రీధరుఁడు స్మృతితప్పి ప్రపంచమెఱుఁగక పడియున్న విజయసింహుని వెంటఁగొని యాయుటజముం జేరి తలుపుఁదట్టెను. లోనుండి యొకశిష్యుఁడు కన్నులు నులుముకొనుచు వచ్చి తలుపుతీసెను. రాత్రియుంచిన దీపముపోయినది. తక్షణమే దీపమువెల్గించిరి. విజయసింహుని దీసికొనిపోయి యొక పఱుపుపైనఁ లోపలఁ బరుండఁబెట్టిరి. అతనికింకను స్మృతి వచ్చినదికాదు. శ్రీధరుఁడు నాడిని బరీక్షించెను. అదిమిక్కిలి నీరసస్థితిలోనుండెను. సరిగా నాడుటలేదు. అతఁడు తత్క్షణమే వలసిన వస్తువులం దెప్పించి యాగాయములనెల్ల శుభ్రపఱచి కట్టుకట్టెను. అతఁడు కనులుదెఱవలేదు గాని, ఒకసారియిటునటు కదలెను. అతనికిప్పుడేమియుఁ దెలియదు. ఇంతలో నతనికి జ్వరము ప్రారంభించెను. అది యింకనుహెచ్చాయెను. తుదకు మంటలు మండఁజొచ్చెను.——

పాపము ! శ్రీధరునిగుండెలు నీరుగాఁజొచ్చెను. అతనికి విజయసింహునందుఁ గలప్రేమ యపారము. అతనింజూచి లో

లోనఁ బొరలుచుండెను. కాని యతిధీరుఁడగుటచేతఁ బయికిఁ గన్పడనీయలేదు. తెల్లవారునంతకును, అతని శిష్యులు నతఁడు నతనిం గనిపెట్టుకొని కూర్చుండిరి. అతఁడు మాటలాడలేదు. జ్వరమువడి తగ్గలేదు. భగ్గున దేహమెల్ల మండుచుండెను. ఆవడిలో నప్పు డప్పుడు కలవరించుచుండెను. కాని యతని కేమియుఁ దెలియదు. ఉదయముగడచినది. మధ్యాహ్నము గడచినది. ఈలో నొకసారి క్రిందఁబెట్టిరి. కొంచెము కొనయూపిరి యింక ను గలదు. సాయంత్రముగడచినది. అప్పటికిఁ గొంచెము కనులు విప్పిచూచెను. కాని మాటలాడలేదు. దాహమని కాఁబోలు సైఁగసేసెను. తోడనే దాహమొసంగిరి. అతఁడు మరల యథాప్రకారముగాఁ బండుకొనెనుగాని యప్పుడప్పుడిచ్చు మందును, ధారకమునుగూడ, లోపలకుఁబోవుచుండెను. మఱు నాఁడు ప్రాతఃకాలమాయెను. అప్పటికతనికి జ్వరముకొంచెము తగ్గెను. అతఁడు కండ్లు తెఱచి చూచునప్పటికి యెట్టయెదుట శ్రీధరుఁడుండెను. అతని కేమియుఁ దోఁచలేదు. మొగమెత్తి నలుగడలు వీక్షించెను. అతఁడిట్లనియెను 'అయ్యో! నేనిచటి కెప్పు డెట్లువచ్చితిని!' శ్రీధరుని మొగమునఁ జిఱునగవుతోఁ చెను. స్వాభావిక సాత్వికమగునతని మొగమున సంతోషతరంగ ములు పొర్లుచుండెనుగాని యవియన్నియు విజయసింహుని లోచన యుగ్మమును నిండింపలేదు. అట్లని యతఁడు బొత్తుగా నెఱుఁగకపోలేదు. ప్రేమానుబంధము చెడ్డది. అది దాఁగదు.

అతఁడు విజయసింహుని కర మవలంబించి చుమిరెను. శిరము నవరించెను. 'నాయనా! అదియంతయుఁ దరువాతఁ జెప్పెదను. పరుండుము' అనియెను.

విజయ :-ఇపుడు నేనున్న యీస్థలము నేరేమి?

శ్రీధ :-ఇది మనగృహమే లే. నీవుబడలియున్నావు, కొంచెము సేపు విశ్రమింపుము.

అతఁ డీ మాటలనువినెను. కాని యతనికర్థముకాలేదు. అతఁడేదో యాలోచించుకొనియెను. అతఁ డాదుర్బలస్థితిలో జరిగినయంశమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనఁజాలకపోయెను. అతఁడు మరలఁ దనచూడ్కులను యోగి మొగముపైఁ బ్రసరింపఁ జేసెను. అవి విశుభ్రకాంతులను వెదఁజల్లుచు సాత్వికభావ ప్రబోధకములై యుండెను. అతఁడట్లు స్థిమితముగాఁ గొంత సేపటివఱకుఁజూచెను. కాని మాటలాడుటకుఁగాని యోగి యాజ్ఞనుభంగము సేయుటకుగాని యతని కిష్టములేదు. ఎట్టకేలకు మరల నిద్రించెను.

ఇట్లు దినములు గడచినవి. క్రమక్రమముగా నతని బాధ తగ్గిపోవుచుండెను. శుక్లపక్ష సుధాకరుని మాడ్కి నతని మొగము దినదినము నూతనమనోహరకాంతులచే శోభిల్లుచుండెను.

ఒకనాఁటి రాత్రి రమారమి రెండు జాములు ప్రొద్దుపోయెను. దిక్చక్రమెల్లఁ బండువెన్నెలచే నాక్రమింపఁబడి ప్రకా

శించుచుండెను. ప్రపంచమెల్ల నిశ్చలమై సాధుని హృదయము వలెఁ దోఁచుచుండెను. అప్పుడప్పుడు తెల్లవారెనని లేచి కూయుచున్న పక్షుల రొదతక్క మఱేమియు ధ్వనివినవచ్చుట లేదు. విజయ సింహుఁడా యుటజమున నొకగదిలో నిద్రించు చుండెను. మందమారుతసేవకుఁ డతనికి సమీపమునఁగల మల్లికలయు, సకల విధ పరిమళకుసుమములయు, సుగంధ మును హరించి తెచ్చి హాయిగా వీచుచుండెను. అతనికి గాయ ముల బాధ చాలవఱకు నశించినది. గాఢ నిద్రపట్టెను.

అతఁడు కన్నులు తెఱచెను. మినుకు మినుకుమను దీపపు వెల్తురున నాతఁడొక సుందరీమణిం గాంచెను. ఆమె వదనము నవవికసిత సహస్ర పత్రమువలె నిసర్గమనోహరమై యుండెను. ఆమె కనులు దీర్ఘములు. వక్రములు. చారు వినీలోత్పల మాలి కల నీనుచుండెను. ముఖమునఁ జిఱునగవు ప్రకాశించుచుండెను. ఆమెకుఁ బదునాఱేండ్లుండును. ఆమె మోహిని. చూచువారి నట్టె యాకర్షించివైచును. కాని, యామె మొగమున నవ్వు డనగత్యముగాఁ జిఱునగవేల యంకురింపవలయునో? బహుశః ఆమొగ మెప్పుడు నట్లే నవ్వుచున్నట్లుండును.

అతఁ డొకసారి యా చిత్రప్రతిమవంక వీక్షించెను. మఱలఁజూచెను. కాని యా విగ్రహము గోచరముకాలేదు. ఆ విగ్రహము నతఁడిది వఱకు వీక్షించి యుండును. ఇదే మొ దటిసారికాదు. అదియేమై యుండును? నిజముగా నతఁడు

చూచినాఁడా? కలగాదుకదా? కలయేమైయుండును. లేని యెడల నట్టి యరణ్యమునఁగల యాయుటజమున, ఆ మునులి మధ్య, నట్టిసంపూర్ణ శరదిందుముఖి యేల యుండును? అతని మొగమువంకఁ జూడుఁడు. అది మాఱుచున్నట్లున్నది. అతఁడు కలకాదని తలఁచెనేమో? ఆగది నెల్ల మరలమరలఁ జూచెను. ఏమియుఁ గన్పడలేదు. కాని యతని హృదయమున నారాటము హెచ్చెను. ఇట్లనుకొనెను.

'ఏమి! యీ విచిత్రము! ఈపె స్వర్ణకుమారి కాదా? ఈ యర్థరాత్రికడ, భయంకరమయిన యరణ్యమును దాటి యిచ్చటికెట్లు వచ్చినది? ఆమె కెవరు సాయముచేసియుందురు? నేను నిజముగా, ఆమెను జూచితినా? కలయేమో! అబ్బా! మనమున కేమియుఁ దోఁచుట లేదు.'

నిశ్చయముగా నాతని కేమియుఁ దోఁచుచుండుట లేదు. పగలాయాశ్రమమున నాపె నెప్పుడు నతఁడు చూచియుండ లేదు. అతఁడిప్పటికి వచ్చి రమారమి యిరువది దినములు దాటినది. 'హా! జగన్మోహినీ! హా! జగన్మోహినీ!' యని యప్పటినుండి యతఁడు పలుసార్లు నిట్టూర్పులతోఁ గూడ నుచ్చరించుచు నుండెను. ఆ దినము గడచినది. మఱల రాత్రి యాయెను. ఆ చిత్రమేమో చూతమని యానాఁడు రాత్రి చాలవఱకాతఁడు నిద్రింపలేదు. ఎంతవఱకు నిద్రనొందలేదో అంతవఱకు నేజాడయును లేదు. అది నిశ్చయముగాఁ గలయే

యై యుండును. జాగ్రదవస్థలో నెప్పుడేని మీకుc గలలు వచ్చినవియా? తుదకతనికి విసుగువచ్చెను. తోడనే తెల్ల దామర రేకులవలెc బ్రకాశించుచున్న కన్నులు మోడ్చెను. పూర్వోక్తమగు నపూర్వమనోహర విగ్రహము మరల వచ్చి యతని యెదుట నిలువcబడియెను. ఆ ప్రదేశ మెల్ల నిశ్శబ్దముగా నుండెను. ఆమె యుచ్ఛ్వాస నిశ్వాసములను మెల్లగా విడచుచుండెను. విజయసింహుని యధరాగ్ర భాగమునుండి యేవియో కొన్నిమాటలు వెల్వడెను. అతcడు కన్నులు విప్పి చూచుచున్నాcడా? లేదు. అది నిశ్చయముగాc గలవరింత. కాని యాచిత్రప్రతిమవంకcజూడుcడు.—ఆ మొగమున నూతన మందహాసము పొడసూపెను. ఆమె యానంద పరవశ యయ్యెను. కాని, యచట నామె నిలువలేదు. ఆగది గోడలలో దొంగద్వారములుండును. లెస్సగాc బరిశోధించినcగాని యవికన్పడవు. అతcడు కలవరించుచు లేచి చూచెను. ఏమియు లేదు.

---

# ఏడవప్రకరణము

ఆమెకాశలు గల్గెను

అనాఘ్రాతంపుష్పం, కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం, మధునవ మనాస్వాదితరసం
అఖండం పుణ్యానాంఫల మివచ తద్రూపమనఘం
నజానే భోక్తారం కమిహసము పస్థాస్యతి విధిః ?

అభిజ్ఞాన శాకుంతలము.

పాఠకుడా ! నీదృష్టినొకసారి యీభౌతిక ప్రపంచము పైబరపుము. అది సకలవస్తుసముదాయము. నానావిధతరులతాసంశోభితము. వివిధజంతుసంతానవ్యాప్తము. దృగ్గోచరము. జడము. బహువిధపరిణామఫలము. అనిర్వచనీయమై, అగమ్యమై, అపారేశ్వరప్రభావ ద్యోతకమై, కమనీయమై, ద్రష్టవ్యమై, విలాసవంతమై, ఆకృతిని నీడయుంబోలె నెల్లపుడు నెడతెగక యీవిశాలవిశ్వమునెల్ల నావరించుకొని కేవల సరస హృదయైక గోచరమగు నొకనూతనప్రపంచము కలదు. అది నిత్యసంతోష సముదాయము. దుఃఖదూరము. సర్వ సౌభాగ్య సౌందర్యవస్తుసారము. మనోహరము. మృదులము. శాశ్వతము. సంతోషప్రదము. అందలిపాత్రలు జంతువులుగావు. పక్షులు

గావు. మానవులుకారు! హర్షము, సౌభాగ్యము, మార్దవము, మాధుర్యము మొదలగునవి! అది సామాన్య జనాగోచరము.

అదియే మహా కవి సార్వభౌముల హృదయములకు గోచరించునట్టి నూతన ప్రపంచము. మహాకవులందలి మృదుల భావములను, మాధుర్యమును......... తేనెటీగలు తేనెను గుసుమ సముదాయములనుండికూర్చి మాకిడునట్లు మాహృదయములఁ గ్రుమ్మరింతురు. ఆ ప్రపంచములోని మెఱుఁగులనన్నిఁటిని సేకరించి క్రొత్తమెఱుఁగులఁజేర్చి విధాత మనోహర సృష్టిని జేయుచుండును.

ఇదిగో! ఇటుచూడుఁడు. ఆయుద్యానవనమున, ఆ మాధవీ మంటప మధ్యమున నొక సుందరీమణి కూర్చుండి యున్నది. ఆమె యాకృతి నిసర్గ మధురము. మనోహరము. సకల. జగన్మనోహరము. పరిపూర్ణ శిల్పచాతురీ సారము. సంప్రాప్తనవ యౌవన విభ్రమము. సర్వోత్కృష్టము—ఆమె ప్రత్యంగమును సౌందర్య ప్రపంచమునందలి ప్రతివస్తువు నధఃకరించుచుండెను. ప్రంచమునందుఁ బూర్వము, నేఁడును, సృష్టింపఁబడిన సకల విలాసవతులను దలపోసి యందందుఁ గలలోట్లను దిద్ది క్రొంగ్రొత్త మెఱుంగులనుజేర్చి సర్వసృష్టికర్తయైన యీశ్వరుఁడుచేసిన నూతన సుందర రత్నము. ఆకనుల సౌభాగ్యము నరయుఁడు! నవ వికసితములయిన నల్లకల్వల సొరుగాని, తెల్లదమ్ముల సౌభాగ్యముగాని సాటివచ్చునా?

అవి నిరుపమములు. తిరస్కృత హరిణీ విలోచన విలాసములు. ఆకర్ణాంతములు. అన్యదుర్లభ సకల లోక వశీకరణైక ప్రసిద్ధవి నూతన విలాస సంశోభితములు. విశాలములు. మనోహరములు. చూడుము! నిష్కళంకమై నిరుపమానమై స్వాభావికచారు విలాస విశేషశోభితమై యాపె మొగమెంత హృదయంగమ ముగా నీదృక్పథమునలంకరించుచున్నదో! సంపూర్ణ రాకా మృగాంకు నా మొగముతో సరిపోల్పవచ్చునా? నవ వికసిత హేమ సహస్రపత్రమేని యా సౌందర్యమునకు సాటివచ్చునా? మనకుఁ బక్షపాతమున కవకాశములేదు. ఆ కమలముగాని, సుధాకరుఁడుగాని, యీసుందరీమణిగాని, మనకుఁ జుట్టములుగారు. ఆ యధరమెంత రమణీయము? బింబ ఫలమా దానికి సాటి? ఉపమాలంకారము చాల ప్రియమైనదేకాని ప్రపంచము గొడ్డుపోయినదా యేమి? మన కా సౌందర్యవతి యంగములతోఁ బోల్చుటకు నొక్క వస్తువైన దొరకినది కాదేమి?

ఆ సురచిరములగు కోమల కరముల నరయుము! అవి యెంత మార్దవములుగా నున్నవి! నల్లని పట్టుకుచ్చులకంటె స్నిగ్ధములై, మనోజ్ఞములై, సాంద్రములై తోఁచుచున్న యా శిరోజములు కన్నులారఁజూడుము. సర్వలక్షణ సముపేతమై, సకలలోక సమ్మోహనమై, అన్నిటినిమించి పొడసూపుచున్న యానవమందహాసాంకురమును విలోకింపుము. వీని కన్నిటి

కేమేని యుపమానము లీసౌభాగ్యమయ ప్రపంచముననున్న వేమో దయచేసి చెప్పుము.

ఆమె యెవరు? ఆమె నిజముగా జగన్మోహిని-త్రిజగన్మోహిని-సకలజగన్మోహిని. ఆమెపేరును జగన్మోహిని. ఆమె శృంగార పురాధీశ్వరుని తనయ. లోకోత్తర సుగుణసౌందర్య రాశియగు విజయసింహునికిఁ జిన్ననాఁటి స్నేహితురాలు. సహాధ్యాయిని.

ఆమె యట్లు లా మాధవీమంటపమధ్యమునఁగల యొక రాతిపైఁగూర్చుండి యేదియో చింతించుచుండెను. ఆమె మొగ మాకసమువంకఁ జూచుచుండెను. కాని యామె యాసమీపమునఁగల రసాలము నధిష్ఠించి పాడుచున్న కోకిలగీతము నాలకించుచుండలేదు. ఆలోచించుచును, ఉండలేదు.

ఆమె యీలతామంటపము నాలోకించి యి ట్లనుకొనియెను. 'ఈమాధవిని మంటపమునకుఁ బ్రాకిడినది విజయసింహుఁడు. ఇతఁడీమాధవీలతకు దినదినము మిక్కిలి శ్రద్ధతో నీరు తెచ్చి పోసిపెంచినాఁడు. ఈలతయందతని కెంతయో ప్రీతి.'

బాల్యమునందుఁ బిల్లలుసేయు సహవాసములు నిష్కల్మషములు. నిర్మలములు. వారికి ద్వేషము లుండవు. వారి కత్యంత మగు ప్రేమానుబంధము కుదురును. ఇది జీవితాంతము వఱకు మఱపురాదు. ఆమె మరల నిట్లనుకొనియెను.

'విజయసింహునిజూచి చిరకాలమైనది. ఇతఁడు నేనును స్వర్ణకుమారియుఁ గలిసి చదువుకొనునప్పుడు నిత్యము నీ యుద్యానవనములఁ బూవులుకోసి మాలికలుగాఁ జుట్టుకొను చుండువారము. పూలచెట్లకొకరి నొకరుత్సాహమున మీరి నీరుపోయుచుండు వారము. అవి సంతోష దినములు.'

దూరమునుండి యవ్యక్తస్వనములతో నందెలచప్పుడు వినవచ్చుచుండెను. కాని యామె వినలేదు. సంధ్య ప్రాచీ ముఖమును రక్తిమతో నలంకరించెను. ఆ నిస్వనములు సమీపించెను. ఆమె స్వర్ణకుమారి. ఆమె యిట్లనెను. 'ఈసాయంసమయమున నిచటికివచ్చితివేమి? నీవుందువని నేను సంగీతశాలకుఁ బోయివచ్చితిని.'

జగ:-ఏమియును లేదు. ఈసాయంసమయమున నీమాధవీలత క్రిందఁజల్లగానుండునని వచ్చితిని.

స్వర్ణ:-అగును. ఇది విజయసింహుఁడు——

ఆమె మొగమునఁ బరిహాసము ప్రస్ఫుటమగుచుండెను. అమె యంతకంటె నెక్కువ వచింపలేదు. జగన్మోహిని మోము విరళమాయెను. ఆ పెయిట్లనెను.

'అగును. నీ మాట లెప్పుడు చమత్కారదాయకము గానుండలేదు?'

స్వర్ణ:-నేను నీకు నత్యంతప్రియమగు నొకవస్తువుం జూపఁదలఁచితిని. నీకిష్టమేనా?

జగ :-ప్రియవస్తుదర్శనమున కిష్టపడనివారుందురా ?

స్వర్ణ :-నీకుఁబ్రియమైన వస్తువేది ?

జగన్మోహిని యోచించెను. ఆమెకేమియుఁ దోఁచినది కాదు. చివరకిట్లనెను.

'నీకేదిప్రియమో నాకు నదియే ప్రియము'.

స్వర్ణ:-నాకుఁ బరిహాసము మిక్కిలి ప్రియమైనది. ఇది నీకుఁ బ్రియముకాదు. ఒకరికిఁ బ్రియవస్తువు మఱియొకరికిఁ బ్రియమగునా ?

ఆమెకుఁ బ్రత్యుత్తరము తోఁపలేదు. నిశ్చలభావము వహించి యూరకుండెను. కాని యిట్లనుకొనెను.

" ఆ ప్రియవస్తువేమై యుండును ? ఈమె మొగము తీరు చూడఁగా నాకు విజయసింహుని దర్శనమేమోయని సందేహము పొడముచున్నది. అతనిజూచి చిరకాలమైనది. మనస్సతని పునర్దర్శనమున కువ్విళులూరుచున్నది. కాని యదృష్టవిదూరనగు నాకంతటి భాగ్యమా ?"

స్వర్ణ:-ప్రియవస్తువునే చెప్పఁజాలని వారికిఁ దత్ప్రియదర్శనమెట్లగును ?

జగ:-కానిమ్ము. ఆ ప్రమేయమువాని కొంచెము సేపిచట నుందమురా !

స్వర్ణ:-ఇచటనుండుట నాకు సంతోషములేదు.

జగ :-ఎందుచేత ?

స్వర్ణ :-తత్ప్రియసందర్శనముఁగూర్చి నీకు మోదము కూర్పు కుండుటచేత.

ఆమె కాశ్లుం కల్గెనుకాని నిశ్చయములేదు. స్వర్ణ కుమారి ఆపెకంతకంటె నేమియుఁజెప్పినదికాదు. ఆమెమనను జోలికవలె నూగులాడఁజొచ్చెను.

స్వర్ణ :-'వెళ్లుదమురా' అనియెను.

ఆమె లేచినది. సమనోరథమై కదలు చిత్తముతో స్వర్ణకుమారిని వెంబడించినది. వారిరువురు ప్రఫుల్లకుసుమ సందోహ విరాజితములగు వల్లుల మధ్యముగను, దర్శనీయము లగు రసాలముల మధ్యగను మెల్లమెల్లగ నడచి సంధ్యాసమ యమగుడు నల్లడల వ్యాపించుచున్న లేజీఁకట్లలోఁ గ్రమక్రమ ముగా దృష్టి పథమునుండి తొలఁగిపోయిరి.

---

# ఎనిమిదవ ప్రకరణము

## అతని హృదయము ఝల్లుమనెను

అది, మందమారుతముచే నొడలు మఱచి, తమ్మాను కరింపుచు, తమవెనుక గంతులు వైచుచు నుల్లాసవశమున దుముకుచున్న కిశోరములను సానురాగముగాఁ వెనుదిరిగి చూచుచు, దర్భాంకురములఁ గొఱుకుచున్న హరిణుల పైఁ దమ చూపులను ఓరవంపుగాఁ ద్రిప్పి, హరిణములు చూచుచున్నట్టి సాయంసమయము. సంజ నిష్క్రమించెను. ప్రాచీ దిగ్భాగమున నిలిచి రజనీమనోహరుఁడు విలాస సంశోభితములగు తన చూడ్కులను బ్రియాముఖమునఁ బఱపుచుండెను. రజనీముఖము పరిపూర్ణప్రభా భాసురమాయెను.

జగన్మోహినీ స్వర్ణకుమారులట్లు నడిచి తుదకొక సౌధప్రాంతముం జేరి యందుఁ బ్రవేశించిరి. స్వర్ణకుమారి యాపె నా. సౌధమధ్యభాగమునకుఁ గొంపోయి విడిచి, తోడనే వెనుకకు గిఱ్ఱునఁదిరిగి నిష్క్రమించెను. అచట విజయసింహుఁడుండెను. ఆ సుందరీసుందరుల మొగము లుల్లాసవంతములై ప్రకాశింపఁజొచ్చెను. వారిరువుర నోట నొక మాటయైన రాలేదు. నిశ్శబ్దముగ నుండెను. ఇరువురుం జిత్రప్రతిమల

వలె నుండిరి. అరనిముసము గడచినది. జగన్మోహిని మెల్లగా 'స్వర్ణకుమారీ! పోయితివా?' అనియెను. ప్రత్యుత్తరము రాలేదు. మఱి యీమె యామెను బిలువలేదు. ఆపె యట్లుండవలెనని తలంపలేదు.

విజయ :-జగన్మోహినీ! నీదర్శనము చిరకాలమునకు సంప్రాప్తమైనది. క్షేమమేగదా?

ఆమెయొడలు పులకరించెను. అది చిరకాలముండలేదు. కాని యామె మొగము వ్రీడావిలాసముచే నలంకరింపంబడి నూత్నశోభచేఁ బ్రకాశించుచుండెను. సిగ్గు సుందరీమణులకొక యమూల్యాలంకరణము. యౌవనము విచిత్రమైనది. అది విలాసవతులను, విలాసవంతులను బరిపూర్ణముగా మార్చివేయును. ఆ యిరువురు బాల్యమునుండి మిత్రులు. సర్వకాలములయందు నొకరి నొకరు విడువక కలసి మెలసి యుండిరి. వారికపుడు సిగ్గులేదు.ఆభావమే వారెఱుఁగరు. వారి హృదయములు నిర్మలములు. నిష్కళంకములు. అవి యిపుడును నిష్కల్మషములేకాని యిపుడు వారిస్థితి మారినది. నవ యౌవనము వారి నలంకరించినది. ఇపుడు వారిద్దఱకును మునుపటిచొరవలేదు. అది హిందూసుందరీ సుందరులకు సహజము. ఆ యిరువురిమొగమున నించుక మందహాస మంకురించెను.

ఆపె యిట్లనెను. "అవును! బాల్యస్నేహమును మఱచి పోయితివి గాఁబోలు. విజయసింహా! యింతకాలమైనను, ఒక

సారి వచ్చిచూచి పోవుటకు నీకుఁదీరిక లేక పోయినదా?”
ఆమె మెల్లగాఁ గ్రిందికిఁజూచెను.

విజయ:-రాజసేవ మిక్కిలి దుష్కరమనుట నీవెఱుఁగవా? ఎంతప్రయత్నించినను నాకురా వలనుపడినదిగాదు. నా యాలస్యమునకు క్షమింపుము.

జగన్మో:-విజయసింహా! యుద్యోగ విధులనన్నిఁటిని జక్కఁగా నిర్వర్తించుచుంటివి గదా? మానవులకుఁ దమ విధుల నెఱవేర్చుకొనుటకంటె కర్తవ్యము లేదు. అది ప్రధానము.

విజయ:-అవును. నీవన్నది సత్యమే. నా యెఱిఁగినంతవఱకు లోటుపాటులు లేకుండ నావిధిని నెఱవేర్చుకొంటిని.

జగన్మో:-నీకుఁ దెలియని యంశములనియుఁగాదు, విధిని నెఱవేర్చుటయే పరమ ధర్మముగాఁ దలను దాల్చుటకు బద్ధకంకణుఁడవు కావనియుఁగాదు. కాని యుద్యోగ వశమునఁ బ్రమత్తులగుట మనుజులకు స్వాభావికము. నీ స్వభావమందుకు వ్యతిరేకము. అయినను స్నేహముచేఁ జెప్పుచుంటిని. చిన్ననాఁటి నీ స్వదేశ రక్షణోద్దేశమును మఱవలేదు గదా? చిన్నతనమున గ్రంథములు పఠించుకొనుచు భరత ఖండముయొక్క దుస్థితిని గూర్చియుఁ దురుష్కుల కంటకమగు పరిపాలనముం గూర్చియుఁ బెక్కుసారులు మనము సవిచారముగాఁ జర్చించుకొను చుండెడివారము. అప్పుడు నీ కనులొక్కొక్కప్పుడు సబాష్పములును, ఒక్కొక్క

ప్పుడు రక్తవర్ణ సంశోభితములు నగుచుండెడివి. అదియం
తయు బాగుగా జ్ఞప్తియందున్నదా? ఆంధ్ర యౌవనుఁడా!
మఱియు నప్పుడు 'సమయము దొరకిన నేను విజయనగర
సామ్రాజ్య చక్రవర్తుల సేవచేసి యా విజయనగర చక్ర
వర్తిని భరతఖండ సామ్రాజ్య పట్టభద్రుని జేయుదును'
అని ప్రగల్భములు బల్కుచుండువాఁడవు. మఱియు నట్టి
యుద్దేశములతోడనే శౌర్య ధైర్యనిలయుఁడవై విజయన
గర సామ్రాజ్య సేవయందుఁజేరి యింతత్వరలో నింత
యున్నత స్థితికి వచ్చితివి. అవి యన్నియునీకు జ్ఞప్తియందు
గలవా?

ఆ వీరావతంసునిహృదయ మాహ్లాదపరిపూర్ణమాయెను.

విజయ :-అవును. జగన్మోహినీ! నీయట్టి యుదారహృదయ
రాండ్రిట్లు స్నేహితులకు వీరరసబోధనము గావించు
చుండఁగా నాంధ్రసామ్రాజ్యలక్ష్మి కేమికొదువ? ఆంధ్ర
వనితారత్నమా! నీశౌర్యధైర్యసము పేతమగు హృదయము
సంస్తవనీయము. నీయట్టి ధీరురాండ్రగు స్త్రీరత్నములే
యాంధ్రదేశమునకును భరతఖండమునకును గావలసియు
న్నారు. ఇపుడు ముఖ్యముగా ఆంధ్రదేశమునందును
విజయనగరసామ్రాజ్యమునం దెల్లెడలను సుందరీ సుంద
రులచిత్తములు స్వదేశాభిమాన పరిపూర్ణములగుచున్నవి.
అయినను, ఇంకను దగినకాలము రాలేదు. కాని, దేశము

యొక్క భావికము శుభముతో నలంకరింపఁబడఁగలదు. తురకలయొక్క దుష్కృతులే హిందువుల నిట్లు ప్రేరేపించు చున్నవి. ఏ నాఁడే సామ్రాజ్యము దుర్మార్గాచరణమున కును బ్రజాపీడనమునకును దిగునో అది యానాఁడే యంత రించునని పెద్దలు వచింతురు. అది వ్యర్థముకానేరదు. భరతఖండమున కెప్పుడేని యీయవస్థ కలుగకపోదు. నాశక్తికొలఁది నా దేశమునకు సేవఁజేసి, వలయునేని నా జననిపాదపద్మముల నీ యాంధ్రి రక్తముతోఁగడిగి వీర స్వర్గమును నిశ్చింతగా నందెదను.

అతని కనులయందు శాంతభావము స్ఫురించుటలేదు. అవి రక్తవర్ణములై యుండెను.

జగన్మో :-వీరకుమారా! దుడుకుతనము నీకుఁ జిన్నప్పటినుండి యుఁగూడనలవాటే. నీయాకృతి యిపుడు భయంకరముగా నున్నది ; నీప్రస్తుతస్థితి యెట్లున్నదో చూతమని యంటిని. ఇంత మాత్రమునకే యిట్లు రౌద్రమూర్తివి గావలెనా ?

ఆ యమృత సారములగు వాక్కులచే నతనికోపాగ్ని కొంచెము చల్లారెను.

విజయ :-జగన్మోహినీ! అదియేమో నాకుఁదెలియదుగాని భరతఖండ ప్రస్తుతస్థితిని జూడఁగనే, ఈ దేశ దుర్గతిం దలపోయఁగనే స్వాభావికముగా, అప్రయత్నముగా, ఒక

శక్తి నాయెడలున నాపాదమస్తకము వ్యాపించి నన్ను గదల్చివైచును. అపుడు నాకేమియుఁ దెలియదు.

జగన్మో:-'స్వదేశవేష భాషాభిమానాస్సంతో రసప్రలుబ్ధధియః' అని మనము నన్నయభట్టీయమునఁ జదివియుండలేదా? స్వదేశాభిమానమెప్పుడు నుత్తమ మానవులకు స్వాభావికమే. కాని విజయసింహా! అన్నప్పుడెల్ల నట్లు స్వదేశాభిమాన ప్రేరితుఁడవై క్రిందుమీఁదులు తెలియక వర్తించితివేని చెడుగులు పెక్కులు సంభవించును సుమీ. కొన్ని యెడలఁ దానిని గొంచెము గోప్యముసేయవలసియుండును.

విజయ:-అవును! దీర్ఘదృష్టిగల నీ నుడువులెంతయు వర్ణనీయములు. అన్నప్పుడెల్ల నట్లుండుట గొన్నియెడల హాని కాగలదు. ఇది యనుభవ పూర్వకముగఁ దెలిసికొని కొంచెముకొంచె మా స్వభావమును దగ్గించుకొనుచున్నాను. నీ విపుడు చేసిన యుపదేశము నెప్పటికి మఱువఁజాలను.

జగన్మో:-నీవు మిక్కిలి దయతోడఁ బెంచిన కురంగశాబకమును మఱచితివా?

స్త్రీలకు స్వాభావికముగఁ బురుషులకంటె విలాసములందును, వేడుకలందును బ్రీతిహెచ్చు. అందుచేతనే వారు బొమ్మలాట మొదలగు నాటలు విశేషించి యాడుచుందురు.

విజయ:-అవును. దానిని నాప్రాణ పదముగాఁ బెంచితిని. అది యిపుడేమైనది? పెద్దదయినదా? దానికేమయిన పిల్లలా?

జగన్మో:-అవును. అది చాలఁ బెద్దదైనది. దానికిపుడు రెండు పిల్లలు.

విజయ:-సంతోషముగా నున్నది. మాధవీ మంటపమట్లే నిల్చి యున్నదా?

జగన్మో:-అవునట్లే యున్నది.

విజయ:-రసాలములు కాపునకు వచ్చినవని తలఁచెదను.

జగన్మో:-ఆఁ! వచ్చినవి—

కాని యింతలో నాపె భావమునకేదియో తట్టెను. తోడనే యాపె కొంచెము నొచ్చుకొని యిట్లనెను. "ఇప్పుడు నేనును స్వర్ణకుమారియుఁ గలిసి వచ్చుచుండఁగా నామె నాతో మీకు సమరమున దెబ్బలుతగిలినవని మాత్రము సూచించినది. అంతకంటె నప్పుడేమియుఁ జెప్పినదికాదు. అది పూర్తిగా నయమైనదా?" విజయసింహుఁడా జగన్మోహినికి సర్వమును వినిపించెను. వెన్నుపై మానుచున్న గాయము నతఁడు చూపించెను. ఆపె మఱి వినలేకపోయెను. కనలేకపోయెను. ఆమె హృదయమున దడజనించెను. అభినవ వికసితేందీవర పత్రముల నధఃకరించుచున్న యాకనుంగవయందు నీరు గిఱ్ఱునఁ దిరిగెను. అది ప్రవాహరూపమువహించెను. అది యాపెకు గోచరముకాలేదు. కాని యా బాష్పజాలము లామె కనులను గప్పివేసెను. అంతనవి యచటనుండి మౌక్తికజాలములవలెఁ గ్రిందఁబడఁజొచ్చెను. దానిని మనవిజయ సింహుఁడు కనిపెట్టెను. అతనిహృదయము

సీరాయెను. అతని కేమియుఁ దెలియలేదు. అతఁడేమి సేయను బ్రయత్నింపలేదు. కాని, యప్రయత్నముగాఁ జేతిరుమాలుతోఁ గూడినయాతనిమంజులహస్త మాజగన్మోహినికనులకు దుడవ నారంభించెను. రెండవ హస్త మా సౌభాగ్యశాలినియొక్క కేశపాశమునఁబడి కాలజలదమువలెఁ బ్రకాశించుచున్న యా కేశపక్షమున మెఱపుఁ దీవియవలెఁ బ్రకాశింపఁజొచ్చెను. అతని హృదయము ఝల్లు మనియెను. అతనికి నిముసమువఱకు స్మృతిలేదు. అది యుభయత్రనష్టేయుండెను. ఆమె మాటలాడు టకుఁ బ్రయత్నించెను. కాని మాటరాలేదు. ఎట్టకేల కిట్లని యెను.

'విజయసింహా! నిజముగా నన్ను స్వర్ణకుమారి మోసముచేసినది. ఆమె తగినంతకారణములేక యిట్లుసేయదు. దైవము కరుణారసమునుజిల్కి మిమ్మును మరణావస్థనుండి బ్రదికించినాఁడు. ఆమె మునియాశ్రమమునకు వచ్చుట యెఱుఁ గుదునుగాని, యీసంగతి దెలిసిన——' ఆమెదృష్టికి మరల నవరోధము గల్గినది. మఱి యామె మాట్లాడ లేకపోయెను. విజయ సింహుండంతయుఁ జూచెను.

విజయ:-జగన్మోహినీ! చెప్పకుండుటే మేలయినది. అప్పుడు నీకుదెలిసిన మనభవిష్యత్తిట్లుండి యుండదు.

ఆమె మఱిమాటాడలేదు.

అతఁడిట్లనియెను.

'చిరకాలమునకు లభ్యమైన యీదర్శన సౌఖ్యమేని నాల్గు నాళ్ళవఱకు లభించునదికాదు. రేపుదయమె రాజకార్య నియోగ మొండత్యావశ్యకమయినది నెఱవేర్పఁ బోవలసి యున్నది.'

ఇంతలో స్వర్ణకుమారివచ్చి యచట నిలిచెను. ఆపె యిట్లనెను. 'రేపుమాత్రమేని యుండిన మాకుఁ గొంత సంతసముగానుండును. దయచేసి రేపుండుఁడు.'

విజయ :-అది రాజకార్యము. రాజకార్యము లవశ్యకరణీయములు. ఇందు స్వార్థపరుఁడనై నేనుందునేని రాజద్రోహమును దన్మూలమున మాతృదేశ ద్రోహమును జేసినవాఁడ నగుదును.

జగ :-అవును. విజయసింహా! నీవన్నట్లు రాజకార్యమునకు మేమడ్డుపెట్టుట ధర్మముకాదు. నీవిధిని నీవుపోయి నిర్వహింపవలసియున్నది. కాని సాధ్యమైనంత త్వరలో నీవ్యవహారవిషయముల కేమియు హానిరాకుండునట్లు వచ్చి చూచి పోవలయునని కోరుచున్నాను.

అత 'డట్లే' అనియెను. అతని కనులొకపరి స్వర్ణకుమారిపైకిఁ దిరిగెను. అతఁడిట్లనెను.

'స్వర్ణకుమారీ! నీవు పర్ణశాలయందు నేనుగాయములు తగిలి పరుండియున్నప్పు డొకటి రెండుసార్లు కనఁబడితివి.

కాని మాటలాడఁ బ్రయత్నించుచుండఁగనే అంతలో నంత ర్థానమగుచుండుదానవు. నాతోనప్పుడేల మాటలాడినదానవు కావు ?'

స్వర్ణ:-అవును. కనపడిన మాటనిశ్చయమే. యోగిసత్తముండును, బితృతుల్యుండును విశేషించి మనలఁ బ్రేమించుచు మనక్షేమమునేకోరువాఁడును నగు శ్రీధరుఁడు నీకు దెబ్బలు తగిలిన తెల్లవారు ఝామున నన్నుబిలిపించి యావద్వృత్తాంతమును నాకు నెఱిఁగించెను. అపుడుశిష్యులెల్లరునానా విధములగు రాజకార్యముల మీఁదను, శత్రువులు సేయు కుట్రలఁ దెలిసికొనుటకును, బంపఁబడియుండుటచే నెవరును లేరు. అందుచే నేను నీసేవకు నిశ్చయించితిని ! కాని శ్రీధరులవారి యాజ్ఞానుసారము నేను నీకుఁగన్పడలేదు. ఆపత్సమయములో నీకు సేవసేయుభాగ్యము నాయీచేతులకుఁ గల్గినందులకు సంతసించుచున్నాను.

జగన్మోహిని యంతయు నాలకించెను. ప్రాణ సఖియగు నామె యుక్తికిని, జమత్కృతికిని మెచ్చెను. తలయాడించెను. తనలో నేమో అనుకొనెను. ఆమె యొకవేళ నా మహామహుని కట్టి యా పత్సమయమున సేవసేయు భాగ్యము తనకుఁ గల్గినందులకుఁ జంతించెనా యేమి ?

విజయ:-స్వర్ణకుమారీ ! నీ ఋణమును దీర్చుకోఁజాలను.

స్వర్ణ:-అది మీకృపారసము. అంతపని నేనేమియుఁ జేసియుండ లేదు. ఆబాల్యమైత్రి నెసంగు నే నీపాటిసేయుట నాకు విధి

కాదా? దానికేమిగాని రేపే నీవు పోవుచున్నందులకు మాకు జింత గల్గుచున్నది. అయినను జేయునది లేదు. కాని జగన్మోహినిని మాత్రము మఱువకుఁడు. నన్నుగూడ మనసులో నొకమూల నుంచుకొనుఁడు. అదియే మీరు మాకు చేయు నుపకారము. అందులకిది గుర్తుగా మీ కడనుండుఁ గాక!'

అని యాపె చిత్ర ఫలకము నా వీరవరాళి కరతలమున నుంచెను. అది యత్యంత స్వాభావికముగఁ జిత్రింపఁబడెను. అందు జగన్మోహిని స్వర్ణ కుమారసమేతయైయుండెను. అతఁడు తన దృష్టిని మఱల్చుకొనఁ లేకపోయెను. ఎట్టకేలకు 'సుహృద్రత్నములారా! మీ ప్రేమకుఁ జాల సంతసించితిని. ఇదిగో, యీయుంగరమును గైకొని నన్నెప్పుడును మఱవకుందురు గాత' అని జగన్మోహిని వ్రేల దానిం దొడగెను.

---

# తొమ్మిదవ ప్రకరణము

## రాజద్రోహి యెవరు ?

విశాలమై సువర్ణ మయకుడ్యజాల తేజస్సమాకర్షిత సకల మానవలోకమై యత్యద్భుత శిల్పకళా సౌభాగ్య భాసురమై నానావిధ రత్ననికర నిర్మిత వివిధ చిత్రప్రతిమాలంకృతమై రాజిల్లు విజయనగర రాట్సభామందిరము, సకల సామంత నృపాల సేవితమై నృత్యకళాకోవిద సంశోభితమై సకల లోకస్తుత్య విద్వత్కవి భాసురమై వందిమాగధ సమేతమై సకల దేశ సమాగత రాజప్రతినిధి యుక్తమై, హృదయరంజకముగా నొప్పారుచుండెను. అందు మధ్యభాగమున రత్నఖచిత కనక సింహాసనము నధిష్టించి రామరాజ చక్రవర్తి ప్రకాశించుచుండెను. అతని కనులు కెందామరలవలెఁ బ్రకాశించుచుండెను. ఆ మొగము తీరు కన్గొన్న యచటి సామంత నృపాలురకును, భటులకును, పండితులకును, గాయకులకును, ఇంత యేల! ఎల్లరకును గుండెలు పగులుచుండెను. మధ్యాహ్న మార్తాండునిచందమున నతని మోము తీక్ష్ణకాంతులు గ్రక్కుచుండెను. ఒక్కొక్కఁడు తనకేమి మూఁడునోయని భయపడఁ జొచ్చెను. నిరంకుశ ప్రభువుల పరిపాలనము

పాలితులకు నిత్య భీతిదాయకముగదా? సభయెల్ల నిశ్శబ్దముగ నుండెను. అంత రామరాజు సక్రోధుఁడై యిట్లనెను.

'విశ్వ విఖ్యాతమై శత్రు భీకరమగు నీ విజయనగర సామ్రాజ్యమును బాలించు నధికారులలో రాజద్రోహులున్నారన్న సంగతి విన్నప్పటినుండియు నా యెడలు కంపమెత్తుచున్నది. నాపని కృష్ణసర్పమును బ్రేమతోఁ జేరఁదీసికొన్న విధాన నున్నది.'

పెక్కురు పెక్కువిధముల నాలోచించిరి. కాని యెవరి కేమియుఁ దోఁపలేదు. రాజద్రోహి యెవరైనది యెవరికి బోధపడినదికాదుగాని, యచటివారిలోఁ జాలమంది తురుష్కుఁడౌటచేతనో, లేక యతనివర్తనము మంచిదికాదనియో గాని, యాదిల్షాహా నుద్దేశించి, యాపిడుగతనిపైఁబడునేమో యని భావించిరి. మఱికొందఱు మఱికొన్ని విధముల నాలోచించిరి. కాని యెవరు నిశ్చితార్థ మిదియని నిర్ణయింపఁ గల్గినవారు లేకుండిరి. ఆదిల్‌శాహా అపుడచటనుండెను. కాని యతఁడేమియు నెఱుఁగనివాఁడువోలె నాశ్చర్య మభినయించుచుఁ గూర్చుండెను. బుద్ధిసాగరుఁడు దూరదృష్టిగలవాఁడు. అతఁడిట్లు తలంపసాగెను.

'బహుశః ఆదిల్షాహాయు,చక్రధరుఁడును నాపైఁబన్నిన తంత్రములా యేమి? లేనిచో నేనింతవఱకు వారు సేయు కుట్రలం

గూర్చి రాజునకేమియుఁ జెప్పలేదు. అది యెట్లు వెల్లడి యగును? అందులకుఁ గారణము కనంబడకున్నది. ఇంతకు నకారణముగా నాకేమోగాని భయమేర్పడుచున్నది.'

బుద్ధిసాగరునిపై నీపిడుగు పడునని యచటి పౌరులలో నొకఁడేని కలలోనేని యనుకొనలేదు. వారతనిని దమ తండ్రులను బ్రేమించినట్లు ప్రేమించిరి.

అంత నొకదీర్ఘకాయుఁడగు పురుషుఁడు లేచి నిలువఁబడెను. అతనిముఖము గంభీరముగానుండెను. అతఁడీవిధముగాఁ బలుకఁజొచ్చెను. "శ్రీ చక్రవర్తిగారి యుప్పునుదినుచున్న మనకెల్లరకు శ్రీవారియందు బితృభావమును రాజభక్తియును నుండుట ధర్మము. శ్రీ చక్రవర్తిగారి సేవకులు నిన్న మొన్నటిదాఁక నట్లేయుండిరి. కాని కొంతకాలము నుండియుఁ గొందఱుపెద్దమనుష్యులు రాజద్వేషులై పనిసేయుచున్నట్లు కన్పట్టుచున్నది. వారు భటులకు దొంగవేషములు వేయించి శత్రురాజులతోఁ గడుజాగ్రత్తగా నుత్తరప్రత్యుత్తరముల జఱుపుచున్నారు. ఇది కొంతకాలము క్రిందట నేను నా గూఢచారుల మూలముగాఁ దెలిసికొంటిని. మొట్టమొదట నేనామాటలను విశ్వసింపలేదు. కాని క్రమక్రమముగా నమ్మవలసినవాఁడనైతిని. నాకట్టినిశ్చయమును గల్గించుటకుఁ దగిన కొన్ని కాగితములు దొరకినవి. ఇదిగో నిన్న సాయంత్రమిట్టిది

మరలనొకటి దొరకినది. దీనిని విన్నచో మీకు సత్యము బోధ పడగలదు."

అతఁడు రహస్యవార్తాసంగ్రహ శాఖాధికారి. అతఁడా యుత్తరమును జేతఁదీసికొని మెల్లగా రామరాజు కడకు సమీపించి యతని హస్తమున నుంచెను. అది శ్రీ చక్రవర్తి గ్రైకొని సమీపమున నున్న పండితునొకని జదువ సన్న చేసెను. అతఁడది గ్రైకొని, ఇట్లుచదివెను.

"శ్రీ రాజమాన్య రాజపూజితులయిన శ్రీ మహామంత్రులవారి పాదపద్మములకు:—

శ్రీగోల్కొండ నవాబు వ్రాయు విన్నపము లేమనఁగా:—

అయ్యా! 'కొండంత దేవునకుఁ గొండంత పూజచేయఁగలమా?' అనునట్లు మీరు మాకుఁజేయు నుపకృతికిఁ దగిన ప్రత్యుపకారముం జేయఁజాలక పోయినను మాయుడుతభక్తి నేని చూపఁజాలకపోము.

మీరు మాయందు ననుగ్రహముంచి, మీరాజ్యమున నెప్పుడు జఱుగు సంగతు లప్పుడు తెలియఁజేయఁ గోరుచున్నాను. నేనిక్కడఁ గ్రమముగా నాదుర్గములను బాగుచేయించుకొనుచున్నాను. మీరు కొంతకాలమునుండి యుత్తరములు సరిగా వ్రాయించుటలేదు. కారణము దురూహ్యముగా నున్నది. విజయనగర సామ్రాజ్యసైనిక సంఖ్య యెంత

యుండునో సరిగా నాకంతుచిక్కుటలేదు. పెక్కుమంది పెక్కు-
విధములగాఁ జెప్పుచున్నారు. మీ రా విషయమును గొం
చెము జాగ్రత్తతోఁగన్గొని వ్రాయింతురని నమ్ముచున్నాను.
నేను నాసైన్యములోనికిఁ గ్రొత్త సైన్యముం జేర్చుకొను
చున్నాను. కాని విజయనగర సామ్రాజ్య సైనికులతో మా
సైనికులు పోరాడలేరు. వారు పరాక్రమైకధనులు. అందుచే
మాకు మిక్కిలి భయముగానున్నది. ఆదిల్‌శాహాకును రాజు
నకును భేదముగల్గించు నుపాయముఁ జూడుఁడు. మాతురకలలో
మా కే కలియకుండ నున్నప్పుడు మీరు మాకుఁజేయు సాహా
య్యము విలువ చెప్పఁదీరదు. మాకుఁ బ్రతినిమేషము విజయ
నగర సైన్యమెప్పుడు వచ్చిపడునోయని భయమే. నిద్రలేదు.
ఎప్పటి సంగతు లప్పుడు ముందు తెలుపవలెనని వేడుటకన్న
నేమియు విశేషములేదు.

చిత్తగింపుఁడు."

అచటి సభాస్తారుల కెల్లరకు నేమియుఁ దోఁచలేదు.
ఆశ్చర్యభావ మగ్నులైరి. కొందఱకు భయము పొడమెను.
అందఱును రోషావేశులు కాఁజొచ్చిరి. ఆ దురాత్ముని,ఆ పాపా
త్ముని, ఆ మాతృద్రోహిని, ఆ దేశద్రోహిని, ఆ రాజద్రోహిని,
ఖండఖండములుగాఁజేయవలయుననిరి. విజయనగర సామ్రాజ్య
సర్వకార్య ధూర్వహులగు మంత్రులలో నట్టి ద్రోహులున్నా
రన్నమాట కొందఱకు విశ్వసనీయముగాఁ దోఁచినదికాదు.

కాని, యట్టి వాఁడున్నచో నతని శిక్షింపవలయుననుటయందు మాత్ర మందఱు నేకీ భావము వహించిరి. కాని యా ద్రోహియే బయల్పడలేదు. కొందఱు చక్రధరుఁడు కావచ్చు ననుకొనిరి. మఱికొందఱు మఱియొకఁడనిరి. కాని వారిలో జాల మంది భావములు మాత్రము బుద్ధిసాగరుఁడట్లు చేసియుండునని యూహింపలేదు. పౌరులకు బుద్ధిసాగరుఁడు తండ్రివంటి వాఁడు. వారతనియందు మిక్కిలి విశ్వాసముగల వారగుటకు, అతఁడు వారికిఁజేయు మేళ్ళే కారణములు. అతఁడు వారినంతగాఁ బ్రేమించెను. కాని యతనికి నున్నతోద్యోగములయందున్న వారిలోమాత్రముచాలమందివిరోధులుకలరు. అతఁడున్యాయైక పక్షపాతి. లంచములు పట్టుటగాని యొకరి సలహాలు విని తగని వారి కున్నతోద్యోగముల నిచ్చుటగాని, యతని కెంతమాత్రమును గిట్టదు. ఇది వారికిఁ గష్టదాయకము. రాజులకుఁ 'దావలచినది రంభ, తామునిగినదిగంగ' యనుట స్వభావము. వారికి మంచి చెడ్డలు వివేచించు జ్ఞానము మొత్తముమీఁద మిక్కిలి తక్కువగానుండును. స్తోత్రపాఠకుల పాఠములకుబ్బి తబ్బిబ్బగు చుందురు.

ఆదిల్ఖానును జేరఁదీసినదాది పెక్కుసార్లు బుద్ధిసాగరుఁ డదిమంచిదికాదని యేకాంతముగాఁ జెప్పెను. అతనిని త్రికరణఁ శుద్ధిగా నమ్మిన రామరాజున కిది కష్టముకాఁజొచ్చెను. ఒకటి రెండు సార్లతని ప్రత్యక్ష కోపమునకుఁగూడ నితఁడు గుఱి

యగుట సంభవించెను. ఆత్మదేశ రక్షణైక చిత్తుఁడును, విధి నిర్వహణైక దృష్టియు నగు బుద్ధిసాగరుఁడు దానిని లెక్కపెట్ట లేదు. కాని తన మాటనే యనుసరించి యదియే సత్యమని యనకుండుట రామరాజునకుఁ గష్టముగా నుండుచునచ్చెను. అది యితఁడు కనిపెట్టకపోలేదు. కాని న్యాయమార్గమును వీడుట కతని కిష్టములేదు. ఇట్టి చిక్కులు కొన్ని యితరములగు నాంత రంగిక కార్యములలోఁగూడ సంభవించెను. అందును మన బుద్ధి సాగరుఁడు మనస్సాక్షికి దూరముగ వర్తించియుండలేదు. సభయంతయుఁ దుపానుచే క్షోభింపఁజేయఁబడిన మహాసము ద్రమువలె నుండెను. రామరాజు ముఖమున రోషానలజ్వా లలు మండఁజొచ్చెను. అతఁడు లేచి స్వయముగాఁ దన చేత నున్న యుత్తరము నిట్లు చదువఁదొడఁగెను.

"మహారాజాధి రాజులును, అనేక బిరుదావళీవిరాజితులు నగు, శ్రీ గోల్కొండ నవాబుగారి సన్నిధికి.

శ్రీ విజయనగర సామ్రాజ్యమంత్రి బుద్ధి సాగరుఁడు, అనే కాశీర్వచనములు:—

మీకు మాసైన్య సంబంధములగు ముఖ్యాంశముల నన్నింటిని జాగ్రత్తచేసి పంపుటకు నింకను గొంతకాల మోర్వ వలసియున్నది. కొన్ని సిద్ధమైనవి. మఱి కొన్ని సిద్ధము కానున్నవి. బహుశః మీకుఁ ద్వరలోనే పంపఁగలనని నమ్ము చున్నాను. రాజ్యాంగవిషయములలో నిచటజాం, రహస్యము

లున్నవి. అవి యన్నియు మఱి యొక యుత్తరము ద్వారా శే పంపెదను. నేఁడు పంపఁజాలనందులకుఁ జాల చింతిల్లు చున్నాఁడను. ఇపుడు నాస్థితి యిచటఁ బూర్వమువలె లేదు. పూర్వ మీ రాజ్యమునకు నేను నిరాఘాట చక్రవర్తిని. ఇపుడు నాతంత్రములు నిరాఘాటముగా సాగుచుండుటలేదు. అందు వలన గొన్ని చిక్కులు సంభవించుచున్నవి. అయినను మించి నదిలేదు. నేను మీరు కోరిన సర్వమును మీకుఁ గూర్పఁ గలను. కొంచెము కాలవ్యవధిమాత్రము కోరుచున్నాను. చిత్తగింపుఁడు.

బుద్ధిసాగరుఁడు."

అతఁ డట్లుత్తరమును సాంతముగాఁ జదివి క్రిందనున్న దస్కతును, అందఱఁజూడఁగోరెను. 'బుద్ధిసాగరుఁడు' అను దస్కతందు స్పష్టముగాఁ గనంబడుచుండెను. బుద్ధిసాగరుఁడు తలవంచుకొనెను. అతని కేమియుఁదెలియలేదు. ఇట్లు తల పోసెను.

'నేననుకొన్నంతయు నైనది. అగుఁగాక! నాచేవ్రాలు వీరికెట్లు లభించినది? ఇది సృష్టించియుందురా? పెక్కుచిక్కు లతోనుండు నాచేవ్రాలును సృష్టించిన వా రేది చేయఁజాలరు? ఇంతకును విధి విధాన మిట్లున్నది. ఇంక నే నీబ్రదుకేల బ్రదుక వలెను?' అతనికన్నుల నీరుగమ్మెను. లోపలఁ గోపాగ్ని తీవ్రము గా మండుచుండెను. అతఁడు వంచిన తలను మఱి యెత్తలేదు. కాని పౌరులలోఁ జాలమందికది కష్టముగనుండెను. అందుఁ

జాలమంది యీపని చక్రధరుని వలననై యుండునని తలంచిరి. మఱికొందఱు ఆదిల్‌శాహా వలననైయుండునేమోయని తలంచిరి. ఇంక కొందఱు మఱికొన్ని విధములందలంచిరి. అతనికిఁ గలవిరోధులలోఁగూడఁ జాలమంది కతఁడే యిది చేసెననుటకు నోరురాకుండెను. వారి యంతరాత్మ యొప్పినదికాదు. కాని రామరాజు తీక్ష్ణాగ్నికణములం గురియు మొగముంజూచి భీతిల్లి పౌరులుకాని యితరులుకాని యెవరునేమియు నన సాహసింపరైరి. అంత రామరాజు లేచి యిట్లనెను.

"ఓయీ! పాపీ! చిరకాలమునుండి మీతండ్రితాతలు మావంశము వారిని నిష్కళంకబుద్ధితో సేవించిరి. పాల సముద్రమునఁబుట్టిన విషభాండమువోలె వారికడుపునఁబుట్టి నీవింత పనిసేయుట మిక్కిలి వ్యసనకరము. మాసామ్మునిని 'పాలుత్రావి రొమ్ముగ్రుద్దె' నను సామెతగా నమ్మి నాశము సేయఁ జూచుచున్నావుగా? చిరకాలమునుండి వచ్చుచున్న మహామంత్రి పదవి ననుభవించుటకు నీకు వెగటుగానుండియా యిట్లు శత్రురాజులతోఁగూడి కుట్రలుసేయుచున్నావు? ఛీ! నీవంటి దేశద్రోహులయు, రాజద్రోహులయు మొగములు చూచినఁబాపముతప్పకవచ్చును. నిన్ను ఖండములుగాఁ గోసినను బాపమురాదు. కావున నీకిప్పుడు మరణదండనమును విధించి విజయ నగర సామ్రాజ్యమున నీవంటి ద్రోహులు లేకుండఁజేసెదను."

అని యతఁడు కారాగారాధిపతి కనుజ్ఞ నొసంగెను. కోపము క్రూరసర్పము. అది యెవరికడనుండునో తుదకు వారినే నాశముచేయును. కోపాంధులకుఁ గన్నులు కన్పడవు. మిన్ను తెలియదు, మన్ను తెలియదు. ఆత్మనాశముంగూడ వారు తెలిసికొనరు. తెలిసికొనుట కట్టివారికి వ్యవధియుండదు. యుక్తాయుక్త వివేచనమున కది చోటీయదు.

అప్పుడు మెల్లగా, ఆదిల్యాహాలేచెను. ఆతని మొగము శాంతభావ ప్రస్ఫుటముగ నుండెను. మెల్లగ నిట్లు చెప్పెను.

"అత్యుత్తమ సామ్రాజ్యచక్రవర్తీ! జనకా!

సర్వవిజ్ఞాన విశేష శోభితులరగుమీకు నేను జెప్పుపాఁటి వాఁడనుగాను. కాని యొకచిన్నవిజ్ఞాపనము చేసికొనుచున్నాఁడను. బుద్ధిసాగరులను నేను జాలకాలమునాఁటినుండియు నెఱుఁగుదును. అతఁడు న్యాయైక పక్షపాతి. దేశభక్తుఁడు. అతనికి రాజభక్తి యపారము. అతఁడిట్టికార్యమును జేయ సమర్థుఁడనుట మిక్కిలి వింతగాఁదోఁపకపోదు. అతనిశత్రువులెవరేని యిట్లు సల్పియుండవచ్చును. లేక మఱియొకటికావచ్చును. అది మనమూహింపఁజాలము కావున నీయనగారియందు దయయుంచి సమూలము విచారించి, మఱి శిక్షించిన బాగుండును. అట్లుసేయుటకు నేను మిమ్ములను మిక్కిలి వినయముతోఁ బ్రార్థించుచున్నాను."

అమాయకులగు పౌరులలోఁ జాలమంది 'యహాహా ! యితఁడెంతమంచివాఁడు' అనిరి. మఱికొందఱు 'నిజముగా నితఁడు తురకకులమున జన్మింపఁదగిన వాఁడుకాఁడ' నిరి. 'రామరాజున కందుచేతనే యితఁడుపుత్త్రుఁడగుటకుఁ దగు' నని మఱికొందఱనిరి. దూరదృష్టిగల కొందఱుమాత్రము 'అది కేవలము టక్కరితనము. జనానురాగము కొఱ కితఁడిట్లుచేయుచున్నాఁడు. ఇవి హృదయమునుండివచ్చిన మాటలుకావు' అని గుసగుస లాడిరి. అందెవరిమాట సత్యమో, ఎవరికెఱుక ? పిదపఁ జక్రధరుఁడు లేచి నిలువఁబడియిట్లనెను.

"ఆర్యులారా! చక్రవర్తీ!

శ్రీ యాదిల్షాహాగారు చెప్పినదెంతయు వర్ణనీయముగానున్నది. తొందరపడి శ్రీమహామంత్రిగారికి మరణదండనము విధించిన నిశ్చయముగాఁ దరువాత మనకునష్టము వాటిల్లును. కావున వారిని ధర్మశాస్త్ర పరిజ్ఞాతలమూలముగా విచారించుటయుఁ దరువాత దేవరవారి చిత్తమువచ్చినట్లుసేయుటయు సమంజసముగాఁ దోఁచుచున్నది."

అంతఁ జక్రవర్తిలేచి యిట్లనెను. "ప్రస్తుతము నిన్ను కారాగారమున నుంచుటయే మంచిదని తలఁచితిమి. మరణదండన మక్కఱలేదు"

బుద్ధిసాగరుఁడు వంచిన తలను గొంచెమెత్తి యిట్లనెను. "నేను ద్రోహినో కాదో యీశ్వరుని కెఱుక. దానిం గూర్చి

యిప్పుడు నేఁ జెప్పఁదలఁచుకొన లేదు. చెప్పి ప్రయోజనము లేదు. కాని నా ప్రార్థన మొకఁటియున్నది. విజయనగర సామ్రాజ్యము విశ్వవిఖ్యాతమైనది. అది యిప్పుడు తురుష్కుఁడును దుష్ట స్వభావుఁడునగు ఆదిల్‌శాహా చేతిలోను, చక్రధరునిచేతిలోను బడ్డది. ఆ యిరువురి కుట్రలవలనను గొలఁదికాలముననే విజయనగర సామ్రాజ్యమునకుఁ జిక్కులు తటస్థింప నున్నవి. అది యెఱిఁగి మాత్రము దానిని రక్షించుకొనుఁడు. తుచ్ఛమగు నా ప్రాణముపోయిన నాకుఁ జింత లేదు. ఆ సామ్రాజ్యము నిల్చిన నాకుఁజాలును.'

అతఁడు మఱిమాటలాడ లేదు. కొందఱు విశ్వసించిరి. మఱికొందఱు దూషించిరి. ఇంతలో నిరువురు వచ్చి యతని చేతులకు సంకెలలువైచి గొంపోయిరి.

# పదియవ ప్రకరణము

## చీకటి

విజయసింహుఁడు బయలుదేఱి శృంగారపురమునుండి విజయ నగరమునకుఁ బోయెను. అతఁడు వెళ్లి యిప్పటికి రమా రమి పదునైదు దినములై యుండవచ్చును. ప్రపంచమెల్ల నంధకార బంధురమై కన్ను బొడుచుకొన్నను గానవచ్చుట లేదు. చెట్టులు పుట్టలు గట్టులు నేకముగ నంధకారావృత ములై నిర్దేశింపవలనుపడక యుండెను. జగమెల్ల నిశ్శబ్దముగా నుండెను. జారులు చోరులు మొదలగువారు యథేచ్ఛా విహా రములు సలుపఁజొచ్చిరి.

జగన్మోహిని తండ్రి పేరు సోమశేఖర మూర్తి. అతనికిఁ బౌరుష మన్నను బౌరుషవంతులన్నను బ్రీతి విస్తారము. అతఁడు చిన్నప్పటినుండియు విజయసింహు నెఱుగును. అతని సుగుణ గణము లతనికి సంతోష దాయకములు. జగన్మోహినీ విజయ సింహుల పరస్పర ప్రేమానుబంధమును గూడ నతఁడు తెలిసికొనెను.

జగన్మోహిని యొక్క సౌందర్యము దిగంతము లెల్ల నిండెను. సౌందర్యము కాని సుగుణములు కాని దాఁగునవి

కావు. మల్లికా కుసుమములను గాని గులాబిపూలను గాని తెచ్చి యొకచోనుంచి పరిమళింపకుండన్న నాగఁగలవా? అత్యంత మనోహరమగు తత్సువాసన వ్యాపింపక మానునా?

శుభాశుభ వార్తలుగూడ నట్టివే. వానికిఁ బక్షులకంటె గమనము హెచ్చు. రాత్రింబవళ్లు, వర్తమానములు ప్రపంచమును జుట్టి వచ్చుచుండును. జగన్మోహిని వివాహవార్తయు నాపెను విజయసింహునకీయ నెంచుటయుఁ బ్రపంచమెల్ల వ్యాపించెను. ఎల్లరును సంతసించిరి. లోకమునకు సమగుణశోభితులయిన దంపతులవివాహము మిక్కిలి యానందదాయకము. కాని లోకమెల్ల నొక తీరుగానుండదు. ఒకరికి రుచించిన దొకరికి రుచింపదు. మనము తలఁచిన కార్యములెల్ల ననుకొన్నట్లు జఱుగఁజాలవు. మనమొకటి తలఁచిన దైవమొకటి తలఁచును.

ఆనాఁటి రాత్రి యట్లు చాలసేపటివఱకు మఱునాఁడు జఱుగు లగ్న నిశ్చయముంగూర్చియు వరుని గుణములంగూర్చియు వధూవరుల పరస్పరానురాగముంగూర్చియు నతఁడు తలపోసెను. అతనికి నిద్దుర రాలేదు. అది స్వాభావికము. కూతుండ్ర పెండ్లిండ్లు సేయుట తండ్రులకు మిక్కిలి కష్టము. సమగుణవయోరూపవంతులు దంపతులగుట మిక్కిలి యరిది. వధువు తండ్రి యట్టిగుణవంతుఁడగు భర్తను దేవలసియున్నాఁడు. కూతునకుఁ దగనిభర్త దొరకిన నతని కెంత కష్టము?

సర్వవిధములఁ గూతునకుఁ దగిన లోకోత్తరుఁడగు సుందరుఁడు దొరకిన నతని కెంత సౌఖ్యము?

ఎట్టకేల కతఁడు నిద్దురవోయెను. కాని, యీఁగ కేని దొరశక్యముకాని యాసౌధోన్నతభాగమునందలి యాఁగది లోఁ బెద్ద చప్పుడాయెను. అదియతని నిద్రకు భంగము కలుగఁ జేసెను. అతఁడు కన్నెత్తిచూచెను. అతని కొక వికారమగు దీర్ఘ విగ్రహము పొడకట్టెను. అది మనుజుని విగ్రహమే కాని రాక్షసునిది మాత్రము కాదని యతఁడు తలఁచెను.

అతఁడాఱడుగుల కంటెఁ గొంచెము పొడవుగానుండెను. అందుఁ బ్రకాశించుచున్న దీపపుఁగాంతి నతని మొగము కన్పడెను. అది నల్లనిబొగ్గు. కాఱు మేఘము లాకాంతికిఁ దీసిపోవును. కటికచీకట్లుకూడ నా మొగపుఁగాంతికిఁ జాలవు. ఆమొగము భయంకరమై యతనిక్రౌర్యమును దెలియఁజేయుచుండెను. సోమశేఖరమూర్తి తనదీర్ఘమగు కత్తి కొఱకుఁ దడవిచూచెను. అదిలేదు. అతఁడు తటాలున నా భటునిపైఁ కుఱుకఁబోయెను. కాని వెనుకనుండి యిరువురు మ్లేచ్ఛులు వచ్చి వానింబట్టుకొని చేతులుకట్టిరి. అతని మొగము క్రోధమయమై పోయెను. కనులు నిప్పుకలు గ్రక్కుచుండెను. 'ఓరి నీచుఁడా! దొంగవలెవచ్చితివే మిరా! శౌర్యమున్నఁ బోరాడుము. నీశిరము నూర్వ్రక్కలు చేసెదను' అనెను. సామదానములు ప్రయోగించెను. లాభములేకపోయెను. ఆ

భటుఁడు ' నీ విప్పుడు మాఖయిదీవి.' అనెను. అతఁడు లోలోన మండుచుండెను. జగన్మోహిని కేమి యపాయమువచ్చునో యని విలపింపఁజొచ్చెను. కాని, ఏమిచేయఁగలఁడు? పాపము! కోఱలుతీసిన సర్పము.

దీనికి సమీపముననే మఱియొక భవనముండెను. అందు జగన్మోహిని పరుండి యుండెను. ఆమెకుఁ గొంచెము సమీపముగా స్వర్ణ కుమారి నిద్రించెను. పాపమా మనోహ రాంగుల గతి యేమైనదో!

అదిగో! చూడుఁడు. కాఱుమెఱుపుఁ దీవియవలె మెఱయుచున్న యా జగన్మోహిని మొగ మెట్లు క్రోధ భయాశ్చర్య రసములచే శోభించుచున్నదో? ఎదుట నిలువఁబడిన తురుష్కునితో నేదో నామె యనుచున్నది. 'ఓరీ! యీ యర్ధరాత్రి వేళ నీ విచటి కెట్లువచ్చితివి? నీవెవఁడవు?'

అతఁడు జవాబీయలేదు. ఆ మనోహరమూర్తి వంకఁ గన్నారఁ జూచుచుండెను. ఆమెమరల నా ప్రశ్నమే యడిగెను.

' నేను దురుష్కుఁడను. నిన్ను గొంపోవ వచ్చితిని.' అనియెను.

'ఓరీ! పాపీ! నీ వెచటికిఁ బోఁగలవు? ప్రాకారమునఁ గావలియున్న వారెల్లరు నిన్ను ఖండ ఖండములు చేయరా? వారిం దప్పించుకొని యెట్లు వచ్చితివి? చేత ఖడ్గములేదుకాని యున్నచో నీ బోంట్లకు వారుకూడఁ గావలయునా?' నిసర్గ

మాధుర్యములగు నా పలుకులయందు కాఠిన్యము ప్రకాశింపఁ జొచ్చెను. ఆమెపండ్లు పటపట మనుచుండెను. తురుష్కుఁ డిట్లనెను.'ఇదిగో! అటుచూచితివా? ఆ తురుష్క బలములం గనఁగొనుము'

ఆపె దృష్టి నావంక సారించెను. ఆపె గుండెలు ఝల్లు మనెను. క్రోధము హెచ్చెను. పగతీర్చుకొనుటకు సాధన మామె కేమియుఁ దోఁచినదికాదు. అతఁడిట్లనియెను:—

'మీ ద్వార పాలకులు,ప్రాకార పాలకులు నందఱు నిది వఱకే గతించినారు.'

జగ:-మీరెవరు? అక్రమముగా నిచ్చోల వచ్చితిరి?

భటుఁడు:-మే మొక తురుష్కనాధుని సేవకులము.

జగ:-మీకు మేమేమి యపకృతి చేసితిమి?

భటుఁడు:-అది నాకుఁ దెలియదు కాని, నిన్ను మా నవాబు గారికిఁబెండ్లి చేయఁదీసికొనిపోవుచున్నాము. నీయదృష్టము!

ఆపె కెవ్వునఁగేక వేసి భూమిపైఁబడెను. స్మృతితప్పెను. ఈ కేక విని స్వర్ణకుమారి లేచెను. ఆపె నాభటుఁడు పట్టు కొనఁబోయెను. ఆమెకూడ నట్లే కేకవేసెను. ఆ కేకలువిని యింతలో దండు చుట్టును జేరెను. సోమశేఖర మూర్తిని గూతును స్వర్ణకుమారిని, అందఱను బంధించి వేర్వేఱుగా దీసికొని ఎచటికో ప్రయాణమై పోయిరి.

---

# పదునొకండవ ప్రకరణము

## పట్టమహిషి

ఆంధ్రులలోఁ గోల్కొండపేరు నెఱుఁగనివారు చాల యరుదుగా నుందురు. అది యొకదుర్గము. అది ప్రస్తుతము హైదరాబాదునకు అయిదారు మైళ్ళ దూరమునను్నది. గోల్కొండ నవాబులనుగూర్చి యాంధ్రులు వినియుందురు. ప్రస్తుతపు నవాబుపేరు కుతుబ్‌షాహా. గోల్కొండ నవాబుల శుద్ధాంతము లత్యంత మనోహరములు. సర్వసుభగవస్తు నికేతనములు. భూతలస్వర్గములు. సర్వసౌభాగ్యసారములు!

ఆ శుద్ధాంత మందిరములకుఁ జుట్టును బెద్దప్రాకారములు గలవు. ప్రాకారద్వారముల కడ సేవకులు కావలియుందురు. వారు పుల్లింగ స్త్రీ లింగములలోఁ జేరరు. అందుఁ బ్రవేశించువారు ఉత్తరువు నందవలెను. ఆపోవువారికిఁ దొంబదితొమ్మిది తనిఖీలు. స్త్రీలకే కాని పురుషులకా ప్రవేశము లేనేలేదు. కాని పాఠకులారా! భయపడకుఁడు. మనముపోవుట కే యభ్యంతరమున్ను లేదు. రండు. మనకీశ్వరుఁడట్టి వరమును బ్రసాదించి యున్నాఁడు.

ఆ సౌధభాగముల వంక మీదృష్టులు సారింపుడు. విశుద్ధస్ఫటికశిలా నిర్మితములై యెట్లు ప్రకాశించుచున్నవో చూడుఁడు. చుక్కలలోఁ జంద్రునియట్లు భాసిలుచున్న యీమధ్య సౌధమునకుఁబోవుదము. అది పట్టమహిషిది. ఇదిగో! ఇందలి యీపడకగదిఁ జూడుఁడు. రత్నఖచితములైన యాకుడ్యముల సౌందర్యమును గన్నులారఁగాంచుఁడు. అందలి యాచిత్ర ప్రతిమల సౌభాగ్యము వీక్షింపుఁడు. అందేవో మృదు మధుర కలనిస్వనములు వినవచ్చుచున్నవి. ఇవియేమైయుండును? ఎవరిదో సంభాషణమువలె నున్నది. లోపలఁబ్రవేశింతము. ఆ గదిలో నొకమూలయందున్న మఱుగుద్వారము మూసినట్లు చప్పుడువినవచ్చినదేమి? అదిగో! ఇంద్రనీలమణి ఖచితమైన యామంచముపైఁ బట్టమహిషి పరుండియున్నది. ఆమెకండ్లెఱ్ఱగాఁ బ్రకాశించుచున్నవి. ఆమె ద్రాక్షారసము కుత్తుకకెక్కఁ ద్రావియున్నది. ఆమె కన్నులు మూఁతలుపడుచున్నవి. ఆమె మొగము మిక్కుటమగు నలసటను సూచించుచున్నది. ఆమె తనువు మెఱుపుఁదీవియవలె కంపించు చున్నది. మొగమెఱ్ఱ వారియున్నది. కోపముచేతనా? ఆమె వసనము తళతళ మెఱయుచున్నది. అది సన్నని కెంబట్టుపావడ. కుంతలములు సుపరిష్కృతములు గావు. కాని కారణము మాత్రము మనకుఁ దెలియదు. ఆమె మనమునఁ గ్రోధమావేశించినదా యేమి? అదిగో! కుతుబ్ షాహా యిటువచ్చుచున్నాఁడు. మన

ముపోదము. అంతలో నతఁడువచ్చి తలుపుతట్టెను. పట్ట మహిషి యుత్సాహాతురమున మంచముపైనుండిదిగి తలుపు తీసెను. అతని మొగము శంకాసమన్వితముగఁ నున్నట్లున్నది. వా రిరువురును మ్మాటలాడలేదు. ఆపె పెడమొగముబెట్టెను.

అతఁడు దేవికోపముగా నున్నదని మాత్రము తనలోఁ దా ననుకొనెను. ఆమె కరము పట్టుకొని యిట్లనెను.

'దేవీ! నేఁడేల గోపముగా నున్నావు? ప్రసన్న వద నవు కమ్ము.'

పట్ట:-కోపమునకు మాకేమి కారణమున్నది. మాకోపము మిమ్మేమి చేయఁగలదు?

నవా:-అదిగో! కోపమును దాఁచెదవేమి? నిజముగా నీకుఁ గోపము వచ్చిన నేనుండ——.

పట్ట:-వట్టి కల్లలకు దారియాఁ డొంకా? మాకుఁ గోపము వచ్చినను మేమే చెడుదుము. మీకుఁ గోపమువచ్చినను మేమే చెడుదుము.

నవా--ఆఁ! తెలిసినది. నీవు ప్రౌఢవు. ఇది ప్రణయ కోపము.

పట్ట:-మా ప్రణయకోపము మీకు రుచించునా? అందుకుఁ దగినవారు నూతన సుంద——.

మఱి యామెనోట మాటరాలేదు. ఆమె ప్రయత్న ముచేసి యనను లేదు.

ఆమె భావము మోహాంధకారమునఁబడి ప్రపంచమునే మఱచిన నవాబున కిప్పుడు గోచరమాయెను. రహస్యమామెకు గోచరించినందులకాశ్చర్యపడియెను. గుండెలు ఝల్లుమనెను. కొంతసేపువఱకు నోట మాటరాలేదు.

అతఁడు సమీపించి యామెచేయిపట్టుకొని 'నన్ను రక్షింపుము' అనెను.

ఆమె తొలఁగి దూరముగా నిలువఁబడెను. కాని యతఁడు సమీపించి 'నన్ను రక్షింపుము' అని మరల వచింపుచు పాదములమీఁదఁ బడెను. ఆమె యా ప్రదేశమువిడచి చనెను.

కోపము మిక్కిలి చెడ్డది. యుక్తాయుక్తములను దెలియనీయదు. కామ మంతకంటె గొప్పది. అది మఱి నాలుగాకు లెక్కువ చదివినది. ఆపె కోపవతి. ఈతఁడు కాముకుఁడు. 'ఈ రాణిమొగము చూడను. ఆ క్రొత్తసుందరినే పోయి చూచెదను' అని యతఁడనుకొని తన దారిఁబట్టెను.

---

# పండ్రెండవప్రకరణము

ఇయ మధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం.

కాళిదాసు.

## గగనకుసుమము

అతఁడిట్లు పట్టమహిషితోఁ బోరాడి వేగముగా నడిచి పోయిపోయి యొకవిశాలభవనమును సమీపించెను. ఆ చంద్రశాల సౌభాగ్యమును గాని, యందలి యతిసుందర చిత్రప్రతిమల సౌరుగాని, యా నిర్మాణ సౌభాగ్యము గాని విశదములై ఆకసము నంటుచున్న యా మందిరశిఖరముల మనోహారత గాని చూచుచు మనము కాలయాపనము చేయరాదు.

అందొక సౌభాగ్యశాలిని కలదు. ఆమె మొగము స్రుక్కిపోయి యున్నది. అయినను సంపూర్ణ శరత్సుధాకర మండలముకంటె నందముగానే యున్నది. తళతళ మెఱయు పట్టుచీరలతో నలంకరింపఁదగిన యాతనువల్లి జీర్ణవస్త్రములతో నలంకరింపఁబడియుండెను. ఆమె కేశపాశము పరిష్కృతమై యుండలేదు. అయినను,

శ్లో॥ యథా ప్రసిద్ధై ర్మధురం శిరోరుహై-
ర్జటాభి రప్యేవ మభూ త్తదాననం
నిషట్పదశ్రేణి భిరేవ పంకజం
సశైవ లా సంగమపి ప్రకాశతే.

అనునట్లు మిక్కిలి రమణీయముగనే యుండెను.

నవాబు లోనఁ బ్రవేశింపఁగనే యొక పరిచారిక వచ్చి యొకకుర్చీని సమీపమున నుంచిపోయెను. అతఁడు దాన నధిష్టించెను.

'జగన్మోహినీ! నావిషయ మే మాలోచించితివి? నిజముగా నీవు నాయందు దయార్ద్రదృష్టి నింకఁగొంతకాలము దాఁకఁ బ్రసరింపఁజేయవేని నేనింక నీలోకము నం దాశ వదలుకొనవలసిదే. సుందరీ! ఏల యిట్లు నన్నుహింసించెదవు? ఇంక నన్నెన్నినాళ్లిట్లు బాధపెట్టెదవు? చూడుము! నాయొడలు, ఎట్లు కృశించి నదో? నీకెంతమాత్రమును గరుణలేదా? ఇంత కఠినహృదయమును దేవుఁడు నీకేల కల్పించెనో?—' అనెను. తోడనే నిట్టూర్పు పుచ్చెను. స్థాణుభువము వహించెను. మఱి మాటలాడలేకపోయెను.

ఆమె యీమాటల నాలించెనా? ఆమె మొగమైనఁ బ్రక్కకుఁ జూచుటలేదు. అతఁడు మాటలాడ నారంభింపఁగనే యాపెకు శిరఃకంప ముదయించెను. ఆపెతనువస్త్రా

కాల చంచల ననుకరించెను. అధోముఖి యాయెను. నాసికా పుటములనుండి నిట్టూర్పు వెడలెను.

ఆ యుచ్ఛ్వాసము వేఁడిగానుండెను. ఆపెతనువు తీవ్ర క్రోధవశమునం గంపించెను. ఆపె యాకర్తర బోనులోనుండి యేమిచేయును? ఏమిచేయఁగలదు? ఆపెఁకోపమును శాంతింపఁ జేసికొనెను. శాంతముతో నిట్లనెను.

“జనకా! నీ వీ గోల్కొండ రాజ్యమునకు రాజువు. నీబిడ్డలము మేము. న్యాయరక్షణమునకు దేవునిచేఁ బంపఁబడిన వారే భూలోకమునందు రాజు లగుదురు. రాజులు నిజము గా దేవాంశ సంభూతులు. అట్టిరాజులే యిట్టి యకార్య ములకు దిగినచో, ఇఁకఁ బ్రపంచ మేమికావలసి యుండును? తల్లియే చంపఁదలఁచిన బిడ్డలు సౌఖ్యముగా జీవింపఁగలరా? చిరకాలమునుండి మా తండ్రులును దాతలును రాజ్యమునందు సర్వసౌఖ్యముల ననుభవించుచు జీవించిరి. కీర్తిగాంచిరి. ఇప్పు డిట్లు మమ్మ కారణముగా నేల బాధించెదరు? అన్యాయమున కేల పూనెదరు? అధర్మముఁ జేయుట మీవంటి రాజులకు క్షేమకరమగునా?”

నవాబు ఫక్కున నవ్వెను.

‘సుందరీ! ఈ నీతులు నుపన్యాసములు మేమును,ఎఱుఁ గుదుము. కాని యవి నిస్సారములయినను, అమృతమునువర్షిం చుచున్న నీకంఠమునంబడి సారవంతములై శ్రవణానంద కర ము లగుచున్నవి. నాకావాక్యములతోఁ బ్రయోజనమేమి?’

జగన్మో :-తండ్రీ! నీకన్నకూతుంబలెగాంచి నన్ను విడిచిపెట్టు ము. నీకూతునే, యిట్లెవఁడేని బాధించిన నీ కెట్లుండునో తలంచుకొనుము. నన్నువదలిన నీ కిహపరలోకసౌఖ్యములు కల్గును.

నవాబు:-ఇంక నీ యుపన్యాసమును గట్టిపెట్టుము. దయ తలఁచినకొలఁది నాలస్యము చేయుచున్నావు. బలవంతముఁ జేపట్టుట మంచిది కాదని యూరకుంటిని. అట్లుచేసిన నిన్ను రక్షించు వారెవరో?

ఆమె తత్తరపడియెను. మూర్ఛిల్లెను. ఆమెకు స్వర్ణకుమారి సేద దేర్చుచు నిట్లనెను.

'సోదరా! మమ్ము నిట్లు నిర్బంధించిన నీకుఁ బ్రయోజనమేమి? ప్రాణములపై నాసలేని మమ్ము మీరెఱిఁగియే యుందురు. ఆంధ్ర సుందరీమణులు ప్రాణములను మానముకంటె నెక్కువగాఁ దలపోయువారు కారుసుమీ! కాని దానిమాట యట్లుంచుము. విజయనగర సామ్రాజ్యచక్రవర్తి నెఱుఁగుదురా?

'ఒక్కయాంధ్ర సుందరీమణులు మాత్రమే కాదు. హిందూదేశమున జన్మించిన వారెల్లను నట్టివారే. అందుకే నేను భయంపడుచున్నాను' అని యతఁడు మెల్లగా ననుకొని పైకిమాత్ర మిట్లనెను 'అవును. విజయనగర చక్రవర్తి నెఱుఁగుదును. ఎఱిఁగిన నేమి? అతఁడేమిచేయును?'

స్వర్ణ:-వారిదగ్గఱ గొలువున్న వీరసింహమును విజయసింహు నెఱుంగుదురా? అతని పరాక్రమమును వింటిరా?

నవాబు:-ఆఁ! వింటిని. అయిననేమి?

స్వర్ణ:-అతని సీమె పరించినది. ఆ సింహమునకీ వార్త దెలిసిన లేడిని సింహము కబళించునట్లులు మిమ్ముఁ గబళించి మీ రాజ్యమును విధ్వంసము చేయకుండునా?

నవాబు:-అతని పరాక్రమమును మా పరాక్రమమును కొలంది కాలముననే జఱుగనున్న యుద్ధమున మీరే చూడఁగలరు. ఉత్తమాటలతోడఁ బ్రయోజన మేమి?

స్వర్ణ:- విజయనగర చక్రవర్తుల భుజపరాక్రమమును దురుష్క రాజులు చక్కఁగాఁ జవిచూచినారు. ఆ రుచి వారికే యెఱుక. వారే దానిని వర్ణింపవలెను.

అతని కింతలో నేదియో స్మృతికి వచ్చెను. అతఁడంత 'జగన్మోహినీ! ఇంకఁ దయదలఁపను. అయినను నీ యందు గల కరుణా విశేషమునఁజేసి యొకమాసముగడువు నిచ్చితిని- అబ్బా! మాసమువఱకుఁ దాళఁగలనా? అయినను మాట యంటిని. త్రిప్పుకొనజాలను.-అప్పటికిఁగూడ నిట్లే గట్టిపట్టు పట్టితివేని నీకు నీ ప్రాణము దక్కదు. ఇంతేగాక నీ తలి దండ్రులుకూడ భూలోకయాత్రను విడిచిపెట్టవలసిన వారగు దురు. నీ కేది యుక్తమో లెస్సగా నీ గడువు కాలమున

యోజించుకొనుము. నాకుఁ దొందరపని యున్నది. నేను పోవలేను.' అని ఆపెవంక వీక్షించుచుఁజనియెను. జగన్మోహినికి శోకము హెచ్చెను. శిశిర ఋతువునఁ బ్రాతఃకాలమున నల్లకల్వల రేకులనుండి జారునట్లామె కనులనుండి బాష్పములు జారుచుండెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చుచుండెను. మధ్యమధ్య తలిదండ్రులను తలఁచుకొనుచుండెను. లోననుండి పొరలివచ్చు దుఃఖము నాపుకొనుచు స్వర్ణకుమారి యాపె నోదార్చుచుండెను.

---

# పదమూఁడవ ప్రకరణము

## దుష్టగ్రహ కూటము

విజయ నగరములోఁ బూర్వపరిచితిగల యొక భవన మునకు మరల మనమరిగి యచటి వృత్తాంతములను దెలిసి కొందము.

అది యాదిల్సాహా యొక్క రహస్యమందిరము. అం దితరులకెవరికిని బ్రవేశములేదు. మనకథకు సంబంధించిన త్రిమూర్తులకు మాత్ర మందుసర్వకాలములఁ బ్రవేశింప సర్వ్హత కలదు. తదితరులు ప్రవేశింపవలయు నన్నచో, ఆదిల్సాహా గారి యనుమతి కావలయును. దానికి నుత్తరమున దూర ముగా, ఆదిల్సాహా భోజనశాల మొదలగు దివ్యమందిరములు కలవు.

ఇప్పు డా రహస్యమందిరమున నొక్క తారానాథుఁడు మాత్రము కూర్చుండియుండెను. అందు సన్నని దీపమువెల్గు చుండెను. బహిఃప్రపంచమెల్ల నంధకారావృతమై యుండెను. అదివారికి సంకేతస్థలము. చక్రధరుఁడును ఆదిల్సాహాయు తారా నాథుఁడును, అచట నారాత్రి కలసికొనవలయునని వారు నిర్దేశించుకొనిరి. ఇప్పటి కొక్క తారానాథుఁడు మాత్రమే

వచ్చెను. ఒంటరిగాఁ గూర్చుండుటకతని కిష్టములేకుండెను. ఒకటి రెండుసార్లు వారువచ్చుచున్నారేమో యని యాసౌధపుఁ బురోభాగమునకు వచ్చి చూచెను. కాని యెవరును వచ్చుచున్నట్లు కనఁబడలేదు సరిగదా వచ్చుచున్నజాడ దూరమునఁగూడఁ దోచినదికాదు. అతఁడు మరలవచ్చి యాకుర్చీపై గూర్చుండి యిట్లు యోజింపఁ దొడఁగెను.

"రాజనీతి మిక్కిలి విచిత్రమైనది. రాజులు బిడ్డలను నమ్మరు. మిత్రులను నమ్మరు. స్వబంధువులను నమ్మరు. రాజుల కాత్మలాభ పరాయణత్వముతప్ప మఱి విచారణ యుండదు. గోల్కొండనవాబు రామరాజుపైఁ జేయుచున్న కుట్రలలో నిపుణతతోను బట్టుదలతోను బ్రవర్తించుచున్న యీయాదిల్షాహాను సహితము నమ్మక మరల నాకు నుత్తరము వ్రాసినాఁడు."

అతని కుడిహస్తము పొడవుగా వ్రేలాడుచున్న యతని చొక్కాయి జేబులోఁ బ్రవేశించెను. అది యొకయుత్తరమును బయికిఁదీసెను. అతఁ డాలేఖను దీపమువెలుఁగున నిట్లు చదివెను.

"అయ్యా! మీరు మొన్న వ్రాయించిన యుత్తరమును జూచితిని. మీయత్యద్భుత మేధాశక్తులకు సంతసించుటకంటె నేనేమియుఁ జేయఁజాలను. బుద్ధిసాగరునకు రామరాజునకును భేదముకల్పించుట మనకెంతయు లాభదాయకము. అతఁడిపుడు

కారాగారమున నున్నాఁడా? తప్పించుకొనకుండ నుపాయముం జూడుఁడు. అతఁడు తప్పించుకొన్నచో నిఁక మన యత్నములన్నియు బూడిదపాలు కావలసినవే. అందుకుసందియము లేదు. అతని మేధాశక్తి యద్భుతమనియు, అతఁడత్యంత స్వదేశాభిమాని యనియు వినియున్నాను. అట్టివాఁడు తప్పించుకొన్నచో ఎన్నికష్టములనేని పొంది యతఁడు సామ్రాజ్యరక్షణ చేసితీరును. ఈభారమంతయు మీపైఁబెట్టితిమి. మాప్రాణములు మీ చేతిలోఁబెట్టితిమి. రక్షించినను నాశముచేసినను మీరే. కార్యము లన్నిటియందుఁ గేవలము, ఆదిల్ఖానును మాత్రము నమ్మియుండకుఁడు. కార్యనిర్వాణ దక్షులరగు మీరిది యెఱుఁగరనికాదు. కాని యాతురతచే నిట్లు పునరుక్తిచేయుచున్నాను. అతఁడు మిక్కిలి జిత్తులమారి. దీర్ఘదర్శి. పైకి నమ్మినట్లునటించుచు లోన మిమ్ములనతఁడు నమ్మఁడు. ప్రతికార్యము నందును మీ దీర్ఘదృష్టిని వినియోగించి పిమ్మట నతనిసలహాను దీసికొనఁగోరెదను. ఇఁకచక్రధరుఁడు-ఇతఁడును, అత్యద్భుత సామర్థ్యముకలవాఁడే. ఇతనియెత్తులు మిక్కిలి దుర్భేద్యములైనవి. అతనింగూడ బూర్తిగా నమ్మియుండుట మనకు శ్రేయోదాయకముకాదు.

రాజునకనుమానము పుట్టకయుండునట్లు లేయే కార్యములందే యే విధముగా సంచరింపవలయునో మీకు నేను జెప్పఁబూనుట హాస్యాస్పదము.'

అని చదువుచుండెను. అంతలో నాసౌధము నానుకొని యున్న యొకచెట్టుప్రక్కగాఁ గొంచెము చిన్నపాటిసందడి యొకటివినఁబడెను. అతఁ డా యుత్తరమును జేబులో వయిచుకొని మెల్లగానావయిపునకువచ్చి దీపమెత్తి యటునిటు చూచెను. కాని యేమియుఁ గన్పడినది కాదు. మరల నాసందడి విన్పడలేదు. అతఁడు మరికొంచెముసేపు చూచెను. కాని యేమియు లేదు. అతఁడు పక్షులసందడియై యుండుననుకొనెను. అతఁడు మరల యథాస్థానమునకు వచ్చెను.

ఇంతలో దూరమున నాదిల్షాహాయుఁ జక్రధరుఁడును వచ్చుచున్నట్లు తోఁచెను. అతఁ డా కుర్చీపైనఁ గూర్చుండెను.

ఆయిరువురును వచ్చిరి. వారితో నొకసేవకుఁడుగూడ నుండెను. అతనిచేతిలో నాల్గుబుడ్లనిండుగా మనోహరమగు ద్రాక్షారస ముండెను. అది మిక్కిలి విలువైనది. ప్రశస్తమైనది. తారానాథుఁడు లేచి నిలుచుండెను. వారిరువురుఁగూడ నతని సమీపమునఁగల కుర్చీలకడకువచ్చిరి. ఆ మువ్వురును గలిసి యా యాసనములపైన ఁగూర్చుండిరి.

ఆదిల్షాహా యొకబుడ్డినిదీసి తారానాథున కిచ్చి ‘ అయ్యా ! త్రాగుఁడు ’ అనియెను. విస్మితముచేయుచు నతఁడు ‘ మేము సుప్రసిద్ధ బ్రాహ్మణులము. ద్రాక్షారసము ద్రావవచ్చునా ? ’ అనియెను.

అంతట, ఆదిల్‌షాహా ఆబుడ్డిని తీసికొనెను. అది త్రావి 'హా! ఇప్పుడెంత సౌఖ్యముగానున్నది. మీకవు లెవరును ద్రాక్షారసమును వర్ణింపలేదా? అవును. హిందువులకు దానిరుచి యేమి తెలియును? అమృతము భూలోకమున నున్నచో, అది ద్రాక్షారసమే. ఇంకను, ఎంతైనను ద్రావవచ్చునుగాని, త్రావినచో, అది మమ్ముఁదబ్బిబ్బుచేయును.'

చక్ర:-ప్రస్తుతము కర్తవ్యమేమి?

ఆదిల్:-ఏమున్నది? బుద్ధిసాగరుఁ డున్నంతకాలము మనకు హాయిగా నిద్రపట్టదు. అతనియందు జనులకెల్లరకు నెంతయో ప్రీతి. అతఁ డేమిచెప్పినను దానిని విశ్వసించువారును,అనుసరించువారును బెక్కురుగలరు. ఇప్పుడతఁడు చెఱసాలలో నున్నను, మఱెచ్చటనున్నను అతనిశక్తిచేఁ దప్పించుకొని మనలను సాధింపఁగలఁడు. వాయువున కగ్నితోడైనట్లువిజయసింహుని పరాక్రమముకూడ నతనికిఁ దోడగును. ఆరెండును దోడయిన మన మేమియుఁ జేయఁ జాలము. కావునఁ దొందరపడవలయును.

తారా:-ఆతనిం గడముట్టించుటే మంచి సాధనము. అంతవఱకును మన ప్రయత్నములు నెఱవేఱుచున్నట్లు మనము తలఁపఁగూడదు.

ఆదిల్:-అంధుల కుపాయమేమి? ఆదీర్ఘదర్శి మనకుఁ జిక్కునా? ఇట్టి తంత్రముల నతఁడు మనకంటె నేడాకు లెక్కుడుగాఁ

బరించి యున్నాఁడు. అతఁడు మన తంత్రములలోఁ జిక్కు కొనుటే దుస్తరము. చిక్కినచోఁ గష్టమే లేదు.

చక్ర:-అవును. నా కొకయుపాయము తోఁచుచున్నది. విజయ సింహుని కతనియందును, అతనికి విజయసింహు నందును, ప్రేమ మిక్కుటముగదా? అతని చేవ్రాలుతో నొకయుత్త రమును సృష్టింతము.

తారా:-ఆపని మీరు నిపుణముగాఁ జేయఁగలరా? చేయఁ గల్గినచో మనపని నెగ్గును.

ఆదిల్:-ఆఁ! అందుకు సందేహమేమి? అట్టి యుత్తరముచే మనము నిశ్చయముగా నెగ్గఁగలము. అవును, మొన్న బుద్ధి సాగరుని సంతకము సృష్టించినవారు దీనిని సృష్టింపలేరా?

చక్ర:-నేను దీనిని సృష్టించెదనుకాని యతనిని జెఱనుండి తప్పించుటకును, చెఱసాలలో రాత్రిపూట మనకుఁ బ్రవే శము కల్గుటకును గారాగారాధిపతి యుత్తరువు కావల యునుగదా?

ఆదిల్:-అది యెంతసేపు? ఒక్కచిటికెలో, ఆపనిని నేఁ జేయఁ గలను. నాల్గుసంచులు ధనము గుప్పినసరి, కొండమీఁది కోఁతి దిగివచ్చును.

చక్ర:- అయినచో రేపుమాపటికే యీపనిజేయుట యుక్తము. ఇంతలో నాపనిని నేనుజేసి సిద్ధముగానుందును.

ఆదిల్:- మఱి వధ్యస్థానమెక్కడ?

తారా:- అది లెస్సగా యోచింపవలసినదే.

చక్ర:- ఈమధ్య నెక్కడను గూడదు. విజయనగర మహా పట్టణమున జను లెక్కడనో యేమూలనో యుండియే యుందురు. అట్టియెడల నది మిక్కిలి హానిగానుండును. కావున నిర్జనస్థలమే యిందుకు మిక్కిలి తగినది. ఇచటి కాతేడు మైళ్ళ దూరములోనున్న తుంగభద్రానదీ ప్రాంతమందలి యటవీస్థానమిందుకు గడు ననుకూలముగా నుండును.

ఆదిల్:-మీయూహ చాలా బాగుగానున్నది. అది బ్రహ్మకైనను దుర్భేద్యము.

తారా:- అయినచో, ఆస్థలమునకు గుర్తుచెప్పి యచట విజయసింహుఁడు బుద్ధిసాగరుని యాగమనము కొఱకు వేఁచి యున్నాఁడని వ్రాయుఁడు.

చక్ర:- ఆ ప్రదేశమున నొక గొప్పవటవృక్షము కలదు. ఆ వట వృక్షప్రాంతమున నని వ్రాసెదను.

ఆదిల్:-అది మిక్కిలి బాగున్నది. అది భయంకరముగా నుండును. ఆతావు దీనికి చాల తగినది.

తారా:- ఇంతకు నతఁడు లోఁబడునా ?

చక్ర:- లోఁబడ కేమిచేయును ? తనను తప్పించుకొనుటకుఁ గూడ నిష్టపడఁడా యేమి ?

ఆదిల్:- దీనికిఁదప్పక యతఁడు లోఁబడి తీరును. ఇం దతనికి సందియము తగులుటకే కారణము కన్పడదు. కావున నిది

యెంతయు సమంజసముగా నున్నది. ఈ విషయమున మనకు శంకింపఁ దగిన దేదియులేదు.

తారా:- అన్నియు బాగున్నవి. మీ ప్రయాణ మెప్పుడు ?

ఆదిల్:- నేను రేపే ప్రయాణమై పోయెదను. సరే, చక్రధరులు గారూ! మీపని యేమిచేసినారు ? సైన్యాధికముల లెక్కలన్నియు సిద్ధముచేసినారా ?

చక్ర:- ఆ పనిమీఁదనే యున్నాను. రాత్రింబవళ్ళు నెడతెగక పనిచేసినను నేటివఱకుఁ దరిగినవి కావు. ఏనుంగులయు గుఱ్ఱములయు రథికులయు స్థిర సైన్యము యొక్కయు లెక్కలు స్థిరపఱచఁబడినవి. కాని కాల్బల మింకను జేర్చుకొనఁ బడుచుండుటచేఁ దేలినదికాదు.

ఆదిల్:-సరే! పాపము మిక్కిలి శ్రమపడుచున్నారు. కాని మనము నేటివఱకుఁ జేసినదెల్ల నొకప్రయత్నముకాదు. ముందు యుద్ధములో మనశక్తిసామర్థ్యములు చూపవలయును. అందు విజయము గల్గినప్పుడు మనకార్యము కొనసాగినట్లును, మనయత్నములు సిద్ధించినట్లును తలపోయవచ్చును. అంతవఱకు మనమేమియు నిశ్చయింప వలనుపడదు. ఒక్క గడియచాలు మనయత్నమెల్ల వ్యర్థమగుటకు! గాలితోఁ ద్రాడుపేనుటకుఁ జాలిన బుద్ధిసాగరుని మన మీ చిక్కునం బెట్టి ధ్వంసము చేయగల్గితిమా కొంతవఱకు నెగ్గినట్లే. అయినను విజయసింహా, తిరుమల



రాయ, వేంకటాద్రి ప్రభృతులు ప్రాణములతో నున్నంత కాలము శత్రుబలములకు జయసిద్ధి దుర్లభము. వారికిఁ దగిన యెత్తులను దఱువాతఁ జూచుకొందము.

చక్ర:- ఈగండము గడచినపిదప విచారింపవచ్చును. కాని గోల్కొండవార్త లేమి ? తారానాథులుగారు !

తారా:- ఏమున్నవి ? అతఁడు దినదినము నూతనసైన్యములను జేర్చుచున్నాఁడు. దుర్గములను బాగు చేయించుచున్నాఁడు. కాని యతనికి రామరాజుసైన్యములను మార్గమధ్యముననే యడ్డగింపవలయునని యున్నది.

చక్ర:- తదితర మహమ్మదీయ ప్రభువులుకూడ దీనికంగీకరించినారా ?

ఆదిల్:- ప్రొద్దుపోయినది. ఇంకనుండుట యంతక్షేమముకాదు. పోవుదము.

అంతలో, ఆచెట్టున మరల గొంచెము సందడియయ్యెను. ఆ మువ్వురును, ఆవంక పరీక్షించి చూచిరి. ఏమియును గన్పడలేదు. దీప మటు గొంపోయి యా త్రయము మిక్కిలి శ్రద్ధగాఁ బరికించిరి. కాని యేమియు గోచరముకాలేదు. భయము దొంగలకు సహజము. ఏచప్పుడు విన్నను వారిగుండె లవియును. దొరలకు భయపడవలసిన యవసరము లేదు. కాని యిదేమైయుండును ? వట్టిచప్పుడా ? లేకందు మానవుఁ డెవఁడేని దాగియుండెనా ? తుట్టతుదకు వా రది

పత్నుల రొదయ్యై యుండునని తీర్మానించుకొనిరి. నిశ్శంకగాఁ దమతమ త్రోవలంబట్టిరి. జగమెల్ల నాయర్ధరాత్రమునఁ గాఱు చీకట్లు క్రమ్మెను. కాని యాచీకట్లలోఁ జక్రధరుని మొగము కళకళలాడఁజొచ్చెను. దానికిప్పుడు నూత్నవికాసము కలినది. ఆ వికాస మతనికిఁ గ్రొత్తయందముంగల్గించెను. అది నవ వికసిత పద్మమువలె శోభించుచుండెను. ఆ సోయగము నాకటిక చీకటిలోఁ దారానాధుఁడు కాని యాదిల్యాహోకాని, చూడ లేదు. కాని యతఁడు తనలోఁ దానిట్లనుకొనెను.

‘ఆహా! నేటికాలమునకు బుద్ధిసాగరుని జంపు నుపాయముం గాంచితిని.’

# పదునాలుగవ ప్రకరణము

## దర్బారు

విజయసింహుని వంశ మత్యంత సుప్రసిద్ధమైనది. అతని తండ్రియు, తాతయు పరువుప్రతిష్ఠలు కల్గినవారు. వారు విజయనగర సంస్థానమున సేనానాయకులై కీర్తినిగాంచిరి. పౌరుషవంతులు. శౌర్యైకధనులు. స్వభావసిద్ధముగా జనులహృదయమునందు గౌరవభావమును నాటుచుందురు. అట్టివారు సుగుణౌదార్యవంతులైనచో వారికిఁగల్గునట్టి ఖ్యాతి మిక్కుటము మగుచుండును. తమ్ముఁ బోషించుచున్న విజయనగర సామ్రాజ్యమునకుఁ బెక్కువిజయములను సమకూర్చి వా రట్లు రాజుమన్ననలకుఁ బాత్రులయి యుండిరి.

విజయ సింహుఁడు కూడ, అనువంశీకముగా వచ్చుచున్న శౌర్య ధైర్య గాంభీర్యాది సద్గుణ గణములతోపాటుద్యోగమునుగూడ నిల్పుకొని విజయనగరమునఁ బండితులచేతను గవులచేతను తదితర లోకముచేతను స్తుతింపఁ బడుచునుండెను. అతఁడు పిన్నతనమెల్లఁ దనతాతగారింట శృంగారపురమునఁ గడపెను. తరువాత విజయనగరమునకువచ్చి కొలఁదికాలముననే రాజును దన సుగుణసంపత్తిచేతను, సాహస

ధైర్యాదులచేతను, విక్రమముచేతను, మెప్పించి ప్రధాన సైన్యాధిపతులలో నొకఁడాయె. అతనియెడ రామరాజునకుఁ బుత్రవాత్సల్యముకలదు. అందుచే నతఁడు దినదినము నూతనాభివృద్ధిని గాంచుచుండెను. గోల్కొండ నవాబు జగన్మోహినిని దలిదండ్రులను దీసికొనిపోయి కారాగారమున బంధించినవార్త విజయనగరమునకు వచ్చెను. ఆపట్టణమున నెల్లవారును గ్రోధావేశ పరవశులైరి. ఇఁకఁ గేవల శౌర్యప్రధానులును, పౌరుషవంతులునగు విజయసింహుని వారికెల్లరకు నెట్లుండునో మేము వర్ణించుటకంటె మీ రూహించుకొనుట యందముగానుండును. రామరాజు క్రోధమునకు మితి లేదు. వారినెల్లరను వెంటనే విడిచిపెట్టవ లయునని గోల్కొండ నవాబునకుఁ దెలియఁజేయుటకై మఱునాఁడొక సభచేయ నిశ్చయింపఁబడెను.

సభాస్థలమెల్లను గ్రిక్కిరిసి పోయెను. రాజులు, సామంతులు,బంధువులు,జమీందారులు,పండితులు,కవులు, వందులు, మాగధులు, అందఱు చనుదెంచిరి. రామరాజు మెల్లగాలేచి యిట్లనియెను.

"ఆర్యులారా !

మన మీనాఁడు సభచేయుట తటస్థించునని యనుకొనలేదు. కాని యట్టిప్రమేయము తలఁచని తలఁపుగాఁ గల్గినది. విజయసింహుఁడు రాజభక్తికల్గిన యోధశిఖామణి. దేశాభి

మాని. అట్టివానికిఁగల్గిన యీపరాభవమునకుఁ జింతనందవలసి యున్నది.

ఇందీ తరుణవయస్కుని తప్పేమియు లేదు. పాపమత నింట పెండ్లియగునన్ని యతనిబంధుగులును, స్నేహితులును మన మును మిక్కిలి సంతోషించుచుంటిమి. ఆ యోధున కా యూ వవనతి, సర్వవిధముల యందును దగియుండునని యను కొంటిమి.

ఇట్టు లక్రమముగా వచ్చి యీపెండ్లిని స్వప్రయోజన పరత్వబుద్ధిచే నాపుటమాత్రమేగాక తనను ప్రేమింపని జగన్మో హినిని గామించి కొనిపోయి బంధించుట శ్రీ గోల్కొండ నవాబుగారి వంటివారికిఁ దగినపనిగాదు.

ప్రమాద మెట్టివారికినేని యుండును. అతఁ డిట్టిపనికిఁ బశ్చాత్తాపమంది,మనము రాయబారమంపిన తక్షణమే ఆపెను తలిదండ్రులతోఁగూడ మన కప్పగింపకపోఁడు. అతఁడు మనకు మిత్రుఁడు. అయినను, మనకు విశ్వాసపాత్రుఁడగు విజయసిం హునకిట్టి కష్టము ప్రాప్తించినప్పుడు మనమూరకుండుట తగిన పనికాదు. మఱియు సోమశేఖరమూర్తి సత్కుల సంభూ తుఁడు. గౌరవనీయుఁడు. ఆతనికీ కష్టము దుస్సహము. ఇంతియ గాక హిందూవనితలు పాతివ్రత్యమును స్త్రీలకు భూషణముగా గణింతురు. అదిలేనివారిని మిక్కిలి దూషింతురు. ధనములను

ధాన్యములను, కరులను, పట్టణములను, రాజ్యములను గూడఁ దృణములట్లు తలపోయుదురు. దానినిగాపాడుట రాజధర్మము.

కావున నిట్టియున్నత వంశస్థుఁడగు నిట్టి జమీందారునకు నిట్టియాపద సంభవించినప్పుడును, అట్టి సుగుణైక భూషితురాలగు పతివ్రతా శిరోమణికి మానహాని సంభవించుచున్నప్పుడును, రాజభక్తి పరాయణుఁడై శౌర్యనిధియైన విజయసింహునకిట్టి యాపదవచ్చుచున్నప్పుడును దానిని మనము సామోపాయమున వారింపఁజూడకుండట ధర్మముకాదు.

అందుచేఁ బ్రస్తుతము మైత్రితో మెలఁగుచున్న గోల్కొండ నవాబుగారితో మనము కొంచెము జోక్యముకలుగఁ జేసికొని, జగన్మోహినిని విడిచిపెట్టుఁడని కోరవలసియున్నది. ఇందులకు సరసులగు కుతుబ్షాహాగారు సంగీకరింతురుగాక"

తఱువాత మఱికొందఱు లేచి దానిని బలపఱచిరి. ఎల్లవారు నేకగ్రీవముగా నంగీకరించిరి. కొందఱు యౌవనులుత్సాహ పూరితులై యధికప్రసంగముచేయఁ బూనిరి. కాని చక్రవర్తిగారు పడుచుఁదనపు దుడుకుదనమువలన లాభముగల్గఁజాలదని చెప్పి మర్యాదపూర్వకముగ వారిని వారించిరి. కాని వీరవరులెల్లరు శౌర్యరసముట్టిపడఁ బండ్లు కొఱకఁ జొచ్చిరి. అంత మంత్రియగు చక్రధరుఁడు లేచి శ్రీ చక్రవర్తిగారు గోల్కొండనవాబునకు వ్రాసినలేఖ నిట్లు చదివి వినిపించెను.

"అయ్యా!

మీకును, మాకును మైత్రి చాలకాలమునుండి వచ్చు చున్నది. అట్టిమైత్రినే మనకెల్లప్పుడును దైవము ప్రసాదించు నుగాత!

మా కొలువునందు విజయసింహుఁడను సుప్రసిద్ధుఁడగు పడుచువాఁడు కలఁడని మీ కెఱిఁగియే యుండురు. అతఁడు మాసైన్యాధికారులలో నొకఁడు. ఉన్నతవంశీకుఁడు. సుగుణ వంతుఁడు. అతని వంశమెల్ల పౌరుషప్రధానము. అతనిని మీ దేశములో నున్న గౌరవనీయుఁడగు శృంగారపురపు జమీందారు, శ్రీసోమశేఖరమూర్తిగారికూతురు జగన్మోహిని వరించినది. కాని పాపము మీరు రేపులగ్నమనఁగా వచ్చి జగన్మోహినిని జననీజనక సమేతముగా బంధించి గోలుకొండకుఁ దీసికొని పోయినారఁట. అట్టి యుత్తమసాధ్వీరత్నముల మానభంగముచేయుట మనబోంట్లకుచితముకాదు. స్త్రీజన మానరక్షణము రాజధర్మము.

కనుక మీరు వారిని విడచిపెట్టి మనమైత్రిని నిలుపుకొందురని తలఁచుచున్నాను. వృథాగా, ఈకొద్దిపాటి విషయమునకు గలహించుకొనుట మనకు శ్రేయోదాయకము గాదు. అన్యుని వరించిన స్త్రీని బలవంతముగాఁ దీసికొనివెళ్లి పెండ్లియాడుమని కోరుట మీకు మంచిదికాదు. మీరు వారిని వదలుదురని నమ్ముచున్నాను."

యోధవరుల హృదయపీఠములు కంపించెను. తన్ముఖములయందుఁ బొడసూపిన రక్తకాంతి యాసభామండప కుడ్య జాలములనెల్లను, కుంకుమ రాగ సమేతములనుగాఁ జేసెను.

'నేను తీసికొనిపోయెదను, నాకిండు. నేనుదీసికొని పోయెదను, నాకిండు' అని యావనులు ముందునకు దుమికిరి.

---

# పదునైదవప్రకరణము

## తిరస్కారము

గోల్కొండదర్బారున కొకసారి పోవుదము. అది నానావిధ నూతనాలంకార శోభితమై యుండెను.

అందుఁ దమతమ పదవులకుఁ దగినతావులయందు, మంత్రులు, యోధులు మొదలగు వారెల్లరును గూర్చుండి యుండిరి. కొందఱు ద్రాక్షారసముసుద్రావి హాయిగా, ఆ వినోదములను జూచుచు గూర్చుండిరి. నవాబు సింహాసనాసీనుఁడై యుండెను. అనర్ఘమణి జాలములచే నాసభామంటప కుడ్యములు ప్రకాశించుచుండెను. అందు నగిషీపనులు మనోహరముగాఁ జెక్కఁబడెను. ఆ గోడలపైన లతలు, వృక్షములు, హంసములు, మయూరములు సువర్ణపుఁబనులతోఁజిత్రింపఁబడి యుండెను. మహమ్మదీయులు నానావిధాలంకార ప్రియులు. వారికి భూలోకవినోదములందుఁ బ్రీతి విస్తారము.

అందలి వారెల్ల నానావిధ చిత్రవిచిత్ర వస్త్రాలంకార శోభితులయి యుండిరి. కొందఱు తెల్లపట్టుతోను, కొందఱు నల్లపట్టుతోను, కొందఱెఱ్ఱపట్టుతోను జేసిన పాగాలను టోపీలను ధరించియుండిరి. అందఱును వివిధవర్ణ శోభితములయిన

ఘరాయిలను ధరించిరి. వారిటోపీలపైఁ దురాయి లతిమనో హరముగాఁ బ్రకాశించుచుండెను. మొగమల్ కోట్లపైనఁ జేయఁబడిన బంగారుబుటేదారు పనులు చూచువారి కనులకు మిఱుమిట్లు గొలుపుచుండెను. అట్టియెడ నొకసేవకుఁ డచటి కరుదెంచి యిట్లనియె.

'దేవా! విజయనగరమునుండి రాయబారి వచ్చినాఁడు. దేవర దర్శనమును గోరుచున్నాఁడు.'

అతఁ డాదూతలనుగూర్చి చారులమూలముగా నిది వఱకే వినియుండెను.

'మా కా రాయబారులతోను, గీయబారులతోను బనిలేదు ?' అని ప్రభువు చెప్పెను.

'అవునండి. అంతే' అని యొకఁ డనియెను.

మంత్రి నవాబువంకఁ జూచి 'అయినను, అది వినుట మనకుఁ గర్తవ్యము" అనెను. మఱికొందఱు మంత్రిమాటను బలపఱచిరి.

'అయినచో రానిమ్ము' అని ప్రభువు మరల ననెను.

సేవకుఁడు 'చిత్తము' అని వెడలిపోయెను.

అంత నా రాయబారి నవాబునకు సలాముచేసి లోనఁ బ్రవేశించెను. నవాబు మాటలాడలేదు. మఱి యెవరును మాటలాడలేదు. అతనికన్ను లెఱ్ఱఁబడుచుండెను. అది మంత్రి చూచెనో లేదో కాని,

'ఇటువచ్చి కూర్చుండుఁడు.' అనియెను.

'చిత్తము' అని యతఁడొక కుర్చీపై నధిష్ఠించెను.

'మీరు తెచ్చిన రాయబార మేమి?' అని మంత్రి యడిగెను.

'ఇది చూచుకొనుఁడు. తక్కినది మీకే యర్థమగును.' అని యతఁ డాయుత్తరము నొసంగెను. అది గైకొని మంత్రి మొదలునుండి తుదవఱకు సాంతముగాఁ జదివెను. అచ్చట నున్న యోధుల మొగములు రక్తవర్ణాలంకృతములయ్యెను. నవాబు కన్నులెఱ్ఱఁబడెను.

"సేనాధిపతులారా! యావన తురుష్కులారా!

చూచితిరా కాల మెట్లు విపరీతముగాఁ బరిణమించి నదో? నా కితఁడు బుద్ధిగఱపుచున్నాఁడు. పైగా నితనితో స్నేహమును నేను నిల్పుకోవలయునట! ఇతనిస్నేహమును నిలుపుకొనకయున్నచో మన కిఁక దిక్కులేదుగాఁబోలు! మన మితని మోచేతిక్రింద నీళ్లు త్రాగుచున్నామని తలఁచెను. ఔరా! కాఫరులపని క్రిందును మీదును దెలియకున్నది. ఇందుకు వారి ననవలసిన పనిలేదు. మనయొక్క కృపయే ఇంతవఱకుఁ దెచ్చినది. పూర్వము మన ముసల్మానులు చేసి నట్లు మనముకూడఁ జేసినచో మనల నిట్లు వీ రధిక్షేపింపఁ గలరా? ఆహా! కాల మాహాత్మ్యము! రామరాజు నాకు నీతు లుపదేశింపవలసి వచ్చెనుగా! కనులు పొరలు గ్రమ్మినవి కాబోలు!" అని యతఁడు కూర్చుండెను.

దుర్మార్గునకు మేలుచేయుట కాలసర్పమునకుఁ బాలు పోసి పెంచుటవంటిది. ఈ కుతుబ్షాహాను రామరాజు పూర్వము రక్షించెను. కుతుబ్ షాహాతండ్రి గతించినప్పు డతనియన్న తండ్రిస్థానము నలంకరించెను. అతఁ డితనింజంపఁ బ్రయత్నింప నితఁడు రామరాజు శరణుజొచ్చెను. అతఁ డితనిని విజయనగరమున నిర్భయముగాఁ గాపాడెను. తరువాత యన్న చనిపోగా నితఁ డతనికుమారునింజంపి తద్రాజ్యభారమును వహించెను. అట్టి యీపురుషునకు రామరాజు ఉపదేశవాక్యములు విషతుల్యములుగాఁ బరిణమించెను.

నవాబట్లనఁగనే సేనానాయకులును, తోకత్రొక్కిన త్రాఁచులకరణి లేచి రామరాజునకుఁ బొగరెక్కెనని యొకఁడును, అతనిని నాశముచేయవలెనని యొక్కఁడును నోరికివచ్చినట్లెల్లఁ గూయఁజొచ్చిరి.

అంత రామరాజు రాయబారి యిట్లనెను.

"రాజా! ముసల్మాను యోధులారా!

మీ రూరక రామరాజును నిందించినఁ బ్రయోజనము లేదు. చాటున నూరక మొఱుగుట సజ్జనఁ లక్షణము కాదు. మీకు శక్తియున్నచో యుద్ధము నందాయన సైన్యములం దాకొని జయించి మగఁటిమి చూపుట లెస్సగాని, యిట్లు చేతగాని ప్రేలుఁడు ప్రేలిన లాభమేమి? ఇట్టిపనిని మూలనుండు ముసలమ్మలు మీకంటె నెక్కుడుగాఁ జేయఁగలరు.——"

ఇట్లనుచుండఁగనే యొకతురుష్క యావనుఁడతనిపైకి దుమికెను. అది చూచి రాయబారితోవచ్చిన మఱియిద్దఱు బాకులుతీసికొని విజృంభించిరి. మనరాయబారియు విజృంభించి 'ఆంధ్రవీరులు బొందిలోఁ బ్రాణమున్నంతవఱకు రాజభక్తిని విడువరు. ప్రాణములను లెక్కసేయరు. రండు! సంతోషముతోఁబ్రాణముల నిట విడిచెదను' అనెను. ఆ యిరువురుఁ గూడ కాలానల జ్వాలలను మీరుచున్న రౌద్రరూపములతో సిద్ధముగా నుండిరి.

ఇఁక నవాబు బుసగొట్టుచున్న కాలసర్పమువలె నుండెను. మంత్రి 'రాయబారులం జంపిన నేమి లాభము? కర్తవ్యము మానుఁడు' అనెను. అందుఁ గొందఱు మహారాష్ట్రవీరులుండిరి. వారతిప్రయత్నముసఁ దురకల నాపిరి. 'బ్రతికిపోతిరి. పోయి యుద్ధప్రయత్నములు చేసికొమ్మని మీ రాజుతోఁజెప్పుడు' అని నవాబు రౌద్రముతోఁజెప్పెను.

---

# పదునారవ ప్రకరణము

## జ్యోతిషము

బుద్ధిసాగరుఁ డట్లు కారాగారమునఁ బెట్టఁబడెనుగదా ? పాప మతఁడిపుడేమి చేయుచున్నాఁడో, ఒకసారి చూచి వత్తము. అతని కాపట్టణమున నొకగొప్ప భవనమిచ్చిరి. దాని చుట్టును జక్కని యుపవనముండెను. అతని కందు సకల సౌకర్యములు నమర్చిరి. అతనికిఁ గొదువ లేశమును లేదు. పూర్వమునుండియు భరతఖండమునఁగల రాజ్యములను బాలించిన రాజులలో నెక్కడో క్రూరు లొకరిరువురు తక్క తక్కిన వారెల్ల రాజఖయిదీల నిట్లే యాదరించిరి.

ఖయిదీ యనఁబడుటతక్క నతనికి సంభవించిన కష్టమేమియు లేదు. ప్రాకృతజనులు కష్టములకు సహింపలేక దుఃఖింతురు. అతఁ డట్లు చింతింపలేదు. అతని ముఖము ధైర్యవంతముగా నుండెను.

ఒకరికి ద్రోహముచేసి పాపకృత్యములచే లోకమునకు హానిచేసినవారిని శిక్షించుట రాజధర్మము. కాని యేపాపమెఱుఁగక ప్రజలచేఁ బూజింపఁబడువారిని జెఱసాలలోనుంచుట ఆత్మనాశమును జేసికొనుటయే. ‘ వినాశకాలే విపరీత

బుద్ధిః' అని దానినే పెద్దలందురు. కాని యింతమాత్రముననే అట్లు సంభవించితీరునా? ఏది యెట్లయినను అట్టినిర్దోషులను మనము పూజింపక మానుదుమా? వారివంటిపూజ్యులు మఱి కలరా? అట్టివారి పాదరజోలేశములచే నిండిన యాకారాగారములు విగతపాపములై పుణ్యక్షేత్రములుగాఁ బరిణమించును. అతఁడు నేఁడుదయము నిర్మలములై మనోహరమై సుగంధయుక్తములై సమీపస్థ కుసుమిత లతాపరిమళ సమేతములై యచటికిఁ జేరువగానున్న యొకసరస్తీరమునుండ వచ్చుచున్న కమ్మతెమ్మరలను సేవించుచు నాభవనపుముందు భాగమున షికార్లుచేయుచుండెను. అతఁ డిట్లు యోజింపసాగెను.

'ఇది కేవలము నన్నుజంపవలయుననియు, అది ప్రత్యక్షముగాఁజేసిన లోకమునకుఁ గోపము వచ్చుననియుఁ బన్నిన పన్నుగడ. ఇంతకంటె మఱేమియుఁగాదు. నేనిందుండిన దప్పించుకొని విఘ్నములు కలిగింపక యుండనని వారెఱుఁగుదురు. మఱియు నిట్లుచేసినచో, అమాయకులగులోకులు, వారియాంతరంగిక దూరదృష్టిని దుస్స్వభావమును గ్రహింపనేరక తమ్ము మిక్కిలి దయాస్వభావముకలవారని స్తుతింతురనియు వారి యాశయము. ఇదియెల్ల దీర్ఘదృష్టియొక్క పర్యవసానమే. అగుఁగాక! దీనికిఁదఁగిన బ్రతిక్రియ నెఱవేర్పఁజాలనా?'

అతనికి దూరమున నొక బిక్షుకుఁడు కన్పట్టెను. ఆ బిక్షుకుఁడు శాంతుఁడు. అతనిరూప ముజ్జ్వలమై యుండెను. అతఁ

డొక సన్యాసి వేషమును ధరించియుండెను. ఆతని గడ్డమంత దీర్ఘముగా లేదు. అది నెఱసియు నుండలేదు. అతని మొగము పసిమిచాయలు తేరుచుండెను. కనులు దీర్ఘములై యోచనా సమర్థతను జాటుచుండెను. ఛత్రముకలదు. హస్తమునఁ గమండలము శోభిల్లుచుండెను. ఆ సన్యాసికి గంజాయిబీల్చు నలవాటున్నట్లు తోఁచుచుండలేదు.

అతఁడాపట్టణమున నచ్చటచ్చటఁదిరిగి యచటికి వచ్చెను. మంత్రియతని వంకఁజూచెను. అతనిమనమున నేదియో తట్టెను. కాని యతఁడేమియు ననలేదు. అతని మొగమువంకఁ జూచి యాసన్యాసి చిఱునవ్వు నవ్వెను. కాని యది యితరులకు గోచరింపలేదు.

అచట, కారాగార పాలకుఁడును, ద్వారపాలకులును, మఱికొందఱు సేవకులును గలరు. కారాగారపాలకుఁడు ముందుకువచ్చి యిట్లనెను.

'నీ వెవరవు? ఇచ్చటకేలవచ్చితివి? నీకిచట బిచ్చము పెట్టువా రెవరును లేరు. పొమ్ము'

'నాకు బిచ్చము మాత్రమే ప్రధానముకాదు. మీ వంటివారి దర్శనము నాకుఁ దృప్తి నిచ్చును'.

'మావలన నీకేమికావలయును?'

'నాకేమియు నక్కఱలేదు. కొంచెము సంభాషణము మాత్రమే'

'అది యేవిషయముంగూర్చి. ఇపుడు యుక్తమేనా?'

అతఁడు ప్రత్యుత్తరము నీయలేదు. అతనికనులు మాత్రము స్తిమితములై యుండెను. అవి సరిగా, ఆకారాగారాధిపతి మొగముననే వ్రాలెను.

'అది రహస్యమా ఏమి? ఏకాంతస్థలము కావలయునా? ఏల యట్లు నిశ్చలముగాఁ జూచుచున్నావు?'

'అది రహస్యముకాదు. నేను జ్యోతిషము చెప్పఁగలను'

పరిహాసమును సూచించుచు, ఆకారాగారాధిపతి మొగమునఁజిఱునవ్వుదయించెను. అది యతఁడు చూచెను. కారాగారాధిపతి యిట్లనెను.

'జ్యోతిషమునందు మాకు నమ్మకములేదు. జ్యోతిష్కులు వట్టి దాంభికులు. జ్యోతిషము బూటకము.'

'అది మీ విజయనగర జ్యోతిషము. మా జ్యోతిష మట్టిదికాదు.'

'మఱి మీదే దేశము'

'మా దేశము పేరు నీకేల? నీకు వలయు సంగతుల నెల్ల నడుగుము. సరిగాఁజెప్పెదను. నాకుఁ గేరళము తెలియును'

'నీది మళయాళదేశమా?'

'కావచ్చును'

'దేశ దిమ్మరులు మిక్కిలి గడుసువాండ్రు. వారితో మాటలాడుటే మిక్కిలి దుర్లభము. అడిగినదానికి సరిగాఁ

సమాధానము చెప్పరు. భయముండదు. అట్టివారితో మాట లాడుట కష్టము' అనెను.

అది యతఁడు వినలేదు. అతఁడిట్లనెను.

'నీకు నాల్గు సంవత్సరముల క్రిందఁ బాముకఱచినది. క్రిందఁబెట్టిరి. మూలికాప్రయోగముచే నొక వైద్యుఁడు నిన్ను రక్షించెను'

ఆ యధిపతి, ఆశ్చర్యపూరితుఁడై పోయెను. మఱి యంతడు మాటలాడలేదు.

'నీతండ్రికి నీవొక్కఁడవే కుమారుఁడవు. నీకిరువురు సోదరీమణులున్నారు. వారికిఁ బెండ్లియైనది. కాని పాపము! చిన్నాపెమాత్రము విధవయైనది.' అతనికాశ్చర్యమెక్కుడాయెను.

'మహాత్మా! మీరు చెప్పినదంతయు యదార్థమే'

'నీ వీ పట్టణమున కెనిమిదామడల దూరమునఁగల యొక చిన్నగ్రామమునఁదాళ్ళతోపులో నొకగృహములో వెలయు మప్రసిద్ధు—'

అతఁ డాగుఁడని సంజ్ఞసేసెను. ఇతఁడాగి, ఆయధికారి చెవిలో నేదియో గొణిగెను. అతడత్యంతా నందమున మునింగెను.

'అయ్యా! ఇదిగై కొనుఁడు. మీఋణమ్మును దీర్చుటకు నే సమర్థుఁడనుగాను. ఇంతతో సంతృప్తివహింపుఁడు' అని

యతనిముంజేతియందు మెఱయుచున్న బంగారుకడియమును దీసి యొసఁగఁబోయెను.

'మాకట్టివి యవసరములేదు. కాంచనము మాకేల? సంసారమా? భార్యలా? బిడ్డలా? మాకు వేళకుబట్టెడన్నము దొరకిన నంతియే చాలును. మీవంటివారి సంతోషమే మాకుఁ దగినప్రతిఫలము. అదిచాలును.'

అది చూఁచుచు, నచ్చటివారిలోఁగొందఱు 'స్వామీ! మాకుఁగూడఁజెప్పుడు' అని ప్రార్థించిరి.

వారి వారికిఁ దగినరీతులను వారికెల్లరకు సరిగా నాతఁడు చెప్పెను. వారిలోఁ గొందఱకు రక్షరేకులు కట్టెను. వారెల్లరుఁ బరితృప్తులై రి. బుద్ధిసాగరుఁడు సమీపించెను.

'నీకుఁగూడ జ్యోతిషము కావలయునా యేమి?'

'అవును'

'నీవు వీరివంటి వాఁడవుగావు'

'ఎందుచేత?'

'నీవు రాజద్రోహివి'

'మహాత్ములకు నన్నియుఁ దెలియును. మీకుఁదోఁచి నది చెప్పుడు'.

అచట నున్నవారికెల్లరకు బుద్ధిసాగరునందుఁగల ప్రేమ మిక్కిలి విస్తారము. అతఁడు మంత్రిగానుండి వారికెల్లరకుఁ జాలమేలుచేసెను. విధివశమునఁ జెఱసాలలోఁబడి యిపుడు

వ్యారికిలోఁబడి యుండవలసివచ్చినను,అతనిని వారు గౌరవింపక మానినవారు కారు. అందుచే నతనిభవిష్య త్తెట్లుండునో, అతని యీకష్టము లెప్పుడు పోవునని యతఁడు చెప్పునో యని వారెల్లరు నతనివంక నేకదృష్టితో వీక్షింపసాగిరి.

'నీ వీరాజ్యమునకుఁ జాలకాలము మంత్రివై యుంటివి. అంతవఱకు నీవు రాజును విశ్వాసముతోడఁ గొల్చితివి. కాని యిపుడు రాజద్రోహి వయితివి. ఇంతలో నీ కీ శిక్షపోదు. కాని అది ఆయువుండినచో—నీయాయువు స్వల్పకాలమే! పాపము—' అతఁడంత నూరకుండెను. మంత్రిముఖమున విచారము తోఁచుటలేదు.

ఆకారాగృహాధిపతి అతనిచెవిలో నేమో యడిగెను. సన్న్యాసి మెల్లగా బుద్ధిసాగరుఁడు తప్ప తక్కినవారు వినునట్లు 'వారమురోజులలో—గండము' అనియెను. అతఁడు మరల బుద్ధిసాగరునివంక దృష్టిపారించెను. అతఁడును చూచెను.

'పాపము నీయందు నాకుఁ గరుణ జనించుచున్నది. నీపాపములు నశించును. దీనిని జేతికిఁగట్టుకొనుము.' అని యొక రక్షరే కతనికిఁగూడఁ గట్టెను. 'నాకిట్టి వానియందు విశ్వాసములేదు. అదివట్టిబూటకము' అని యతఁడు విప్పుట నటించెను. అచటి వారెల్లరుఁ జింతించిరి.

---

# పదునేడవ ప్రకరణము

## దీర్ఘదర్శి

రాత్రి ప్రొద్దుపోయెను. కారాగారాధిపతి యింటిలో నుండెను. అందు గొందఱు గుసగుస లాడుచుండిరి. ఆయింటి యరగుపైన వెనుకప్రక్క మనయోగి పరుండి యుండెను. అది దిడ్డివాకిలి. ఆవాకిట నెవరికిని విశేషించి పనియుండదు. ఆ దారి నాయింటికిఁబోవు వా రరిది. ముందు ద్వారముననే యెల్లవారును బోవుచుందురు. ఆయింటఁ గొందఱు గొప్ప వారుండిరి. వారున్నది సభామంటపము. అందుఁ బెద్దమనుష్యులు వచ్చికూర్చుందురు. అది మనోహరముగా నుండెను.

అందు ధనరాసులు కుప్పలుగా మోఁగుచుండెను. అంతధనము నతఁడెప్పుడు చూచియుండఁడు. కాని యతనికి గుండెలు కొట్టుకొనుచుండెను. అతనికేమియుఁ దోఁచినది కాదు. అతని కా యోగితో సంభాషింపవలయునని కోర్కె పుట్టెను. అతఁ, డాప్రదేశమునకుఁ బోయి అతనిని మెల్లగాఁ దట్టెను. అతఁడు మేల్కొనెను.

'అయ్యా! ఇపుడు నే నొకయంశము మీతో మాట లాడవలసియున్నది.'

'ఆఁ! మాటలాడుము. ఫరవాలేదు'

'మంత్రిని జెఱసాలలోఁ బ్రొద్దున మీరు చూచితిరి గదా?'

'ఆఁ!'

'ఇప్పు డతనిని వదలిన'

'నీకుఁ బెద్ద లాభమువచ్చును'

'నాకు లాభ మక్కఱలేదు. ఆయనకు నావలనం గష్టమేదియు రాదుగదా?'

'ఏమియు రాదు.'

'అది వెల్లడికాదా?'

'కాదు. అగునట్టిస్వభావమే యిందులేదు'

'పాపము! మంత్రికిఁగూడ గష్టములు రావుగదా?' అని మరలననెను. సన్యాసినవ్వెను. అతఁ డతనిచెవిలో నేమో రహస్యముగాఁ జెప్పెను.

'మీరుచెప్పినది మిక్కిలి చిత్రముగానున్నది'

'అవును. ఇంకను ముందు గలదు'

'నిశ్చయముగా నిది యొకకథ. ఇపుడు నాకు సంశయ నివృత్తి యైనది'

'ఇఁక సత్వరమే నీవు పోయి యందులకిష్టపడి వారిని బంపుము'

'చిత్తము'

అని యతఁడు పోయెను. లోపల ధనమును గైకొనెను. అతఁడొక పురుషుని వెంటఁబెట్టుకొని తిన్నగాఁ జెఱసాలకుఁ బోయెను. అచట నతఁడు ద్వారపాలకులతో నేదియో గుసగుసలాడెను. వారిచేతిలో నిన్ని నవరసులను గ్రుమ్మరించెను. ఆ వచ్చినవారితో నిట్లుభాషించెను.

'మఱి బండి సిద్ధము చేసికొనివచ్చినారా?'

'ఆఁ! వచ్చుచున్నది.'

'ఇంకెంత సేపగును?'

'త్వరలోనే రావచ్చును'

అంతలో దూరమున బండిచప్పుడు వినవచ్చుచుండెను. అది యంత కంతకు సమీపించెను. తుట్టతుద కది యాచెఱసాల ముంగిట నిలిచెను. ఆ యధికారి తనదారిని దాను బోయెను. నూత్న పురుషులిట్లు భాషించెను.

'ఇంత యాలస్య మేల చేసితివి?'

'నాకు ముందుగాఁ దెలియలేదు. ఇపుడే తెలిసినది.'

'గమ్య స్థానమునకు వారు పోయి యుందురా?'

'ఆఁ! ఇదివఱకే పోయి యుందురు'

ఆ నూతన పురుషుఁ డిటునటుచూచెను.

'ఆయుధములును మఱచి పోలేదుగదా?'

'వెంట నూరి మఱి తీసికొని పోయినారు'

'పదిలముగా నుండవలయును సుమీ' అని చేతిలో

నొక బంగారు నాణెముంచెను.

'అందుకు సందేహమా ?' అనెను.

ఆ నూత్నపురుషుఁడా ద్వారముం బ్రవేశించెను. అతని కెవరు నడ్డము చెప్పలేదు. బుద్ధిసాగరుఁడున్న ప్రక్క భవనమున కతఁడు పోవుచుండెను.

ఆ భవనమున బైయంతస్తునందుఁ బఱుపుపై నతఁడు పరుండియుండెను. అతనికి నిద్దురపట్టలేదు. అతనిమనస్సు యోజనమగ్నమై యుండెను. అచ్చట దీపము ప్రకాశించు చుండెను. ఆ దీపపు వెలుతురున, ఆ దివ్యమూర్తిని మనము కన్నులార దర్శింపవచ్చును. అట్టి కష్టపరంపరలలోనున్నను, అతఁడు ధైర్యమును విడువలేదు. ఆనూతనపురుషుఁ డతని సమీపించెను. అతఁడతనిగాంచి యిట్లనెను.

'నీవెవరవు ?'

'నన్ను తమమిత్రులగు విజయసింహుఁ డంపినాఁడు'

'ఇంతయర్ధ రాత్రమున నేలఁ యతఁడు నిన్నంపి నాఁడు ?'

'మిమ్ములను గొంపోవుటకై'

'నన్నెట్లు గొంపోవఁ గలవు ? రక్షకులు లేరా'

'ఇపు డెవరును లేరు'

'రాజద్రోహిని జెఱసాలలో నుంచినప్పుడు రక్షకు లుండరా ?'

'వారి కతఁడేదో సమాధానముచెప్పినాఁడు'

'ఇప్పుడు నన్నెక్కడికిఁ గొంపోవుదువు?'

'చెఱనుండి విముక్తులను జేయుటకు. తరువాత మీ యిష్టము'

'నిన్ను నేనెఱుఁగను'

ఆ నూత్నపురుషుఁ డీప్రశ్నలకు మిక్కిలి లోనఁ గంపింపఁ దొడఁగెను. అతనికి బుద్ధిసాగరుఁడు తమతంత్రమునం బడునన్నయాశ తగ్గెను. 'ఈ యుత్తర మున్నదికాదా? ఈ దివ్యాయుధమునకుఁగూడ నితడు జంకకుండునా?' అనుకొనెను.

'నీ దగ్గఱ నే మేని యతఁడే నిన్నంపెననుటకుఁ దగిన యాధారముకలదా?'

'ఇదిగో, ఈయుత్తరమును జూచుకొనుఁడు. తమ సంశయమెల్లఁ దీరును'

అతఁడాయుత్తరమును దీసి బుద్ధిసాగరుని హస్తమున నుంచెను. అతఁడది స్వీకరించి మెల్లగా నిట్లు చదివెను.

"శ్రీమహా మంత్రులవారి సన్నిధికి:—

తమ కృపాపాత్రుఁడు విజయసింహుఁ డనేక నమస్కారములు:—

అయ్యా!

మీరు ప్రతిపక్షుల యొక్క కుట్రలవలన, నేద్రోహముఁ జేయకున్నను, రాజద్రోహులై వృథాగా శిక్షనందుచున్నారు. ఇందుకు నేఁజాల చింతిల్లుచున్నాను.

అయినను, ఇట్టికష్టస్థితిలోఁ దమకు నాకు సాధ్యమైనంత మేలుకలుగఁజేసి, తమయెడ నాకుఁగలభక్తిని జూపుకొనఁదలఁచితిని. నేను కారాగారమునుండి మిమ్మెట్లయినను దప్పించుటకు బూనితిని. దేవునికృపవలన నిందు మనకు సంపూర్ణ విజయము సిద్ధించునుగాక !

కారాగారాధిపతిని మనకులోఁబడునట్లు చేసితిని. దానోపాయమున ద్వారపాలకులనుగూడ మనపక్షమునకుఁ ద్రిప్పితిని. మన మీరాత్రి పోవునప్పు డడ్డమువచ్చువా రెవరును లేరు.

ఈ యుత్తరముం దెచ్చిన వాఁడు నాకు మిక్కిలి స్నేహితుఁడు. బంధువు. ఇతఁడు మీయందు భక్తికల్గి మెలఁగునట్టి వాఁడు. ఇతని పేరు కుమారసింహుఁడు. ఇతనికొక బండినిచ్చితిని. బండివాఁడుకూడ మిక్కిలి నమ్మక మయినవాఁడు.

నేను మీరాక కెదురుచూచుచు, తుంగభద్రా స్రవంతి దక్షిణనున్న యిసుకగుట్టల దగ్గఱగానుండు విశాలమగు వటవృక్షముకడ నుందును. అది మనకెంతయుఁ దగినప్రదేశమని మీ రెఱుఁగుదురు. అచటినుండి మీరు పరదేశమునకుఁ బోవచ్చును. ఇచట నుండుట మనకు క్షేమంకరముకాదనుట మీ రెఱుఁగని విషయముకాదు. శత్రుసమూహముల మధ్య నుండుట కంటె నపాయకర మేమియుండును? ఒకవేళ మీరు పరదేశగమన మంత మంచిదికాదనియు, ఇచటనే మాఱువేసమున నుంట మంచిదనియుఁ దలఁచినను, అచటికి వచ్చి

చర్చించి,పిమ్మట,ఇష్టమగు కార్యమును జేయుటయే మంచిది. ఏలయన? అది రహస్యవ్యాపారములకు మిక్కిలి యోగ్య మయినస్థలము. అంట నిర్భయముగా నెంతసేపయినను, ఏవిష యమునుగూర్చియైనను జెప్పుకొనవచ్చును.

విజయనగర ప్రాంతములు జనాకీర్ణములు. అచ్చట రాత్రింబవళ్ళు నెల్లవేళలను మానవులు సంచరించుచునుందు రు. రహస్యవ్యాపారముల కాప్రాంత భూములు యోగ్యములు కావు. రాత్రిపూట పట్టణము వెలుపలకుఁబోవుటకు ద్వార పాలకులకుఁ గనపఱచవలసిన చీటిని సంపాదించి కుమార సింహునకిచ్చితిని. మనకింక నేభయమును లేదు. కనుక మీరు సంశయింపక త్వరగా మీకొఱకంపినబండినెక్కి పైఁజెప్పిన ప్రదేశమునకు దయచేయుఁడు. అచట నేను మీకొఱ కెదురు చూచుచుఁ దగినంత పరివారముతో సిద్ధముగా నుందును. మీరు పరదేశమునకుఁ బోవలయునన్న వలయుసామగ్రిని గుఱ్ఱములను దీసికొనిపోవుచున్నాను.

ఇపుడు మనకెంతయు ననుకూలమగు సమయము.

చిత్తగింపుఁడు.

ఇట్లు

భవత్పాదారవింద సేవకుఁడు

విజయసింహుఁడు"

ఆ యుత్తరము నతఁడు సాంతముగాఁ జదివెను. అతఁడు తలయూఁచెను!

మహామహుల క్రియ లర్థసమన్వితములు. భాషలు మితములు. వారేదిచేసినను, ఏది మాట్లాడినను,అందు పూచిక పుల్లంతయైనను వ్యర్థముండదు. అదియెల్ల నర్థసమన్వితమైయే యుండును. వారిభావము లనన్యగోచరములు. అతి దీర్ఘా లోచన సమన్వితములు. అతఁడట్లేల తలయూఁచియుండెనో మన కేమి తెలియును ? అతఁడిట్లనెను

'కుమార సింహుఁడవు నీవేనా?'

'చిత్తము. నేనే'

'బండి యెక్కడ ?'

'ద్వారము కడ నున్నది'

'విజయసింహునకు నీ వే మగుదువు ?'

'అతఁడును మేమును జ్ఞాతులము. వరుసకు, అతఁడు నాకన్నయగును.మాకిరువురకును జిన్నప్పటినుండి స్నేహము.'

'అతఁడింక నేమేని నీకు జెప్పినాఁడా ?'

'ఆఁ! తాను గొంద అనుచరులతోఁగూడి పోయి తుంగభద్రానదీతీరమున నున్న యాపెద్దమఱ్ఱిచెట్టుదగ్గఱ తమ కొఱకు కనిపెట్టుకొని యుండునని చెప్పినాడు'

ఈ ప్రశ్నములన్నియు నతఁడతని నేల యడుగవల యును ? ఇదియంతయు వ్యర్థప్రసంగము కాదా ? అతఁడట్లు

వ్యర్థప్రసంగముచేయునా ? ఆయుత్తరమున నీసంగతులన్నియుఁ జెప్పఁబడియుండలేదా ? అయినచో నతఁడు మరలనూరకిటేల యతని నడుగవలయును ? అతఁ డొకసారి యా సౌధము ముందునకు వచ్చి యుమ్మి యుమియుచు నల్గడలఁ బరీక్షించి చూచెను. అతని కేమియు గోచరింపలేదు.

'ఇప్పుడెంత కాలమైయుండును ?'

'రమారమి రెండుజాములైనది'

'బండివాఁడు సరియైనవాఁడేనా ?'

అతని కీ ప్రశ్నలు విసుగుఁబుట్టించు చుండెను. అతని కా మంత్రియొక్క భావమేమియు నర్థముకాలేదు. అతఁడు వత్తు ననియు రాననియుఁ జెప్పలేదు. వచ్చునది రానిది యతనికిఁ దెల్లముకాలేదు. హృదయ మూఁగుచుండెను. ఏమన్న నేమ గునోయని భయము. పయికిమాత్రము గాంభీర్యము. మంత్రి యతని నప్పుడప్పుడు వీక్షించుచుండెను. అది యతనికి మఱింత భీతిదాయకముగా నుండెను. ఎట్టకేల కతఁడిట్లనియెను.

'అయ్యా ! కాలము పోవుచున్నది. ఆలస్యమేల ?'

'అవును. మనకిప్పుడు కర్తవ్యమేమి ?'

'ఏమియు లేదు. పోవుటయే.'

అతఁడు మరల నొకపరి సౌధపురః ప్రదేశమునకు వచ్చెను. దూరమున నతని కేదో గుర్తుకాన్పించెను. 'ఆఁ! ఇఁక పోవచ్చును' అని తనలో ననుకొనెను.

'నా జాగులేదు'

'నావెంట దయచేయుడి?'

కుమార సింహుఁడు ముందునడిచెను. బుద్ధిసాగరుఁడతనివెంట నడువ నారంభించెను. అతని హృదయము సంతోష సంపూర్ణమాయెను. తానంతటి మహామంత్రిని మోసపుచ్చగల్గితినిగదా యని యతఁడు తన్నుదానే యభినందించుకొనఁజొచ్చెను. అంతకంటె నతనికిందువలనఁ గల్గు లాభమును దలఁచుకొన్నప్పుడు వచ్చు హర్షమునకు మేరలేకుండెను.

అతఁడు మెల్లగాఁ దనలోఁ దానిట్లు తలపోసికొనెను. 'బుద్ధిసాగరునంత మహామంత్రిని మోసపుచ్చఁగల్గితిని. ఇఁక రేపు నాయిల్లు బంగారముతో నిండును. చక్రధరుఁడుగారు నా తెలివికి నన్ను అభినందించును. ఆహా! నాజన్మ మెంత యదృష్టవంతము?'

ఆ యిద్దఱును వాకిటనిలిచియున్న బండిదగ్గఱకుఁ బోయిరి.

'అయ్యా బండినెక్కుఁడు' అనియెను.

అతఁడు బండిని నధిష్ఠించెను. మహాపురుషులకు దీర్ఘదర్శిత్వము స్వాభావికము. సామాన్యుల కగోచరములగు నంశములను వారు చమత్కారముగా గ్రహింతురు. అట్టివారి బుద్ధి అత్యంత సూక్ష్మము.

ఏయంశమునఁగాని చక్కఁగాఁజర్చింపక ప్రవేశింపరు. అట్టిచోఁ దన్నెవఁడో యొకనూతనపురుషుఁడు వచ్చి 'మిమ్ము జెఱనుండితప్పింతును, రండు' అనియొకయుత్తరమును జూపించినంత మాత్రమున నదియెల్ల విశ్వసింతురా? దూరగ్రహణైక సమర్థమగు వారిబుద్ధియందు మోసమును శంకింపకుండునా? అట్లు శంకింపదేని యది స్తుత్యార్హమా? అట్లేల యనవలయును? 'ప్రమాదోధమతామపి' కదా? విశ్వసించినను విశ్వసింపకున్నను బుద్ధిసాగరుఁడు బండినెక్కెను. అది కదలెను. కుమారసింహుఁడును బండివాఁడునుగూడ నెక్కిరి. మంత్రి యతనితో నేదోప్రసంగము చేయుచుండెను. అస్పష్టముగా, ఆ బండికివెనుక అప్పు డప్పుడు చిన్నచప్పు డగుచుండెను. ఈధ్వని విన్నప్పుడు మనకు నిన్నయాదిల్యాహో రహస్య మందిరమున చెట్టుకడ విన్నచప్పుడు స్ఫురింపకుండునా? ఆ బండి తుంగభద్రాస్రవంతి నానుకొనియున్న యడవులలోనికిఁ బోవుచుండెను.

---

# పదునెనిమిదవప్రకరణము

## ఆశ

ఇంకను సాయంకాలము కాలేదు. అరవికసించిన మల్లికాకుసుమముల సౌరభము, ముగ్ధా సుందరీ మనోహరమందహాస పరంపరల తెఱంగున సరసుల హృదయములను హరించుచుండెను. అతి తీక్ష్ణకర పరంపరలచేతఁ బ్రపంచమును గాల్చివేసిన ప్రభాకరుండు కొంచెకొంచెము శాంతిలుచుండెను. అతని తేజఃప్రకరమెల్ల వయసుతోఁగూడఁ దగ్గిన ముసలివాండ్ర పరాక్రమ మట్లు కుంచితమాయెను. ఇప్పటికి సాయంకాలపుటెండ ప్రపంచమునకెల్ల బంగారపుఁ బూతపూయుచు మనోహర మగుచుండెను.

అట్టియెడఁ దనసౌధారామమునందుఁ గల చంద్రశిలావినిర్మిత విహారమంటపమునందు మనమిదివఱకుఁ జూచిన గోల్కొండపట్టపురాణి యిటునటు తిరుగుచుండెను. సమీపమునంగల కాసారముమీఁదుగా పూసారములు త్రావుచు ఝుమ్మనుచుఁ గూయుచున్న మత్తభృంగముల కలమధుర రవములు కమ్మతెమ్మెరలతోఁగూడఁ గలిసికొనివచ్చి యామెహృదయమున కాహ్లాదమును గల్గించుచుండెను.

ఇట్లాపె యాభవనమున సాయంతనవిహారము సల్పు చుండఁగనే పొద్దుగ్రుంకెను. చీకటులు గ్రమ్మెను. ఆమె యింకను తనశుద్ధాంతమునకుఁ బోవసమకట్టినది కాదు. ఇప్పటికామె యచటికివచ్చి చాలసేపయినది. కాని ఆమె యేల యచటినుండి పోదు? ఆమె యెవరికోఁకో యెదురుచూచు చున్నట్లుండెను. అప్పుడప్పుడు పరధ్యానముగానుండి మత్తమధుకరములుచేయు నిస్వనములను కామినీ కింకిణీ రవములనుగా గ్రహించి యులికిపడుచుండెను.

అంతలో నొక తురష్కసుందరీ రత్నము తాను ముందు నడచుచు వెనుకవేఱొక సుహృదులాంగిని దీసికొని మెల్లగా వచ్చుచుండెను.

ఆమె యాసుందరినిజూచి 'సోదరీ! లోనికి దయ చేయుము' అనెను.

ఆ ముప్పురును లోనఁబ్రవేశించిరి. ఆమందిరమున నొక వైపుననున్న మెట్లపై నెక్కి యామందిరపుఁ పైభాగమున కరి గిరి. అది యత్యంత మనోహరముగా నలంకరింపఁబడెను. అందు పరిమళతైలముచేనింపఁబడినయొక దీపము వెల్గుచుండెను.

ఆ ప్రదేశమునకుఁ బోవఁగనే మనగోల్కొండ బేగము 'స్త్రీలోకరత్నమా! ఆ యాసనముపైఁ గూర్చుండుము' అని యామెను బ్రార్థించెను. ఆమె యాసనము నధిష్ఠించెను. ఆమెకెదురుగా నాపట్టమహిషి కూడ సమీపముగానున్న

యాసనముపైనఁ గూర్చుండెను. ఆమె ఱెప్పవాల్పక యా నూత్నసుందరివంకఁ జూచుచుండెను.

ఆమె తనమేలిముసుఁగును దీసివైచెను. ఆ సర్వలోక సమ్మోహనమగు సౌందర్యవతి యెవరు?

ఆమె జగన్మోహినియే. ఆబేగ మాసుందరివంకఁ జూచెను. ఆ వ్రాలినచూడ్కుల నాపె మఱి మరల్చుకొనలేకపోయెను. ఆచూపు లందు లగ్నమైపోయి మఱల్ప శక్యము గాక యుండెను.

సౌందర్యము విచిత్రమయినది. అది మానవులహృదయము నాకర్షించుచుండును. కొందఱ మొగములఁజూడఁగనే స్వాభావికమగు హర్షముదయించును. అది నూతన పురుషులకుఁ బ్రేమానుబంధముం గల్పించుటకుఁ మిక్కిలి నేర్పుతో సేవచేయును. ఆబేగ మా సుందరీమణింజూచుచు గొంతసేపు వఱకు మాట్లాడ లేకపోయెను. స్త్రీలసౌందర్యము స్త్రీలను బురుషుల మనోహరాకృతి పురుషులనుగూడ నొక్కొక్కప్పు డాకర్షించును.

కం॥ మగవానికి మగవాఁడును
మగువకు మగువయును వలచు మఱియేమన న
న్నగరపు రాజకుమారుల
జిగిబిగి సోయగము, చెలుల సింగారంబుల్.

ఆపె తుదకుఁ బ్రయత్నముచేసి యిట్లనెను.

'అక్కా! నేను నిన్ను 'అక్కా' యని పిలిచెదను. నీవును నన్నట్లే పిలువుము. స్నేహపూర్వకమగు నీప్రసంగమున దారతమ్య ముండరాదు.'

'అది మీదయే. సజ్జనలక్షణము'

'మీమొగముజూడఁగా నాకు మిక్కిలి జాలియగు చున్నది. పాపము మీకుఁ గల్గినయాపద యెంతయు విషాద కరమైనది.'

జగన్మోహిని మాటలాడలేదు. ఆమె మొగమున బాష్ప ములు గ్రమ్మెను. ఆపె దృష్టి ప్రసరించుటలేదు. మొగమును వంచి మెల్లగాఁ దనచేలాంచలమునం దుడిచికొనెను.

'అక్కా! మీనగర నామమేమి?'

'శృంగారపురము'

'అవును. అది మారాజ్యములోనిదే కాదా!'

'అవును'

'ఎక్కడ? కృష్ణానదీసమీపమునఁగాదా?'

'అక్కా! అవును. దానికి సమీపముననే యున్నది'

'మీతండ్రి జమీందారు. ఆయన వంశము సుప్రసిద్ధ మైనది. ఆయన సుగుణములంగూర్చి యీవఱకే వినియుంటిని. పాప మాయనకుఁ జాలకష్టమువచ్చినది. ఆయనపేరేమి?'

"ఆయనపేరు సోమశేఖరమూర్తి'

మరల నొకసారి యామె కనుంగొలకులు బాష్ప పరివృతములాయెను. స్త్రీ లెంత ధైర్య వంతురాండ్రయినను హృదయములు శిరీషకుసుమ కోమలములు. పురుషులవలెఁ గష్టముల నెదుర్కొని నిలువఁజాలరు. ఆమె లోన 'హా! తండ్రీ నావలన నీకెట్టి కష్టములు వచ్చినవి?' అని యనుకొనెను. అదియంతయు బేగము కనిపెట్టెను. ఆమె యామె నీప్రసంగము నుండి మార్పవలయునని తలఁచెను.

'నవనీతకోమలమగు నీహృదయము నీకష్టకరమగు ప్రసంగముచే క్షోభపెట్టను.'

ఆమెముఖము వినమ్రమైయుండెను.

'అక్కా! మనము స్నేహభావముగల సోదరీతిలకముల వలె మాటలాడుకొందమని నీతో ముందే చెప్పితిని. ఇంకను సంశయించెదవేల? నాయీప్రసంగము నీకేమేని కష్టమును గల్గింపదుగదా?'

'అమ్మా! అట్లుతలపోయకుము. కష్టములతోఁ గుందు చున్న నన్ను కృపావిశేషముచే మన్నించి నామేల్చెడ్డలను దల్లివలెఁ గనుఁగొనుచున్న మీప్రసంగము నాకుఁగష్టదాయక మేలయగుమా?'

'అవును! అదికాదు. హిందూసుందరీమణులు స్వాభావికముగా సాధుశీలము కలవారు. మెల్లగా మాటలాడుటకు వారలవడియుందురు. అది నే నెఱుంగుదును. వారికి మావలె

ప్రగల్భశీలత యుండదు. శాంతభూషితలు. వారుమాటలాడు నప్పుడు మనోజ్ఞమై లజ్జ ముఖమునకు వన్నెగల్గించుచుండును.'

'అవును. మీ రెఱుఁగని దేమికలదు?'

'కాని సోదరీ! మనము కొంచెము సేపదిమఱచి విచ్చల విడిగా మాటలాడుకొందము'

ఆమెభావమును సంపూర్ణముగా జగన్మోహిని గ్రహించెను. చిఱునవ్వంకురించెను. అది యామె స్వభావ రమణీయ మగు ముఖమునకు వన్నెబెట్టెను.

'అందుకు నాకుఁ గూడ నిష్టమే'

'స్త్రీలకు మైత్రియందపేక్ష మెండు. అందుచే నే నీ మైత్రిని గోరుచున్నాను'

'నామైత్రివలన మీకు లాభము కల్గకపోవచ్చును. కాని మీమైత్రి మాకత్యంత మవసరమైనది. మీదయమాకుఁ గావల యును. మామైత్రిని మీర పేక్షించుటకు మేమెంతటి వారము? అది మీకరుణయే'

'సోదరీ! అట్లనఁబోకుము. వయసునఁ జిన్నదానవైనను నీవు పెద్దదానవే. నీ సుగుణసంపద లిదివఱకే జగత్తునం దెల్లఁ బ్రసిద్ధములు. మైత్రికిఁ బరస్పర సుఖదుఃఖ నివేదనము కావలసియున్నది. అందొక పక్ష మున్నతమైనచో నసహ్యము. నేనొకవిషయమునఁ బెద్దను. నీ వొకవిషయమునఁ బెద్దవు. కావున మనమైత్రి సమానముగా శోభింపఁగలదు'

జగన్మోహినికిఁ గొంచెము చనువుచిక్కెను. ఆపె యింకఁ బ్రశాంతశీలయై యుంటమంచిదికాదని తలఁచెను. బేగముసాహెబంత విధేయతతోఁ దనవంటి సామంత ప్రభువు కూతును స్నేహముకొఱకు యాచించుట తనకు శుభకరమని యాపెతలఁచెనా యేమి? ఆమె మొదట నింతసన్మానము జఱుగునని తలంచియుండలేదు. ఇట్లనెను.

'యవన సుందరీమణులు చమత్కారవతులు. చలోక్తులకును చమత్కారములకును వారిసంభాషణములు పుట్టినిండ్లు అనివింటిని. అది నేఁడుకంటిని'

ఆ యవనసుందరి మోముదామర వికసించెను. సోగలైన యాపెకన్నులు విరళమాయెను. 'ఇపు డీమెకుఁ గొంచెము సిగ్గుతగ్గినది' అనుకొనెను.

'వారు హృదయాకర్షణమున సమర్థురాండ్రు. సర్వసౌఖ్యవతులు.'

'అదిమాత్రము సరికాదు. చమత్కార ప్రసంగములకును, సమయోక్తులకును, చలోక్తులకును, చాతుర్యములకును, సోదరీ! నీవన్నట్లు మేము సుప్రసిద్ధురాండ్రమే. హృదయాకర్షణ చేయుసామర్థ్యముకూడ మాయందుఁగలదుకానియదృష్టము'.

ఆపె నిట్టూర్పువిడిచెను. ఆమెమొగము విరక్తిని సూచించుచుండెను.

'అక్కా! అట్లనెదవేల?'

'నిజముగా మే మదృష్టవతులముకాము'

'ఎందుచేత? మీకంటె నదృష్టవతులు లేరని చెప్పుటయా?'

'హిందూయువతు లదృష్టవతులు'

'నేనట్లు తలఁపను. యవనసుందరులు స్వాభావికముగా సౌందర్యమును ప్రేమింతురు. ప్రపంచమునంగల సర్వసౌభాగ్యములకును, సర్వసుందరవస్తువులకును వారి సౌధములు నిలయములు. అత్యంత మధురమైన గానమును నిత్యము నాకర్ణింతురు. దేహములను జక్కఁగాఁ బూలచేతను లతలచేతను, చిత్రచిత్రముగాఁ జిత్రింపఁబడిన మొఖ్మల్ గుడ్డలచేతను పట్టుపావడలచేతను శోభస్కరముగా నలంకరించుకొందురు. వారికింకఁ దక్కువేమి?'

'వారి సౌభాగ్య మంతవఱకే'

జగన్మోహిని గ్రహించెను. ఊరకుండెను.

'మాకును, అదృష్టమునకును జాలదూరము. మేమీ సౌధపంజరములందు బంధింపఁబడిన విహంగములము. మా కాలమును సౌందర్యమును యౌవనమును, భూలోకసృష్టి వినోదములను మనోహరవస్తు ప్రపంచమును జూచుటతోడనే సరిపోవును. హిందూసుందరీమణులు తమ మనోహరుల హృదయములను హరింతురు. ఆభాగ్యము మాకు లేదు. పరస్పరానురాగము, ప్రేమ, యివి మే మనుభవింప నోఁచుకొనలేదు. అది

లేక సర్వవస్తు శోభితములగు నీసౌధపరంపరలతోడ నేమి ప్రయోజనము ?'

'అది, ఎందుచేత'

'పాదుషాలు బహుసుందరీప్రియులు'

జగన్మోహిని 'అది కష్టమే' అనెను.

నారీలోకమునకు మనోరథములు సమానములు. వారికిఁ బరుల కష్టములయం దనుతాపము స్వాభావికముగా జనించును. ఇతరులకష్టములను జులకనగా వారు గ్రహింతురు. అప్పుడామె మొగ మనుతాపసూచకముగా నుండెను.

'సుందరీరత్నమా! హిందూరాజులలోఁ జాలమంది యేకపత్నీ వ్రతముకలవారఁట'

'అవును. రాజపుత్రులలో, ఈ యాచారము విశేషించి కలదు.'

'అది చాలమంచిది'

'ఈ యాచారము మీలోను గలదనివింటిని'

'ఆఁ! కలదుకాని నవాబుల దర్బారులకది పనికిరాదు.'

ఆమె కొంచెము నేపూరకుండెను.

'సుందరీరత్నమా! స్వభావజన్యమగు చాపల్యమునకులోనై యొకవిషయము నడుగ నుపక్రమించు చున్నదానను. స్నేహధర్మములో నీవు వేఱుగా భావింపవుగదా?'

'అది యడుఁగఁదగినదియుఁ జెప్పఁదగినదియుఁగూడ నైనపక్షమున నభ్యంతరమేమి? మాకది యవమాన ప్రదము కాదేని యడుఁగవచ్చును'

'అది మనోహరమైనది. శ్రవణానందకరమైనది. ప్రేమ యీశ్వరదత్తమైన శాశ్వతవస్తువు. అది యత్యంత మధురము. మానవులకెచట యిష్టమో యది యచట పుట్టుచుండును. ఇష్టమే ప్రేమ. ప్రేమయే యిష్టము. అది యిచ్చిన వారికిఁ బుచ్చుకొన్నవారికి హర్షమునుజనింపఁజేయును. ఎవరి యందుగాని తమప్రేమను లగ్నముచేయక మానవు లుండఁజాలరు. అది వారిసహజగుణము. సకలజగన్మనోహరమైన యీ సుందరీ రత్నముయొక్క ప్రేమ యెచట లగ్నమైనది?'

ఆమె మొగము మందమారుత కంపిత స్వర్ణకమలము వలెఁ జలించెను. అవనతమై యుండెను. ప్రేమతరంగిణి యామె మొగమునుండి ప్రవహించుచుండెను. మనోహారిణియగులజ్జ యందు స్నానముచేయుచుండెను. ఆసుందరీమణి మఱి మాట లాడ లేకపోయెను.

'అనూనవిలాస శోభితమయిన నీమొగమే నీహృదయమును జెప్పక చెప్పుచున్నది. హిందూసుందరులు తమ మనోహరుల నామములను జెప్పరని వింటిని. పోనిమ్మది యెక్కడనేని సక్తమయినదా? లేదా?'

ఆ హేమసరోజము యథాపూర్వముగా నుండెను. అట్లు తన్నంతప్రీతిపూర్వకముగా నడిగిన యీయువన పట్ట

మహిషితో దాఁచిచెప్పుట కామె యిష్టపడలేదు. నవనీత కోమలమైన యామెహృదయము చలించుచుండెను. అది సరళమైనది. వక్రతగాని కపటముగాని యందు లేదు. ఆ స్వర్ణకమలమునుండి యస్పష్టమై, మంజులమై, త్రిపావృతమై, అనురాగద్యోతకమై, శ్రవణామృతమై, సుఖకరమై, సుకుమారమై, కుసుమసార సమాకర్షణ లోల మధుకరీ కలనిస్వనములను హసించుచున్న యొకమధురవాణి వెల్వడుచున్నది!

'అవును. అదిసక్తమైనది' అనెను.

ఆ యవనసుందరి ముఖమునుండి మందహాసతరంగిణి ప్రవహించుచుండెను. అది ప్రయత్నపూర్వకముగాదు. సహజము.

'అది యెవనియందు లగ్నమైనదో యతఁడు ధన్యుఁడు. ఆ యదృష్టవంతుఁ డెవరు?'

ఆమె యుత్తరమును నిరీక్షింపలేదు. ఆమెకు ప్రాచ్యసుందరీమణుల వర్తనము తెలియును. ముగ్ధాతరుణుల భావములు ప్రౌఢములుకావు. కోమలములు. ఆమె ప్రత్యుత్తరము చేయలేదు. అది నిరాకరణము కానేరదు.

'పోనిమ్ము. నారీరత్నమా! ఒకసారి నీదృష్టి నిటుసారించుము. ప్రకృతిసుకుమారములగు సంకకములతోడను అత్యుత్తమ లక్షణశోభితమగు మోముఁదమ్మితోడను సకల జగన్మనోహరముగానున్న యీమూర్తి యెవరిది?'

అని యామెచేతికొక చిత్రపలకము నందించెను. అం దొక దివ్యసుందర విగ్రహము చిత్రింపబడియుండెను. అది నిశ్చయముగాఁ జిత్రప్రతిమయనుటకు వలనుగాకయుండెను. అందు జీవలక్షణములన్నియు వ్యక్తము లగుచుండెను. అది నిజముగా ప్రతిమ కాదు.

ప్రాచీన హిందూనాగరకతను జాటుశాస్త్రములలో శిల్పకళాచాతుర్యమొకటి. అందీ చిత్రలేఖనము మిక్కిలి హృదయంగమైనది. ప్రకృతి సౌందర్యమును, మానవ విగ్రహములను, ఆయా భావములతోఁగూడ లేశమేనియుఁ దప్పకుండునట్లు సహజముగాఁ జిత్రింపఁగల సుప్రసిద్ధచిత్రకారులు నేఁటి వఱకును గలరు. వారు హిందూదేశ ప్రాచీనవైభవమును, నాగరకతను, శాస్త్రిసంపదను దమచిత్రముల మూలకముగా గానముచేయుచుందురు.

ఆ చిత్రపలకమును జగన్మోహిని వీక్షించెను. ఆమెకుఁ దృప్తితీరలేదు. నీలోత్పల దళముల నధఃకరించుచున్న యాపె కనుల నీరు గ్రమ్మెను. అది యప్రయత్నసిద్ధము, సహజము. ఆమె దానినాపుటకుఁ బ్రయత్నించెను. కాని సాధ్యమాయెనా? ముత్యములవలె నాబాష్పబిందువు లాసుందరి తొడలపైఁ బడుచుండెను. అది యా యవనసుందరి కనిపెట్టెను. ఆపె ఫక్కున నవ్వెను.

తరుణుల కది స్వాభావికము. భార్యాభర్తలకు నేకత్ర సమావేశముచేసి పరిహాసించుట సుందరీమణులకు సంతోషముగానుండును. అందీ యవనసుందరి హృదయము నిష్కాపట్యమైనది.

'అక్కా! ప్రత్యుత్తరమీయవేమి?'

'ప్రత్యుత్తర మేమున్నది? మీరెఱుఁగరా?'

ఆ చిత్రపటమెవరిది? అది నీకీదినఱకే గోచరించియుండును. అదిస్వభావము. అంతమాత్రము స్ఫురింపనివాని కేదియు స్ఫురింపదు. ఆ చిత్రఫలకమువంకఁ దిన్నగాఁజూడుము. అందు విజయసింహుని లోకోత్తర మూర్తికలదు.

'నీ హృదయమును హరించినసుందరుఁ డితఁడేనా?' ఆమె చిఱునగవుచే నంగీకారభావమును సూచించెను. మఱి యిట్లనెను.

'కాని అక్కా! ఈ కోరిక యీ జన్మమున లభించునదికాదు. అంతభాగ్యము నావంటి దురదృష్టురాలికి గల్గదు.'

'ఎందుచేత? ఇది పరస్పరానురాగముకాదా? అతఁడు కూడ నిన్ను ప్రేమింపలేదా? చూడుము! ఈసమానరూపవయోవిలాసములే మిమ్మిరువురను దంపతులనుగాఁ జేయఁదలఁచి దేవుఁడు సృష్టించెనని చెప్పక చెప్పుచున్నవి. అది తప్పేనని యీసృష్టి రుచించునా?—అతఁడు కూడ నిన్నుఁ బ్రేమించెనని వింటినే?'

'నాకీ కారాగారబంధ విమోచన మీజన్మమధ్యమున నుండఁగలదా ?'

యవనసుందరి యామెను హృదయపూర్వకముగాఁ బ్రేమించెను. అందు కామె సౌందర్యమును సుగుణగణములును వారుపడుచున్న కష్టములును గారణములుకావచ్చును. అదియునుగాక యామెస్వభావము కరుణారసపూరితము. ఆమె యిదివఱకే యీమెకష్టములను దప్పింపవలెనని సంకల్పించి యుండెను.

'సోదరీ! అవును. పాపము మావలన నీకుఁగష్టములు చాల సంప్రాప్తించినవి. అయినను సోదరీతిలకమా! నీకష్టములం దొలగించుట నాచేనైనంతవఱకుఁ బ్రయత్నించి చూచెదను'

'సాహెబా! వందనములు. నాయందిట్టి కరుణనువహించుట నాయదృష్టము. నాపుణ్యము పరిపక్వమైనది. మఱచిపోవలదు సుమీ!'

'అక్కా! ప్రొద్దుపోయినది. ఇఁక నిటనుండుట యుక్తముకాదు. పోదము. కాని చింతమాత్రము మనస్సునం దుంచుకొనకుము. నీకుఁ ద్వరలోనే విముక్తి యగును లే'

'అక్కా! పరిపూర్ణకృపనుంచుము. మీమాటలచే నాకు స్వస్థత కల్గుచున్నది. ఇఁకసెలవు తీసికొనెదను'

'మంచిది. మీ యిరువురుదంపతులను మఱియొకసారి చూచుభాగ్యము నాకుఁగల్గుంగాక !'

---

# పంచదశాధికద్విశత ప్రకరణము

రాధాకుమారుఁడు

కం॥ స్వాతంత్ర్యమె నిజమోక్షము
స్వాతంత్ర్యమె సర్వసౌఖ్య సారము జగతిన్
స్వాతంత్ర్య మభిలషించెడు
నాతఁడు దేవేంద్రపదవి నైనఁ ద్యజించున్.

సృష్టిలోని జంతువులకెల్ల స్వాతంత్ర్యేచ్ఛ స్వాభావికము. పరాధీనజీవితము సర్వభోగవంతమయ్యు సౌఖ్యకరము కాఁజాలదు. మానవులకు స్వాతంత్ర్యేచ్ఛ తదితరజంతువుల కంటె హెచ్చు. సకల సుఖాస్పదములయిన చంద్రశాలలలో హంసతూలికాతల్పములందుఁ గోరినవస్తు ప్రపంచమునెల్ల ననుభవించుచు భూలోకమందు స్వర్గసౌఖ్యముల నందుటకంటెఁ గల్గినంతవఱకు దిని త్రావి స్వేచ్ఛాపరతంత్రుఁడై మెలఁగుచుండుట యనేకరెట్లుత్తమము. పరాధీనజీవితమునే యెల్లపుడు గోరుచుండువారుత్తములుకారు. ఉత్తములెల్లపుడు స్వతంత్రత నభిలషింతురు. దానికొఱకే రాష్ట్రములు పోరాడుచున్నవి. రాజ్యములు నశించుచున్నవి. కోట్లకొలందిగా జనులు నశించుచున్నారు. కాని యుత్తములు తదభిలాషను విడువరు.

విడువనే విడువరు. ఎన్ని కష్టములు జనించినను విడువరు! పరాధీనవృత్తి బానిసవృత్తి. తన వ్యవహారములు చూచుకొనుటకుఁ దన కధికారములేదు. ఒకరిక్రింద తాను బానిసగా నుండవలయును! తానెందునకుఁ బనికిరాడు! అతనికి గౌరవము లేదు! ఎందుకా బ్రదుకు?

పాపము! చెఱసాలలోఁబడిన జగన్మోహినీ స్వర్ణకుమారుల తరువాతివృత్తాంత మేమయినదో కనుంగొనవలయును.

జగన్మోహినియొక్క ప్రీతి నేవిధముననయిన సంపాదింపవలయునని నవాబు దినదినము మధురములయిన కదళీఫలములను దాడిమఫలములను మఱియు నానావిధఫలములను బంపుచుండెను. బంగారుజరీతోఁ బనిచేసినపట్టుపుట్టము లాపెకుఁగొదువలేదు. సేవకులు కొల్లలు. సువర్ణమయరత్నఖచిత మనోహరానర్ఘభూషణములతో నాసౌధము నింపఁబడుచుండెను. చంద్రహారములు సూర్యహారములు మొదలగునవి వలయునన్ని! కాని యవియన్నియు నెవరికి వలయును? ఆపె వానివంకఁ గన్నెత్తి యయినఁ జూడలేదు.

మొదట నామెను విచారించుటకును, ఆమెకు సేవచేయుటకును దురకలను నియోగించెను. కాని యది యాపేక్షితముగానుండ దనుకొనెనుగాబోలు నవాబొక హిందువు నధికారిగా నియోగించి హిందూసేవకుల నేర్పఱచెను. కాముకులకుఁ దమకోరిన సుందరీమణుల నెట్లైని మెప్పించవలయు

ననుటకంటె మఱియేప్రపంచముఁ దెలియదు. అట్టివారు నిశ్చయముగాఁ దారుకోరిన మత్తకాశినులయొద్దఁ బిచ్చివారివలె-కాదు బానిసీలవలెఁ జరింతురు.

కాని యా యిరువురు సుందరీమణులును, కృష్ణపక్ష చంద్రికవలెఁ గృశించుచుండిరి. వారిముఖములకాంతి తగ్గుచుండెను. సంపూర్ణవికసిత హేమకమలములవలె నున్న మొగములిపుడు వాడిపోయినవి. నిశ్చయముగా వారు ప్రాణధారణ కొఱకు మాత్ర మప్పుడప్పు డేదో కొంచెము భక్షించుచుండిరి. సురుచిర పదార్థములు వారికి రుచించుటలేదు. విచార దేవత వారికెల్లపుడు ప్రత్యక్షమగుచుండెను. తల్లిదండ్రుల కష్టస్థితులను దలపోసి తనవలన నట్టికష్టములు వారికిఁ గల్గెఁగదా యని జగన్మోహిని శోకించుచుండెను. తనవలనఁ దనసహవాసినికిం గూడఁగష్టములొదవెనని యాపె మఱింత పొగలుచుండెను.

స్వర్ణకుమారికిఁ దల్లిదండ్రులులేరు. చిన్నప్పుడే గతించిరి. అప్పటి నుండియు దయార్ద్రభావముతో జగన్మోహినితల్లి యామెను జేరదీసి కన్నకుమార్తెనుగా భావించి యే లోటుపాటును లేకుండఁ బెంచుచుండెను. ఆమె సద్గుణవతి, సౌందర్యవతి, పరోపకారశీల. తనస్థితిగతులను జక్కఁగాఁ దెలిసికొనెను. కర్తవ్యమెఱుఁగును. తన్నుం బెంచిన జగన్మోహిని తలిదండ్రులనే తన తలిదండ్రులనుగా భావించి పూజించుచుండెను. జగన్మోహినికిని స్వర్ణకుమారికిని గలప్రేమ, స్నేహము నిరుపమానము.

జగన్మోహినితోఁగూడ స్వర్ణకుమారికిని బెండ్లిచేయవలయునని సోమశేఖరమూర్తి తలంచెను. కాని యామె యిష్టపడినదికాదు.

ఒకనాఁటిసాయంకాలమున నొకయౌవనుఁడు జగన్మోహినీ స్వర్ణకుమారులున్న సౌధమువంక జూచుచు, ఆ వయిపునకే నడచుచుండెను. అతనియాకృతి మనోహరమై చూపరకెంత చూచినను,ఇంకనుజూడవలయునన్న కోర్కె గల్గించుచుండెను. అతఁడంగసౌష్ఠవముకలవాఁడు. వయసు రమారమి యిరువది మూఁడేండ్లుండును. అతఁడే స్వర్ణకుమారీ జగన్మోహినుల స్థితిగతులను గన్గొనుటకును రక్షణచేయుటకును నవాబుచే నియోగింపఁబడిన హిందూయౌవనుఁడు. అతనియందు నవాబునకు మిక్కిలి నమ్మకము, ప్రేమయుఁ గలవు.

అప్పు డాభవనమున నెవరును లేరు. సేవకురాండ్రు తమతమ పనులు చూచుకొనుచుండిరి. కొందఱు వంటఁజేయుచుండిరి. తదితరులు తద్దితరవ్యాపారములను జేయుచుండిరి. సాయంసమయమగుచుండెను. జగన్మోహినీ స్వర్ణకుమారు లిరువురును దమ దుర్గతికిఁ జింతిలుచు గూర్చుండియుండిరి. వారి కితనిరాక తెలిసియుండవచ్చును. అతఁడు వారి సమీపమునకేగెను.

అతనింజూడఁగనే జగన్మోహినికి సోదరప్రేమ జనించెను. ఆమెకు పరపురుషుని జూచినపుఁడు కల్గు స్వాభావికమయిన లజ్జ కలుగలేదు. కాని తలవంచుకొని మెల్లఁగా 'సోదరా! కూర్చుండుఁడు' అనెను.

'సోదరీ! అక్కఱ లేదు. మీ మర్యాదమాత్రమే చాలును' అని ప్రత్యుత్తర మిచ్చెను.

'కారణ మేమో నాకుఁదెలియదు కాని యితనియందు నాకు సోదరప్రేమ గల్గుచున్నది. దైవము నాకిట్టిసోదరు నిచ్చి యుండకపోవుటచేఁ గాఁబోలు' అని మోహిని తలఁచెను.

కాని స్వర్ణకుమారి యాసుందరమూర్తిం గాంచినది మొదలొక నూత్న వికారమునకు లోనయ్యెను. ఆమె దృష్టి యెంత వారించినను వారక, ఆయావనునిముఖారవింద సౌందర్యమును గ్రోలుచుండెను. ఎంతయత్నించినను ఆమెహృదయ మా నూత్న వికారమునుండి మరలలేదు. ఆసుందరీ రత్నముయొక్క వాల్చూపు లప్పుడప్పుడు నప్రయత్నముగాఁ బోయి యాయావనుని స్ఫురద్రూపము నాలోకించుచునే యుండెను.

'ఛీ! చపలహృదయమా! ఎన్నఁడునెఱుఁగని యిట్టి నూతన వికారమునకు లోనగుదువేల?' అనుకొనెను. కాని యది యంతటితో మారునా?

ఆ యావనుని యవస్థయు నట్లేయుండెను. హృదయ మతని వశముకాకుండెను. ఆ సుందరియొక్క తరళనయనముల సౌభాగ్యమును, గొంచెమువాడినను సంపూర్ణశరత్సుధాకరుని సంపూర్ణముగాఁ బరాభవముచేయఁ జాలిన యామెముఖమును దక్క మఱియొక్క టతనికి గోచరించుటలేదు.

ఇట్లా యిరువురు పరస్పరానురాగపాశములచే బంధింపఁ బడిరి. అందుకుఁగారణమేమైయుండును? అది సృష్టివిచిత్రమా?

జగన్మోహిని తనలో నిట్లు తలంచెను.

'ఈతనిం జూచినప్పటినుండియు నితఁడు స్వర్ణకుమారికి భర్తయైన బాగుండునని తోఁచుచున్నది. వీరిరువురివంకఁ జూచినచో వీరికిఁ బరస్పరప్రేమ జనించిన ట్లగపడుచున్నది. ఎవరిపేరు చెప్పినను వినని స్వర్ణకుమారి యితని నిట్లేల ప్రేమించునో?'

జగన్మో :-మిమ్ములను నే నెఱుఁగకున్నను 'సోదరా' అని పిలుచుటకు సాహసించితిని. ఇందుకు మీరు క్షమింపవలెను.

రాధా :-నేను సోదరుఁడను. నీవు సోదరివి. ఎన్నటికిని, ఈ భావమునే నాయందుంపఁ బ్రార్థించుచుంటిని.

జగన్మో :-మీ నామాక్షరముల నెఱింగించి మాశ్రవణ పుటములను బవిత్రముచేయుదురుగాత.

ఈ మాటలు విన్నతోడనే స్వర్ణకుమారి హృదయము చల్లఁబడెను. చల్లనితొల్కరివానచే శుష్కించిన తృణములు వోలె నామె వికసించెను. చిత్తవిశ్రాంతి గల్గెను. అతఁడు మెల్లగా 'రాధాకుమారుఁడు' అనిచెప్పెను.

జగన్మో:-రాధాకుమారులు మీరేనా? మీ రేదేశమో వెళ్ళినారని చెప్పుకొన్నారు.

రాధా:-అవును. నేనే. ఇచటికే వచ్చితిని.

జగన్మో:-తురుష్కులకు బానిసలై యుండుటకేనా సుప్రసిద్ధాంధ్ర సామ్రాజ్యమగు విజయనగర సామ్రాజ్యమును విడిచి గోల్కొండకు వచ్చినది?

అతఁడు నిలువున నీరై పోయెను.

రాధా:-చిన్నతనమునం జేసి తప్పొప్పులు తెలియక యుద్ధాభిలాషచే నిట్లు ప్రవేశించితిని. కాని తరువాతఁ బశ్చాత్తాపపడుచునే యుంటిని. ఇంటి గుట్టు లంకకుఁజేటన్నట్లు మనవారు తురుష్కులపక్షమునఁ జేరి యిట్లు కుట్రలు పన్నుచుంటచేతనే మన హిందూసామ్రాజ్యము లన్నియు నశించుచున్నవి. కాని సోదరీ! ఇందు నేనొక విశేషమును జెప్ప సాహసించుచున్నాను. మన్నింపుము. నా యీ తురుష్కసేవ యొకవిధముగా మంచిగనే పరిణమించినది. నేనిచట లేకున్న మీ యీ దుఃఖకాలమున నేను మీతోఁగూడ సమముగా దుఃఖమును బంచుకొని యనుభవించుభాగ్యము నాకుఁగల్గునా? మీదుఃఖమును నాదుఃఖముగాఁ దలఁచి దానిని దప్పించుటకు దగినశక్తిని నా కొసంగుటకు దైవమును బ్రార్థింతును.

జగన్మో:-సోదరా! మీపశ్చాత్తాపముతోడి హృదయము నేనెఱుంగనిది కాదు. అయినను జూడవలయునని యిట్లంటిని. క్షమింపుడు. మాకష్టములకొఱకు మీరుకూడఁ గష్టములం

బడుట యుక్తముకాదు. మీ రన్యతంత్రులు. మమ్మెట్లు రక్షింపఁగలరు ?

రాధా:-భారతీయార్యరక్తమే నాయందుఁ బ్రవహించునేని నే నాంధ్రులయుత్తమ సుగుణములు కలవాఁడనేని నాప్రాణములు పోయినను మీప్రాణములను గాపాడ వెనుకదీయకుందును గాక !

స్వర్ణకుమారి హృదయము నా వీరాలాపములు కరంచెను. ఆమె వీరవనిత.

జగన్మో:-మా యందు మీకంత యనుగ్రహముండుట మా యదృష్టముకాక మఱేమి ?

రాధా:-సోదరీ ! ప్రొద్దుపోవుచున్నది. సెలవు తీసికొనెదను.

జగన్మో:-మంచిది. నన్నును స్వర్ణకుమారిని మాత్రము మఱువకుందురుగాక! సెలవు.

రాధా:-స్వర్ణకుమారీ ! పోయివచ్చెదను.

ఆమె హృదయ మౌత్సుక్యమండితమాయెను. నోట మాటరాలేదు. మెల్లఁగా ' చిత్తము ' అనెను. ఆ సుందరీసుందరులు పరస్పరావలోకనము గావించిరి. వారెడబాసినను వారి హృదయములు బంధింపఁబడినట్లే యుండెను. అతఁడు వెళ్ళలేక వెళ్ళెను.

---

# ఇరువదియవ ప్రకరణము

## నిరాశ

జగన్మోహినీ స్వర్ణకుమారులు గోల్కొండకువచ్చి రమారమి మాసము కావచ్చెను. వారిస్థితి యంతకంతకు దుఃఖకరముగానుండెను. వారి కేవిధముననుఁ దప్పించుకొను నుపాయము తోఁపలేదు. మనసులకు విశ్రాంతిలేదు. దయామయురాలైన గోల్కొండనవాబు పట్టమహిషియు, స్వర్ణకుమారీ మనోహరుఁడైన రాధాకుమారుఁడును బెక్కువిధములఁ గార్యసాధనము చేయఁ దలపోసిరిగాని యొక్కటియు వారికే బాగుగానుండలేదు. రేపటితో నవాబిచ్చినగడువు నెలయు నగును. అతఁడు దుష్టుఁడు. తల్లిదండ్రులకేమేని హానికల్గించి తీరును.

ఇంకను జాముప్రొద్దుపోలేదు. ప్రపంచమెల్లఁ గారుచీకట్లు వ్యాపించియుండెను. కొందఱింకను స్నానములుచేయుచుండిరి. కొందఱు పదప్రక్షాళనముం గావించుకొని భోజనములకు గూర్చుండిరి. మఱి కొందఱు భోజనముచేసి హాయిగాఁ జల్లగాలిలోఁ దిరుగుచుండిరి.

అట్టియెడఁ గోల్కొండనగరమున నొక గొప్పసంక్షోభము కలిగెను. 'ఆత్మహత్య! ఆత్మహత్య' యని బజారులలోఁ జెప్పు

కొనుచుండిరి. కొందఱు యౌవనులు ' చూతము రండు ' అని తోడివయసుకాండ్రను జెల్మికాండ్రను బిలిచికొని పరువు లిడుచుండిరి. ' ఆహా! నవాబు మిక్కిలి పాపాత్ముఁడు. అతని వలననే యింతకల్గెను ' అని కొందఱు దూషించుచుండిరి. కొందఱు గృహిణులు ' పాపము! తల్లిదండ్రుల కడుపులోఁ జిచ్చు వెట్టి పోయినది. నేను జూడలేదుగాని అంతసుందరిమఱి లేదట! ఎవరి కర్మ నెవరు తప్పింపఁగలరు?' అని విచారించుచుండిరి. ఏమూలఁజూచినను సంక్షోభమే. ఎచటఁజూచినను గల్లంతే. ఎచ్చటఁజూచినను, ఆసందడే. కొందఱు తలపోయువారు. కొందఱుచింతించువారు.కొందఱుదూషించువారు.కొందఱు పాపమనువారు. పట్టణము మూలమూలలను ' ఆత్మహత్య-ఆత్మహత్య ' అనువార్త వ్యాపించెను.

గోల్కొండకుఁ గొలఁదిదూరమున నొక గొప్ప చెరువు కలదు. అది పర్వతమునకును గుట్టలకును మధ్యగానుండెను. రాజభటులెల్లరు నావయిపునకుంబోవుచుండిరి. గొప్పగొప్ప యుద్యోగస్థులు, న్యాయమూర్తులు, పాలకులు గుఱ్ఱములనధిష్ఠించి యా వయిపునకుఁబోవుచుండిరి.

ఆ చెరువుగట్టున జనసమూహము మూగెను. అది చుట్టు వయిపులకును వ్యాపించెను. అటునుండి యిటు, ఇటునుండి యటు, కదలుచుండెను. అది ప్రవహించుచున్న జనసముద్రము వలెనుండెను. రాజాజ్ఞపై వందలు వేలు పదివేలు కాగడాలు

వచ్చి యచట యంధకారమును విచ్ఛిన్నముచేయుచుండెను. ఆ చెఱువు మిక్కిలి విస్తీర్ణమైనది.

అచ్చటఁజేరిన యామూకల మనములెల్ల నాతురపడుచుండెను. కాని బ్రదికికాని చచ్చికాని నీటిలో నెవ్వరును కానరాలేదు. కొందఱు తెప్పలుకట్టి యాచెఱువు మధ్యకుఁ బోవుచుండిరి. వేఱొకకొందఱు ప్రక్కప్రక్కల లోఁదట్టునఁ జూచుచుండిరి. జాడయేమియుఁ గన్పడలేదు.

కొందఱు రాజానుగ్రహాపేక్షులు 'మేము చూచితిమి. ఆ వయిపుగా వచ్చె' ననుచుండిరి. మఱికొంద 'ఱీ వయిపుగా' ననుచుండిరి. ఇంకఁగొందఱు మఱియొక వయిపును జూపుచుండిరి. ఆ యా స్థలములకెల్ల భటులాత్రముతోఁ బరువిడుచుండిరి. కొందఱు తాలుగట్టుకొని పడియుందురని భావించి దోనెలనెక్కి లోపల వాసములతోఁ గెలఁకుచుండిరి. ఏపని వచ్చినను దమపనిగనే భావించు నిష్కపటులగు పిల్లలు వారి వెంటఁ బరువిడుచుండిరి.

ఆ చెఱువున నొకప్రక్క నవాబుత్త మాశ్వమొకఁ డెక్కి యత్యంత విచారసూచకమగు మొగముతో నాతురతతోఁ జూచుచు నెవరేమిచెప్పుదురో యని వేదనపడుచుండెను.

ఒకఁడు వచ్చి 'అయ్యా! నేఁజూచితిని. ఇరువురు సుందరీమణు లీవయిపుగా వచ్చిరి' అనెను.

నవాబు, ఆతురతతో 'నిజముగాఁ జూచితివా?' అనెను.

'అయ్యా! చూచితిని'

'ఏ వయిపుగా వచ్చినారు?'

'ఈ ప్రక్క బజారునుండి వచ్చినారు.'

'ఎందఱు?'

'ఇరువురు.'

'హిందువుల వలె నున్నారా? మహమ్మదీయుల వలె నున్నారా?'

'మహమ్మదీయ స్త్రీలవలెనే యున్నారు. ఆపాదమస్తకము వస్త్రములు కలవు. వారి కందె లున్నట్లున్నవి. అవి మోగుచు నుండెను.'

'వా రేవయిపునుండి వచ్చుచున్నారో కనిపెట్టి చూచితివా?'

'ఆఁ! చూచితిని. వారంతఃపురము వైపుల నుండియే వచ్చినారు.'

'ఏల చూచెదరు? చాలమంది ట్లే చెప్పుచున్నారు. వారు నిశ్చయముగాఁ దమ్మెవరేని పట్టుకొందురని మహమ్మదీయాంగనల వేషములంధరించి వచ్చినారు. అనేకమంది వారిని, ఆ వేషములతో నుండఁగా జూచిరి. వారింకను బడలేదేమో యీ ప్రాంతములను వెదకుఁడు. ఆ చెరువు ప్రక్కలఁజూడుఁడు. గట్ల

నైఁజూడుఁడు. చెఱువులోఁజూడుడు' అనుచు నవాబు ఆ యా ప్రక్కలకు భటులను బంపుచుండెను.

క్రమ క్రమముగా నతనిమనసునకుఁ బిచ్చియెక్కుడగు చుండెను. ప్రాణములతో నాసుందరింబట్టి తెచ్చినవారి కొక లక్షరూప్యముల నొసంగెదననెను. కొందఱాశపడి దొడ్లు, దోవలు, పుట్టలు, గుట్టలు, గట్టులు శ్రమపడి వెదకుచుండిరి. రెండు యామములు గడచెను. మూఁడు గడచెను. ప్రపంచ స్మృతి యతనికిలేదు. ఆమె ప్రాణములతో దొరకునను ఆశ యతనికిం బోయెను. ఇఁక నచటనుండి కార్యములేదని 'హా! జగన్మోహినీ! హా! జగన్మోహినీ! ప్రపంచమెల్ల నంధకారము చేసి పోయితివా?' అనుచు స్వభవనము వయిపునకుఁ బోవు చుండెను.

---

# ఇరువదియొకటవ ప్రకరణము

## వెన్నెల

ప్రపంచము మిక్కిలి చిత్రమైనది. అన్ని యాత్రలను సులభముగాఁ జేయవచ్చును. కాని యీప్రపంచయాత్రమాత్ర మత్యంతకష్టమైనది. దానికి సమయస్ఫూర్తి, శక్తిచాతుర్యము, యుక్తిమొదలగు సద్భుతగుణములుండి యుండవలెను.

మనుజులగుణములు, స్వభావములు, నడతలు రీతులు పెక్కువిధములు. కొందఱు చమత్కార ప్రియులు. మఱికొందఱు సమర్థులు. కొందఱు సమయోక్తులు చమత్కారముగా నాడుదురు. మఱికొందఱు తెల్లమొగాలు. అతిభయంకరమై దుస్తరమైన కష్టసముద్రమును బుద్ధినౌకనెక్కి చమత్కారముగాఁదప్పించుకొనుటకు కొందఱు మిక్కిలిచతురులు. కొందఱు లేనికష్టములను, బాధలను, దెచ్చి నెత్తిపైఁ బెట్టికొని వానిని దప్పించుకొను మార్గమునుగాంచలేక యామరణము వెతలం బెందుచుందురు. కొందఱుబుద్ధి చతుస్సాగర పరీవృతమైన సకల భూతల పరిపాలనమును వహించి, తద్రాజ్యాంగ చక్రమును, ఎత్తులకు మాఱెత్తులొడ్డుచు నిరాఘాటముగాఁ ద్రిప్పనేర్చును. మఱికొందఱు స్వవ్యవహారములనే చేసికొనఁజాలరు. అట్టి

వారెట్టి కష్టముండప్పించుకొనఁజాలరు. కాని సప్తసముద్రము లను దెప్పలేకుండ నీదఁ గలవారుకూడ గలరు.

అట్లు గోల్కొండ పట్టణస్థులెల్లరును జహన్మోహినీ స్వర్ణకుమారులకొఱకు వెదకుచుండిరి. ప్రభువులు, సేవకులు, పిల్లలు, తల్లులు, తండ్రులు, ఎల్లరును, ఆ ప్రసంగమునే చెప్పి కొనుచు నుండిరి. కాని యది యింకను బట్టణమునకు గొంత దూరముగానున్న కారాగారములకు వ్యాపింపలేదు.

ఆ కారాగారములలో నొక ప్రత్యేక భవనమున నిరువురు దంపతులుండిరి. వారితర నేరస్థులవలెఁగాక గౌరవముతోఁ జూడఁబడుచుండిరి. వారిని గావలికాయుటకుఁ బ్రత్యేకముగా నొక తురుష్కస్నతోద్యోగియుఁ గొంతమంది భటులును నియమింపఁబడిరి. వారెల్లరును జాగ్రత్తతో గావలి కాయుచుండిరి. రమారమి జాముప్రొద్దుపోయెను.

అప్పుడా భవనము వైపున కొక యౌవన విగ్రహము వచ్చుచుండెను. అతని కాయము బలిష్ఠమైనది. అతఁడత్యంత ధైర్యశౌర్య నిలయుఁడును, పౌరుషవంతుఁడును, అయి యుండు నట్లు తోఁచుచుండెను. అతఁడొక గుఱ్ఱము నెక్కెను. అతని వెంట మఱియిద్దఱాంధ్ర సేవకులుండిరి. వారిరువురు చెఱి యొక గుఱ్ఱమును దోలుకొనివచ్చుచుండిరి. అతఁడు తిన్నగా నా యిరువురు సేవకులతోను, గుఱ్ఱములతోను, ఆ దంపతు లున్న భవనపుఁ బ్రాకార ద్వారముకడకుఁబోయి, అందుఁ జొచ్చుచుండెను.

ద్వారపాలకులు వారి నడ్డగించి 'ఎవరు? మీరులోనికిఁ బోఁగూడదు. తిరిగిపొండు' అని గద్దించిరి.

'నేను బోయెదను. ఎవరడ్డము వత్తురు?'

'మీకుఁ బోవ నధికారములేదు'

'మాకుఁ గలదు'

'అట్టి దే దేని యున్నంజూపుఁడు'

అతఁడొక ముద్రికను దీసి చూపించెను. ఆ ద్వారపాలకుల గుండియ లవిసెను. వా రతనిముందు సాష్టాంగముగాఁబడి 'అయ్యా! మాతప్పును మన్నించుఁడు. మేము మిమ్మెఱుఁగక యపరాధముం జేసితిమి' అని వేడుకొనిరి.

'క్షమించితిమి. లెండు'

'అయ్యా! బ్రదికితిమి.'

అది నవాబు ముద్రిక. అది రాజులకును, గొప్ప ప్రభువులకును, నవాబు బంధువులకునుగూడ దుర్లభము. అతని కట్టి ముద్రిక చిక్కుటంజేసి, అతఁడెవరో యని భయపడిరి.

అతఁడా ప్రాకారముదాటి లోనికింబోయెను. ఆ ప్రాకారము లోపలనే వారింగనిపెట్టి యుండుట కేర్పడిన గొప్పయధికారి యుండెను. అతఁడు తిన్నగా, ఆ యధికారియున్న భవనము ప్రక్కకుఁబోయి యొక సేవకుని లోనికంపెను. అతఁడితని రాక నెఱింగించెను.

ఆ యధికారి బయటికెదురుగా వచ్చెను. అతఁడీయశ్వాధిష్ఠితుఁడగు పురుషునిజూడఁగనే, ఇతఁడొక యున్నత వంశీకుఁడై యుండునని తలఁచెను.

'అయ్యా! ఏలవచ్చితిరి ?'

'చిత్తము. జగన్మోహిని తల్లిదండ్రులను దీసికొనిపోవుటకు'

'మాకింక నవాబుగారి యనుజ్ఞ కాలేదు'

'ఇదిగో! చూడుడు'

అని యాముద్రికనే చూపించెను. అతఁడు విశ్వసించెను. ఆలస్యముచేసిన నేమియగునోయని భయంపడెను. నిరంకుశ ప్రభువుల హృదయములను జక్కగా నతఁడెఱుఁగును.

'అయ్యా! వచ్చుచున్నాను' అని యింటిలోనికిం బోయి యొక టోపీనిదగిలించుకొని సేవకునొకనింబిల్చి 'తాళపుంజెవులను దీసికొనిరా !' అని చెప్పెను. తోడనే సేవకుఁడు వానినిగొని పరువెత్తుకొని వచ్చెను. ఆ యధికారి యాయశ్వాధిష్ఠితునిబ్రక్క నడచు చుండెను. అతని ప్రక్క గుఱ్ఱములు నడచుచుండెను. తాళపుఁజెవులందీసికొని వచ్చిన సేవకుఁడు వారింగలిసికొనెను. వారందఱు నాభవనములయొద్దకేగిరి.

ఆ యధికారి 'తాళముతీయరా' అనెను. తీసెను. లోనంబ్రవేశించిరి. అందు సోమశేఖర మూర్తియు భార్యయు నుండిరి.

'అయ్యా! మిమ్ములను విడుదలచేయుచున్నాను' అని న్యాయధికారి యనెను.

'కృతజ్ఞులము' అని యిరువురు ననిరి.

'త్వరగాఁబోవలయును. గుఱ్ఱములపై నధిష్ఠింపుఁడు' అని యాతఁడనెను.

ఆ యిరువురును త్వరితముగా గుఱ్ఱములనెక్కిరి. మెల్లగా స్వారీచేయుచుండిరి. కొంతవఱకు న్యాయధికారి వెంబడించెను.

'అయ్యా! సెలవు. మమ్ములను మఱువకుఁడు'

'మమ్ముంగూడ మఱువకుఁడు'

'ఇఁక దిగువడెదను'

'ఆఁ! మంచిది. పోవుచున్నాము.'

ఆ యధికారి కొంచెముసేపునిల్చుండి "రాజులు చపలచిత్తులు. వారిపని 'లేడికి లేచినదే ప్రయాణ' మన్నట్లుండును. ఎప్పుడేదితోచిన నప్పుడదిజరిగి తీరవలయును." అనుకొనుచుఁ దనభవనమునకుం బోయెను.

వారుముస్వురును సేవకులుఁ వెంబడింపగాఁ గొంతవఱకుఁ దిన్నగాఁబోయి యచ్చటినుండి మఱియొకదారికిం దిరిగిరి. అది పట్టణముయొక్క తుద. ఆప్రదేశమున విస్తారము గొప్పభవంతులు లేవు. చిన్నగుడిసెలు మాత్రముకలవు. క్రమక్రమముగా వారు నిర్జనప్రదేశముం జేరిరి. అది భయంకరముగా నుండెను. సోమశేఖరమూర్తి యిట్లనెను.

'గమ్యస్థాన మింకెంతదూరమున్నది?'

'ఒక మయిలుకంటె నెక్కుడుదూరముండదు'

అని వారిగుఱ్ఱములవడి యెక్కుడుచేసిరి. అవి వాయు వేగమునం బరువిడుచుండెను.

వా రట్లుపోయి యొకభీకరారణ్యముననున్న యొక రహస్య ప్రదేశముం జేరిరి.

అచ్చటఁ గొన్ని గుఱ్ఱములును, గొందఱు సేవకులు, భటులు, మఱికొందఱు స్త్రీలు నుండిరి. అం దిరువురు సుందరీ మణుల, నీ చీఁకటిలో మనము వారి దుస్తులంబట్టి, జగన్మోహినీ స్వర్ణకుమారు లనుకొనవచ్చును.

అచ్చటనున్న భటులు మహారాష్ట్రులు. వారు మిక్కిలి దేశాభి మానముగలవారు. వారే యీ రహస్య స్థలమునకు గుఱ్ఱములను మన ప్రయాణికులకు నందఱకును దెచ్చినవారు. ఆ ప్రదేశముననున్న వారికెల్లరకు నానావిధములగు నాయుధ ములు గలవు. మన యాత్రికు లచ్చటికేగిన వెంటనే వారం దఱు నొక్కపరి సంతోషతరంగములలో మున్గిరి.

బేగము సాహెబు 'అమ్మా! ఇఁక త్వరపడుఁడు. లేని యెడల గష్టములు సంప్రాప్తించును' అనియెను.

'అమ్మా! మీదయను మేమెప్పుడును మఱువఁజాలము. వందనములు. సెలవు దయచేయుఁడు' అని వారెల్లరు నేక గ్రీవ ము గాననిరి.

ఆ వేగము గుఱ్ఱముల నదిష్ఠించిన యా సుందరమూర్తుల దగ్గఱకువచ్చి గుఱ్ఱములను సమీపింపఁజేసి వారిరువురను కౌఁగిలించుకొని చెఱియొక ముద్దిడెను. వారుల్లాస సముద్రములను మునిగిరి. 'మీకు శుభమగుంగాక' అనెను.

'అక్కా! సెలవు దయచేయింపుఁడు' అనిరి.

'మంచిది' అనెను.

క్రమక్రమముగా నొకరితరువాత నొకరందఱు నావేగము నెడఁగృతజ్ఞతను దెలియఁజేసిరి. పరస్పరప్రేమానుబంధమును వీడలేక వీడిరి. త్రెంపలేక త్రెంపిరి. అంధకార బంధురమై ఘోరమృగసమూహసంచార భయంకరమై నానావిధ మృగఘోరనిస్వనమై విపులమై, దీర్ఘమై, జనసూన్యమై, పిశాచ భూత ప్రేత, : రాక్షసాది నివాసస్థలమనందగిన యా ఘోరారణ్యమున నారాత్రివేళ, జిక్కువక్కుగానున్న యొకత్రోవంబట్టి వారెల్లఁదమగుఱ్ఱముల కళ్లెములను సంపూర్ణముగా వదిలి వాయువేగమును మించినవేగముతో స్వారిచేయుచుండిరి.

——

# ఇరువదిరెండవ ప్రకరణము

## ఆచప్పుడేమి?

మానవులదృష్టి పరిమితమైనది. అది యెంతవఱకుఁ బోవునో యంత మేరలోనుండు నంశములను మాత్రమే గ్రహింపఁగలదు. భౌతిక ప్రపంచమున చూడఁజాలని మన దృష్టి యన్యుల హృదయములందున్న యంశములను గ్రహింపఁజాలునా? మనచుట్టును, బంధువులు, స్నేహితులు, విరోధులు, ఉపేక్షా భావముగలవారు పెక్కురున్నారు. కాని వారియంతరాత్మయందు వారు మనలం బ్రేమించుచున్నారో ద్వేషించుచున్నారో మనము గ్రహింపనేర్తుమా? ఎవ్వరెచ్చట నెందుకొఱకే వేళ నేమేమి చేయుచున్నారో పరిమితమగు దృష్టిచే మనము వానినెల్ల గ్రహింపఁగలమా?

కొంతసేపట్లు, ఆదిల్షాహాయు, తారానాథుఁడును, చక్రధరుఁడును ముచ్చటించుకొనవలసిన రహస్యాంశములను శంకారహితముగా ముచ్చటించుకొని వెళ్ళిరిగదా? పిదప గొంత కాలము గడచెను. రెండు యామములమీఁదఁ గొంచెము ప్రొద్దుపోయెను. ప్రపంచమెల్లఁ దేహ ధన మాన ప్రాణాదు

లన్నింటిని దైవము వశముచేసి హాయిగా గాఢనిద్ర నందు చుండెను. లోకమెల్ల నిశ్శబ్దముగా నుండెను.

అట్టితరుణమున రహస్య భవనము నానుకొనియున్న యా చెట్టుమీఁదనుండి యొకమానవ విగ్రహము క్రిందికి దిగుచుండెను. అతనివెంటనే మఱియొకఁడు దిగుచుండెను. మొదటివాఁడు రెండవవానికంటెఁ గొంచెము పొడవు. కాని మొత్తము మీఁద నిరువురును బొడవైనవారే. మిక్కిలి బలాఢ్యులు. వారి దేహమున కప్పుడు వారుతొడిగిన దుస్తులు తమాషాగానుండెను. వారిరువురును నల్లనిపొడవైనలాగులను ధరించియుండిరి. వారిరువురు దేహమునకుసరిగా నంటుకొనియున్న నల్లని పొట్టిచేతుల చొక్కాలను ధరించిరి. వారిమొలలలో మిక్కిలి పదునైన పెద్దబాకులుండెను. దెబ్బలనాపుకొనుటకుం దగిన యితరాయుధములును వారియొద్ద గలవు. వారు పాదములకుఁ జర్మముతోఁ జేయఁబడిన క్రొత్తరకపు ముచ్చెలను ధరించియుండిరి. అవి మెత్తగానుండి రవంతకూడ ధ్వనికానిచ్చుటలేదు. ఆచెట్టు, ఆకసము నొరయుచుండెను. అదియొక యడవిజాతిచెట్టు. అది గుబురుగానుండి క్రిందినుండి చూచు వారికి అవరోధము కల్గించుచుండెను. ఆ గుబురులో మన యీ పురుషులిరువురును దాగుకొనిరి. వారుక్రిందికి దిగి యిట్లు మాటలాడుకొనిరి.

'నాకు మధ్యమధ్య కొన్ని ముక్కలు మాత్రము వినంబడలేదు. కాని కావలసిన యంశము సర్వముం దెలిసినది'

'నే నొక్క ముక్కకూడ దిగపడకుండ వింటిని'

'ఈ పాపిష్ఠిత్రయములో నెవఁడైన గమ్యస్థానమునకు వచ్చిన బాగుండును. ముక్కలుముక్కలుగాఁదరిగి భీముఁడు దుస్ససేనుని వధించినట్లు వధించి ప్రేవులు జందెములు వేసికొందును'

'ఈ దుర్మార్గులలో నెవరును, అచ్చటికిరారు. ఆదిల్షాహ రేపుండఁడు గదా? తారానాధ చక్రధరులు పిరికివారు. వారు రారు'

'అవును! నిజమేకాని క్రోధోద్రేక మిట్లనిపించుచున్నది'

'క్రోధము దూరదృష్టిని నశింపఁజేయును. దానికేమి గాని మన మిఁకఁబోవచ్చునని తోఁచుచున్నది. ప్రపంచమెల్ల నిశ్శబ్దముగానున్నది. ద్వారపాలకులు, రక్షకులు, నెల్లరు నిద్రింతురు'

అని వారిరువురును నడువ నారంభించిరి. మొదటి యతఁడు ముందును రెండవ యతఁడు తరువాతను బోవుచుండిరి.

ఆ మందిరమునకుఁ జుట్టును,విశాలమగు నావరణకలదు. దానిలో నొక ప్రక్కకొండల గుట్టయొకటి కలదు. ఆప్రాంతము

నకుఁ బోవుటకెవరికిని సాధ్యముకాదు. అందుచే నాదిల్ శాహా భటులా ప్రాంతమున విశేషించి కావలి కాయరు. అయినను దఱచుగావచ్చి చూచుచుందురు.

ఆ యిరువురు పురుషులును, అట్లు పోయిపోయి, యా కొండ గుట్టలలో నొక తావునకుం జేరిరి. అచటికింబోవుటకు న్నాఱుచిక్కులు. మధ్యజెముడు పొదలు, రక్కసపొదలు గలవు. అందుఁ గ్రూర సర్పములు, తేళ్ళు, మండ్రగబ్బలు, పెంజెఱులు కూడ నుండును. అడ్డమువచ్చిన దుష్ట మృగముల నెల్ల తప్పించుకొనుచు వారొక రహస్యస్థానమునకుం బోయిన తరువాత, ఆగుట్టలలోనున్న యొకపెద్ద ఱాతినిపైకి లాగిరి. అది యీవలకువచ్చెను. వా రాచోటియలోఁ బ్రవేశించిరి. వెంటనే మఱల నా ఱాతినిలోనికి లాగి యారహస్యద్వారముం బూడ్చి వయిచిరి. ఆ కొండలోపలి కా మార్గముగుండఁ గొంత దూరముపోఁగా నొకపెద్ద విశాలమైన గుహ తగిలెను. అది దాటి మఱల వారిరువురు వడివడిగా నడచుచుండిరి. రాళ్లు కాళ్ళకుఁ దగులుచుండెను. దుష్ట జంతువుల మ్రోతలు వినం బడుచుండెను. కాని వారు భయపడకపోవుచుండిరి.

మఱి కొంచెము దూరము నడచు నరికి వారి కా గుహ యొక్క రెండవవైపు కన్పడెను. బయటికివచ్చిరి. ప్రపంచ మెల్ల నిర్మనుష్యమైయుండెను. ఆ బయలులో నాయిద్దఱు నొకరివెనుక నొకరు నడచుచుఁ బోవఁజొచ్చిరి. మనము చూడ

లేధుగాని జనులు చెప్పుకొను మాటలంబట్టి చూచినచో వీరిని యమ కింకరులతోఁ బోల్పవచ్చును. సందేహములేదు.

అట్టి నిర్జనస్థలమున నొంటరివై ఆరాత్రి, ఆ కటికచీఁకటిలో, ఆ విగ్రహద్వయమును నీవు సందర్శింపఁగలవా? నీ గుండియలు పగలవా? చూడు. వారెవరో? వారు మన కపరిచితులుకారు. శ్రీధరుఁడు, విజయ సింహుఁడు!

నాఁడు తెల్లవారినది. మరలఁ బ్రొద్దుగ్రుంకెను. రాత్రి యాయెను. చెఱనుండి మంత్రియగు బుద్ధిసాగరుని విడిపించితిమి. పాప మతనిని గోతిలోనుండి నూతిలోనికి దింపితిమి. అతఁడా శకటమునెక్కి తన్ను జంపుట కుద్దేశింపఁబడిన గమ్యస్థానమునకుం బోవుచుండెను. ఆ బండి తోలువాఁడుకాక మఱియొకఁడు బండివెంటఁగలఁడు. ఆ బండి క్రమముగా గమ్యస్థానమును సమీపించుచుండెను. మంత్రివెనుక ప్రక్కనుండి తొంగి చూచుచుండెను. అతఁడెవరి కొఱకేని యెదురుచూచుచున్నాఁడా యేమి?

బండి వడివడిగాఁ బోవుచుండెను. అంతలోఁ జప్పుడొకటి వింటిమి. నీకు జ్ఞప్తియందున్నదా? అదియేమి?

ఆ బండివెనుక దూరదూరముగ శ్రీధరుఁడును విజయసింహుడును సాయుధులై నిన్నటి దుస్తులనే ధరించుకొని వచ్చుచుండిరి. వారెంతజాగ్రత్తగా నడచినను రాలిన యెండుటాకులకుం దగిలి పాదములు కొద్దిపాటి చప్పుడును జేయు

చునేయుండెను. వారు గాలికి దిగువుననుండిరి. అందుచే నది పైనవున్న బండివారికి వినంబడుటలేదు. కాని బుద్ధిసాగరుం డెట్లో వారి రాకను గ్రహించెను.

ఇంక గమ్యస్థానము విశేషముదూరము లేదు. మర్రి చెట్టునకు సమీపమున నొకచోట నిరువురు మనుష్యులు కూర్చుండియుండిరి. వారు కాటుదున్నపోతులవలెనుండిరి. నల్లని నేరేడుపండువంటి వన్నెగల శరీరము, పొడవైన యాకృతి గల్గి యా యిరువురును భయంకరముగానుండిరి.

'వోరే య్! శూడరోయ్ బండొొత్తావుంది'

'ఆం! అద్గోరోయ్'

'కాళ్ళమోర్మ్కి తల్పుకొని కత్తుచ్చుకోరోయ్'

'ఇవ్వాల్తో మన దరిద్దరం అంతా తీర్తంది'

'కల్లు ముంతలకీ సారాయి ముంతలకీ తస్సాగొొయ్య రొండు సోంవచ్చిరాల్దాకా పరవా లేదు.'

అనుకొనుచు, ఆయుధములను సర్దుకొనుచుండిరి. బండి సమీపించెను. ఇంతలో నాయిరువురు మనుజులలో నొకండు దద్దరిల్లునట్లు "ఆం! చచ్చారా! బాబో" అని కేకవేసి క్రిందం బడెను.

అంతలో రెండవపురుషుండు వెన్కకుందిరిగి చూచెను. ఆజాను బాహువయిన యొక యున్నత విగ్రహ మతనికంటం బడెను.

ఆ యిరువురును బెనగులాడిరి. వెంటనే యా యున్నత విగ్రహ మొక్కపోటున నతనింగూడఁ గూల్చెను. అతఁడు విజయసింహుఁడు. ఈ సందడి ప్రారంభింపఁగనే శ్రీధరుఁడు వెన్కనుండివచ్చి యకస్మాత్తుగా బైనఁబడి బండి వానిం దుని మెను.

ఆ రెండవవాఁడు పాఱిపోవఁజూచెను. కాని శ్రీధరుఁడు వెంటనంటి తరిమిపట్టుకొని యతనింగూడ వారితోఁబాటు విగత ప్రాణుం జేసెను.

అంత మంత్రి బండినుండి వెల్వడివచ్చి శ్రీధరుని,విజయ సింహుని కౌఁగిలించుకొనియెను. మఱల నాముగ్గురు నాబండి పై నెక్కియామఱ్ఱిచెట్టుప్రక్కఁగానావలకుందోలుకొనిపోయిరి. అట్లు వారాప్రక్కఁగా రెండుమైళ్ల దూరమరుగు సరి కక్కడఁ గొందఱు సేవకులు గుఱ్ఱములతో సిద్ధముగా వీరి కొఱ కెదురు చూచుచుండిరి. విజయసింహ, శ్రీధర, బుద్ధిసాగరులు కొంత సేపటివఱకు నేదో గుసగుసలాడుకొనిరి. ఆ ముగ్గురును మూఁడు గుఱ్ఱముల నెక్కిరి. బండి నచటనే వదలి విజయసింహుఁడు కొందఱు సేవకులతోఁగూడి యొక క్రొత్తమార్గమునఁ బట్ట ణాభిముఖుండై పోయెను. బుద్ధిసాగర శ్రీధరులు భటు నొకనిం దోడుగైకొని యెచటికో పోయిరి.

---

# ఇరువది మూఁడవ ప్రకరణము

## ప్రయాణము

మనుష్యుల జీవితములవలెనే వారికింగల్గు కష్టసుఖములుకూడ క్షణభంగురములు. ఇపుడు సంతోషతరంగముల మధ్య మునింగియుందుము. కాని క్షణకాలములో మనను మ్రింగివేయ నోరు దెఱచికొనియున్న దుఃఖపరంపరను మన మెఱుంగఁజాలము.

స్వర్ణకుమారి జగన్మోహినులును సోమశేఖరమూర్తియుఁ దద్ధర్మపత్నియు, రాధాకుమారుఁడును, కొంతపరివారముతో, గుఱ్ఱములపై నెక్కి స్వారిచేయుచుండిరి. నిముషములు, గడియలు గడచుచుండెను. గుఱ్ఱములు సాధ్యమైనంత వేగముతోఁ బరువిడుచుండెను. చెట్టులు గడిచిపోవుచుండెను. గుట్టలు గడిచిపోవుచుండెను. పుట్టలుగడచి పోవుచుండెను. పల్లములు మెరకలు గడిచిపోవుచుండెను. ఎవ రేవయిపునుండి వచ్చి తమ్ముంబట్టుకొందురో యనుభయముచే వారెడతెగక యొకరీతిగా గుఱ్ఱములం బరుగెత్తించుచుండిరి. మైళ్లు, క్రోశములు యోజనములు గడచిపోవుచుండెను.

ఇంతలో దూరమునుండి గుఱ్ఱములచప్పుడు వినవచ్చు చుండెను. అది మఱింతస్ఫుటమైకొండఱా శ్వికులు తమ్ములను సమీపించుచున్నట్లు వారికిం గోచరించుచుండెను. గుఱ్ఱముల కళ్లెములను సంపూర్తిగా విడిచిరి.

అడ్డమువచ్చిన సర్వమును దాటుచు నవి పరుగెత్తుచుం డెను. కాని యా యాశ్వికులంత కంతకు సమీపించుచుండిరి. వారిదివఱకు వీరింజూడ లేదేమోకాని యిపుడు మాత్ర ము చూచుచుండిరి. అప్పడే చంద్రోదయమాయెను. ముం దుపోవుచున్నవారి జాడ తమకుం జిక్కుటచేతం గాబోలు వారి పుడు గుఱ్ఱములను మఱింతవేగముగాం దోలుచుండిరి.

'అదుగోరా!మనకింకా అరమైలుదూరంలోవుంటారు.'

'నీ కేంతెలుసురా! అట్లాకన్పడతా వుందిగాని అది చాలాదూరంవుంటంది. నీకనుభవంలేదు గ న్కట్లంటావు. గుఱ్ఱాల్ని పరెగెత్తించండి. అందుకోవచ్చు'

'పాపం వాళ్ళగుఱ్ఱాలు చస్తున్నాయిరా పరుగెత్తలేక'

'పిచ్చిముండాకొడుకంటే నీయంటోడే. నీగుఱ్ఱాలొంక చూచుకో! ఏమవుతా వున్నాయో'

'అవునురా! బంగారమంటి నాగోడా చచ్చుకాళ్ళడ్డ దిరా'

'ఓరి తొత్తు కొడకల్లాల! ఎందుకురా ఊంవాగుతారు పోనియ్యక? మీకేం తోంచదల్లేవుంది?'

'వాఁగక ముంగల్లే నోరుమూసు కూర్చోరో వాలా యేంటిరా నాకు తెల్వోదు. దేముడు నోరిచ్చిందెందుకు వాగ టానిక్కాదంటారి మఱి ?'

'అదే జగన్మోవి శైతే కాదురా! ఆళ్ళముటా అయితే మన అధుర్ష్టుం చెప్పేటందుకోస్తందంటారి వహ్వ ! బంగారం మేడలు కట్టించొచ్చురా'

'నీ నోటివాక్యం సల్లంగా, అది జగన్మోవిఁకే ముకే అవుతుందిరా'

'నీకింకా సందేయంకూడా ఉందాయేంటోరి ? అచ్చు రాల నామాట తీర్తంది చూడు. దేముడు మనమీా ద్దయుం చాలగాని యింకా ఇందులో షందేయం ఉంటందంటరా, చూడుతమాషా'

'ఉబలాటం పడబోకురా నాపిచ్చోడా! మనం సం తోషిస్తే అది అసలేయెనక్కి పోతంది'

'ఆక్సో వీళ్లు. అచ్చమైనవీరులజాతోళ్ళు. ఆళ్ళతోగెల్చి ఆజగణ్మోవిక్టి తీసుకొచ్చినప్పుడిమాటలు కాని యిప్పుడెందు కురా ఆ యాణంగిమాటలు. తెలివితక్కువ నాయాళ్ళాలా'

'ఓరే గాజుల్తొడిగించుకొన్న ముండవైతే మఱినూవు పోరా యెనిక్కి. అంతేగాని యిటువంటి ఆణంగిమాటలు నా ముందాడమాకరా'

'ఊఁ! పదనీయండిరా సోది'

అని మఱియొకసారి బెత్తములతో గుఱ్ఱములవీపులపై గట్టిగాఁ గొట్టిరి.

ఆ యాశ్వికులు సమీపించుచుండిరి. సోమశేఖరమూర్తి యిట్లనెను.

'ఇఁకఁ బ్రయోజనములేదు. మనము వారితోఁ బోరాడకుండ గమ్యస్థానమెట్లును జేరలేముగదా? నిలిచిపోరాడి వారిందోలివేయుటయే మంచిదని తోఁచుచున్నది. ఏమందురు?'

'ఆఁ! మాకు నట్లే తోఁచుచున్నది. అయినను మఱికొంతకాల హరణము చేయుదము'

'చేసినందువలనఁ బ్రయోజన ముండవలయును గదా?'

'మఱి కొంచెముకాలము గడచినను మనకు సాయము వచ్చువారెవరు? ఎట్లేని మనను మనమే కాపాడుకోవలయును గదా? ఎందుకీ యాలస్యము?'

'రాధాకుమారా! నీ యాయుధములం దీసి సిద్ధము చేయుము. మహారాష్ట్రవీరులారా! సిద్ధపడుఁడు'

'ఓ! మే మెల్లరము నిదివఱకే సంసిద్ధులమైతిమి'

'అదిగో! వారిపుడు మనలను మిక్కిలిసమీపించినారు!'

'వారుకూడ మనవలెనే ఆయుధములను దీసికొని సంసిద్ధమగుచున్నారు చూచితిరా?'

'ఆఁ! పరవాలేదు. దూరమున కెంతోమంది యున్నట్లు కన్పట్టినదికాని మన మను కొన్నంతమంది లేరు'

‘ నిజమే. ఇరువదిమందికంటె హెచ్చుగాలేదు ’

‘ లేదు. పాతికమంది యుందురు. సందియములేదు ’

‘ వెనుకకుందిరిగి మార్కొనుఁడు. వచ్చినారు. మన మీఁదం బడుదురు ’

అని యొకరితోనొకరు సంగతులు చెప్పుకొనుచుఁ బరస్పరము హెచ్చరించుకొనుచు, అందఱును వలయు నాయుధములఁగొని సిద్ధముగానుండిరి.

‘ ఆగం డాగండి! యెక్కడికెళ్తారింకా ? ’

‘ అడముండలల్లే పారిపోతారేం. మీకేం పౌరుసం లేదా ? ’

‘ నిలండి నిలండి ! ’ అను కేకలు నార్పులు వినంబడెను. ఆకేకలు రాధాకుమారునకును, దక్కిన వీరులకును ములుకులై తోఁచెను. ఆవీరుల ముఖములనుండి దుర్నివార్యమై, భయంకరమై, శత్రుశుష్క మహీరుహ విధ్వంసన సమర్థ శిఖిజ్వాలాయమానమై క్రోధరసము నిరంతర ధారగాఁ బ్రవహించుచుండెను. ఆ భటుల దుర్భాషలు వారిని వ్రేటుందిన్న బెబ్బులులను జేసెను. కండ్లనుండి నిప్పుకలు రాలుచుండెను.

‘ రండు ! రండు ! వ్యర్థప్రసంగము లేలఁజేసెదరు ? మీ మగఁటిమి చూపుఁడు. భవత్కంఠ విలుంఠ నోత్సాహమునం గాలసర్పములవలెఁ బ్రకాశించుచున్న మాఖడ్గముల నెదిర్చి నిలువుఁడు ’

అని యాపీరులు ప్రతి వాక్యములు వచించిరి. అందఱు గుఱ్ఱముల నొక్కపరి వెన్కకుంద్రిప్పిరి. వారిపైఁబడిరి. ఒకరితో నొకరు దాఁగొ్కనిరి. స్వర్ణకుమారీ జగన్మోహినులుకూడ యుద్ధ సన్నద్ధలయి శత్రువులను హింసించుచుండిరి.

నిముసములో పోరు ఘోర మాయెను. ప్రాణములపై నాశవదలి యిరు దెసలవారును బోరుచుండిరి. రక్తము కాల్వ లుగట్టెను. యోధులందఱ దేహములు రక్త మయము లయ్యెను. వస్త్రములు రక్తమయములయ్యెను. హస్తములు రక్తమయములాయెను. పాదములు రక్తమయములు. శిరములు రక్తమయములు! తెల్లఁగా వెండివలె నంతకుఁ బూర్వము మెరసినఖడ్గము లిప్పుడెఱ్ఱగా మెరయుచుండెను!

నవాబు పట్టమహిషిని ముద్దుపెట్టుకొనివచ్చిన యాయిరువురు రాజకుమారులవంకఁ జూడుడు! అంగము లెంత రమ్యము లుగానున్నవో? వారిరువురను జూచినంత నేశత్రువులకుంగూడఁ గొట్టుటకుఁ జేతులువచ్చుటలేదు. కాని యుద్ధము. ఒకరు కొట్టిన మఱియొకరు ముద్దుపెట్టుకొందురా? అది యెక్కడనేని కలదా? పాపము! వారిరువురును రక్తముతోఁ దడపఁబడిరి.

అదిగో! పాపము! రాధాకుమారునివంకఁ జూడుఁడు! కండ్లు మిఱుమిట్లు గొనుచున్నవి. ఆ భయంకరమూర్తిని జూడలేము. లేళ్ళపై విజృంభించిన కొదమసింగమువలె నతని మూర్తి ప్రకాశించుచుండెను. ఒకరింబొడుచుచు, ఒకనిం

గ్రుచ్చుచు, ఒకనిం డలత్రుంచుచు నతఁడు స్వేచ్ఛావిహారము చేయుచుండెను. కాని పాపమతనికి శ్రమహెచ్చెను. ఇఁకఁ బోరాడఁ జాలకుండెను.

సోమసేఖర మూర్తికొక పెద్దగాయము వీపునందగిలెను. రక్తస్రవంతి ప్రవహించుచుండెను. పాప మతనిపనియైపదె.

వీరందఱికంటెను ముందునకుఁబోయి తమనాయకులకు దెబ్బలు తగులకుండవలయునని శత్రుభటులను గవిసిపోరాడిన మహారాష్ట్ర వీరులనుజూడుఁడు! స్వామి భక్తియన్న నిజముగా వారిసొమ్మే. స్వామి ఋణమును దీర్చుకొనుటకై వారి నల్వురలోను మువ్వురు గతించిరి.

గోల్కొండ భటులకున్నంత పీలు వీరికిలేదు. వారింకను బది పండ్రెండుగు రుండిరి. వారెల్లరు వీరులు, యోధులు. వీరో పిల్లవాండ్రు, సుకుమారులు, స్త్రీలు, ముసలివాండ్రు. ప్రాణభయమున వారిందులకుం దెగించిరి. సహాయమువచ్చువారెవరును గన్పడలేదు. ఏదిక్కును లేనివానికి దైవమేదిక్కందురు. కానివారి కదియును గన్పట్టినది కాదు. ఏమియుఁదోఁచలేదు. రాధాకుమారుఁ డొకరి నిరువురను మూగురను నల్గురను జంపెను. వారికి బల్లెములుకలవు. వీరికి లేవు. ఆ నట్టడవియందు, ఆ నిర్జనస్థలమున, ఆసుకుమారులు, ఆ సౌందర్యవతు

లు, ఆ యున్నతవంశ సంభవులు, అందఱుఁ జావవలయునని విధి నిర్ణయమా యేమి?

ఇంతలో నిరువురు సేవకులు వడివడిగాఁ బరువెత్తి యశ్వముల నధిష్ఠించి పోరాడుచున్న యా యిరువుర సుందరీ మణులను సమీపించి 'ఓ రేయ్! పిచ్చిముండాకొడకల్లాలా రండిరా! జగన్మోహిణీ స్వర్ణకుమారీ యిద్దర్నీ జయించ్చి లాక్కెళ్దాం. ఇక్కడ పోట్లాడతా వున్నారు' అని కేకవేసిరి. తగినంతమంది యిటనుండి తక్కిన వారా ప్రక్కంబోయిరి. రాధా కుమారులును తక్కిన వీరులును బడుటకు సిద్ధముగా నుండిరి. వీరిఖడ్గములు వారికిఁ దగులకముందే వారిబల్లెములు వీరింబొడిచివైచుచుండెను.

ఆ యిరువురు సుందరీమణులును 'ఆగుఁడు! కొంచెము సేపువఱకు యుద్ధము మానుడు. మే మొకమాట జెప్పెదము' అనిరి. ఆయిరువురు నట్లనఁగనే గోల్కొండ భటులు తత్క్షణమే యుద్ధమును మానిరి.

'గోల్కొండ భటులారా! మీరింకేల పోరాడెదరు? మేమిరువురము మీతోడవచ్చెదము. యుద్ధమును మాని గోల్కొండకుం దిరిగి పోదము, పదండి. ఊరకే మీరు నాశమైన నేమి లాభము?' అని యనిరి.

కాని రాధాకుమారుఁడు 'అది సరికాదు. మాప్రాణములలో, ఊపిరి యున్నంతవఱకు మీరు పోవలదు' అనెను.

ఆ సుకుమార రాజకుమార ద్వయము 'మాకొఱకు మీరేల దీనికొడంబడెదరు. మేనం బ్రాణము లున్నంత వఱకు శత్రువులం జీల్చి చెండాడి వైచుదము' అనిరి.

'యుద్ధమైతే మాకేం? సెక్తిలేదను కొన్నారాయేం? రాండి! మళ్ళీ పోట్లాడదాం' అని యా భటులు తిరుగఁబడిరి.

మరల యుద్ధము సంప్రాప్తమగునట్లుండెను. మఱియొక పరి యాయుధములు కలియఁబోవుచుండెను. ఇరుదెసలును మరలం గలియంజొచ్చెను. వారి యాయుధములు మఱియొక్క పరి తళుక్కుమనియెను. ఆసుందరీమణుల గుండియలు కళుక్కు మనియెను. ఆయుధములొండొంటిందాఁకి ధ్వనించుచుండెను.

'గోల్కొండ వీరులారా! వలదు! వలదు! పోరాడ వలదు. ఇదిగో! మేము మీతోడవచ్చుచున్నాము' అని యా సుందరీ మణులనిరి. అనుచునే వారు గుఱ్ఱములను గోల్కొండ కుం ద్రిప్పిరి. అప్పుడే డెక్కలు మ్రోగుచుండెను. అవి పరుగెత్తు చుండెను. రాధాకుమారుని మొగము వర్ణనాతీతముగా నుండెను. అది యెఱ్ఱగాఁ బొద్దుగ్రుంకునప్పటి సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను. కాని తీక్ష్ణభావము, మధ్యాహ్నార్క తేజమును మించియుండెను. అతని పండ్లప్రయత్నముగా ధ్వనించుచుండెను.

"మా ప్రాణములుండగా మీకేమియు భయములేదు. రండు! రండు! మీరేల పోయెదరు. సాహసించి త్వరపడకుఁడు! త్వరపడకుఁడు' అని యెలుగెత్తిపిల్చెను. వెంబడించెను.

'అయ్యో! ఇంత సాహసము మీకుఁదగదు' అని యా రాజకుమారు లిద్దఱును బిగ్గఱగాఁ గేకలువైచిరి.

పాపము! అట్లుఱచుచు వీరెల్లరుఁ గొంతదూరము వఱకు వారిని వెంబడించిరి కాని కార్యమ్ము లేకపోయెనుం ప్రార్థించిరి, వేడిరి, బతిమాలుకొనిరి. లాభము లేకపోయెను. ఆ సుందరీమణులు పోవుచుండిరి. వారి వెంటంబడి గోల్కొండ భటులు పోవుచుండిరి. అపుడే కొంతదూరము గడచిరి. వీరు నిరాశ చేసికొనిరి.

'మాకొఱకు మీ రేల చింతించెదరు? మేము గోల్కొండకుంబోవుట మాకిష్టము. దానిని మీరు వారింప రాదు. మాయందు మాత్రము దయయుంచుఁడు. పోయి వచ్చెదము.'

అని కడసారి పల్కులు వినవచ్చెను. మఱి మాటలు విన్పడలేదు. ఱిచ్చపడి వీరెల్లంగొంతవఱకుఁ జూచిరి. ఇంతలో వారు దృష్టిపథమును దాటిపోయిరి. ఇంకలాభములేదని వీరు ముందుకుఁ బ్రయాణముచేయ మొదలిడిరి. వారి ముఖములు తేజోవిహీనములై యుండెను. అందుఁబెక్కురకుఁ బెద్దగాయములు తగిలినవి. కొందఱు మిక్కుటమగు బాధ నందుచుండిరి. కాని దానిని సహించుకొని గుఱ్ఱములను వదలి యాయరణ్య మధ్యమున వేగముగాఁ బోవుచుండిరి.

---

# ఇరువదినాలుగవ ప్రకరణము

## మోసము

పాపము గోల్కొండభటులు కష్టపడి ముప్పాతికభా గము మడిసి యొకభాగము మాత్రము ప్రాణావశిష్టులై స్వర్ణ కుమారీ జగన్మోహినులను వెంటఁబెట్టుకొని గోల్కొండకుఁ బ్రయాణమై పోవుచున్నారు. గుఱ్ఱములొకదాని వెనుక నొకటి వరుసగా నడచుచుండెను. మధ్య స్వర్ణకుమారీ జగన్మోహిను లుండిరి. ఇర్వురు వారివెనుకను నల్వురుముందును భటు లుండిరి. ఇంకను దెల్లవారలేదు. వెనుక ప్రక్కనున్న వారిరువు రతి బలాఢ్యులు. మంచి నడివయస్సులో నున్నవారు. ఆ భటులెల్లరు నతివేగముతో గుఱ్ఱములను దోలుచుండిరి. వారి కిపుడు గమ్యస్థానముం జేరవలయు ననుటకంటె మఱియొక తలఁపులేదు. అందులోఁజివర రెండవవాఁడు యోచనాపరుఁడు. కుయుక్తికలవాఁడు. అతఁడప్పు డిట్లు యోచింపసాగెను.

"ఇప్పుడు నేను స్వర్ణకుమారీ జగన్మోహినులను దీసి కొనిపోయి నవాబున కిచ్చినందువలన మనకువచ్చు ఫలితమేమి? అతఁడొక లక్షరూపాయిల నిచ్చును. అందులో మధ్య లంచా లకు సగముపోవును. ఈ కార్యమునకు వచ్చిన వారము మే మిరువదియైదు మందిమి.

ఈ యిద్దఱకొఱకై మాలోఁ బందొమ్మండుగురు ప్రాణములను విడిచిరి. న్యాయమనితోఁచినచో నవాబు వారికి రెట్టింపుధనమును లక్షనుండి పంచియిప్పించునేమో. అతఁడు గ్రుడ్డిముండకొడుకు. తనకుతోచినదితప్ప మఱియెవఁడు చెప్పినను వినఁడు. పోనిమ్ము, సమముగాఁ బంచియిచ్చినను నావంతు వచ్చునది నాల్గువేలరూపాయలు. ఈ రూపాయలు శాశ్వతములుగావు. దొంగలు దోచుకొన్నను బోవును. నా ప్రాణమున్నంతవఱకు నాకు ధనసంపాదన కేలోటును గల్గదు. అదియుంగాక దేవుని దయవలన నాకువచ్చినలోటులేదు. లక్షాధికారినిగాక పోయినను తల్లిదండ్రులు గడించియిచ్చిన యాస్థి నా జన్మాంతమువఱకు సుఖ జీవనమునకుంజాలును. నాయందీ కన్యలు మిక్కిలి యాతురతతోఁ జూచుచున్నారు. నిశ్చయముగా నా సౌందర్యమును జూచి వారు మోహించియుందురు. ఇంతకంటె నాకు ధన్యతకలదా? అదిగో చూడు మా సుందరీమణి మరల వెన్నెలలోఁ దనసుకుమారమును, మనోహరమును, అగు ముఖమునెత్తి నావంకఁ జూచుచున్నది? అట్టి సౌభాగ్యవతుల కటాక్ష వీక్షణముల నందుటకంటె మఱి భాగ్యము నాకే జన్మమునంగలదా? ఈ సుందరీమణులకుఁ దురుష్కులన్నం గిట్టదు. అందుచేతనే వీరు నవాబు నయినను లక్ష్యపెట్టుటలేదు. నన్నుం దప్పక వీరు పెండ్లాడి తీరుదురు. ఇట్టి యౌవనవతులతో సౌఖ్యము నందుటకంటె మఱి కావలసిన

దేమి? ఇపుడు నవాబు నాకు నెలకెనుబది రూపాయలిచ్చును. తెలివియున్నవానికి ధనసంపాదన మొకలెక్క కాదు. ఈ యెను బదిరూపాయలను మఱియొకచోట సంపాదించుకోఁజాలనా? ఎడ్డిముండా కొడుకైనను నావెన్కనున్న యీభటుఁడు నేను జెప్పినట్లు వినును. మేమిరువురమును గలిసి యీ ముందున్న నల్లురను జంపివేసెదము. అతనికి నాల్గుసంచులు ధనమాశ పెట్టెదను.”

ముందునై పునకు దృష్టిసారించిచూచెను. ముందు భటులు వీరివంకనేని చూడకుండఁ దమమార్గమున వడివడిగాఁ బోవుట నితఁడు కనిపెట్టెను. వెనుక భటునితో నిట్లు మెల్లగా ప్రసంగించెను.

‘ఓరీ! భీమన్నా’

‘అయ్యా! సిత్తం.’

‘మెల్లగా మాట్లాడరా పిచ్చిముండ కొడకా!’

అతఁడుమెల్లగా నిట్లనెను.

‘ఇంగ మెల్లింగానే మాట్లాడుతాలెండి! ముందేం తెల్వ కట్లాన్నానుండి. సెలవియ్యండేంటో’

‘నీకు బహుమానంవచ్చే డబ్బుకంటె రెట్టింపు నేనిచ్చి యావజ్జీవం నిన్ను నాకొల్వులో నుంచుకొనెదను. నే నొక చిన్న సంగతి నీతోఁ జెప్పఁదలఁచుకొన్నాను. నీవుకూడ దాని కంగీకరించుదువా?’

'ఇన్నాళ్ళనుండి మీరెప్పిందాని కెదురెప్పుడైనా సెప్పానండి? ఆ సంగతేంటో సెలవియ్యండి. శేస్తాక'

'ప్రమాణ పూర్వకముగాఁ జేసెదవా?'

'ఓ! పెరమాణ పూర్వకంగా చేస్తానుండి! చెప్పండి'

'అతి రహస్యమునుమీ! వెళ్లఁబుచ్చఁగూడదు'

'అట్లాగే'

అతఁడు తన హృదయమునందలి యుద్దేశమెల్ల నతని కెఱింగించెను. అతఁడంతయు సాకల్యముగా వినెను. ఆ భటుఁడు వట్టిమోటువాఁడు. కాని యతనికింగూడ దురాశ పుట్టెను. ఆ స్త్రీ రత్నములలో నొకర్తె నపహరింపవలయునని అతని కాశపొడమెను.

స్త్రీలును ధనమును ప్రపంచములో నెల్లరకు నాశ గల్గించును. ఆ రెంటివలననే తలలు పగులును. కంఠములు తెగును. రాజ్యములు నశించును. ఋషులు, యోగులు, సంసారులు, మునులు, నాగరకులు, అనాగరకులు, అందఱు వారిని గామింతురు. ప్రపంచములోని కక్షలకు దెబ్బలాటలకు, ఆరెండే ప్రధాన బీజములు. అతఁడు మెల్లగా నిట్లనెను.

'అందు కడ్డాంలేదు గానండి, నానొక సంగతి మనివి సేసుకుంటా'

'అదేమిటి? త్వరగాఁ జెప్పు'

అతఁడు సందేహించెను. ఆభటుని సందేహము నతఁడు కనిపెట్టెను.

'సందేహింపక త్వరగా చెప్పు. సమయము మించి పోవుచున్నది'

'అచ్చెప్తే మీకోపం వస్తుందండి!'

'నాకు కోపమురాదు. నీమనస్సులో నేమున్నదో దాఁచక త్వరగా నాకుఁజెప్పుము. నేను వీలయినఁ జేసిపెట్టెదను'

'ఆ యిద్దర్లో నాకొక పిల్లని దయచేయించాలి'

ఆ మాట యతని మనస్సునకుఁ గంటకమాయెను. కాని యతఁడు దానిం గప్పిపుచ్చెను. తనలోఁ దా నిట్లనుకొనెను.

'ఈ మోటవాని కా సుందరీమణులలో నొక్కరితె కావలయునట! కానిమ్ము! ప్రస్తుతము గడువవలయు. తరువాత గాని యితనిని సులువుగా వంచింప వీలులేదు.'

అతఁడు మెల్లఁగాఁ బయికిట్లు చెప్పెను.

'ఇందుల కేనా యింత సంశయ పడుచున్నావు? దీని కింతగా సంశయింపవలసిన యగత్య మేమికలదు? కార్యమునకుం గడంగుము. నీ యిష్టము నట్లే నెఱవేర్చెదనులే.'

ఆ భటునిహృదయమున నూత్న మనోరథములు మొలకెత్తెను. అతనిముఖము సంతోషపరీవృతమాయెను. అతం

డందుమున్గి యుబ్బి తబ్బిబ్బు లగుచుండెను. ప్రాకృత జను లల్ప సంతోషులు. వారికిఁగల్గు సుఖదుఃఖాది భావములు వారిచే గోపనము చేయఁబడక పయికిఁ జక్కఁగాఁ బ్రస్ఫుటమగుచుండును. అట్టివారికి దూరదృష్టియుండదు.

'సిత్తం. సిద్దంగున్నానుండి'

'సరే, కొంచెము సేపు తాళు'

ఆ కుయుక్తిపరుఁడు తనదృష్టి నిపుడు స్వర్ణకుమారి వంకకుం ద్రిప్పెను. ఆమెను మెల్లఁగాఁబిలిచెను. ఆమెకుఁ దనయుద్దేశమునెల్లఁ జెప్పెను. ప్రత్యుత్తరమీయలేదు గాని యామె కటాక్షమూపనిచేసెను. అది యా కుయుక్తిపరుని మోముదమ్మిపైఁ బ్రసరించి యతనిహృదయముం గొల్లఁగొనెను. అతఁడా యర్థమును గ్రహించెను.

'మేము కార్యమున కుపక్రమింప వచ్చునా?' అని యతఁడు పల్కెను. కొంచెముసేపువఱకు జవాబు రాలేదు. కాని యెట్టకేలకిట్లు మెల్లఁగావినఁబడెను.

'వీరు పోట్లాటయందు మిక్కిలి సమర్థత కలవారు. ఆయుధముల నిచ్చినచోఁ దగినంత సాయమును మీకుఁజేయఁగలరు'

ఆ వాక్యములతనిని పరవశత నొందించెను. అతఁడొక నిముసము ప్రపంచమును మఱచెను. తనప్రక్కనున్న భటుని దగ్గఱనుండి రెండు బల్లెములను గైకొని యా సుందరీమణి

కొనంగెను. ఆ సుందరీమణు లిరువురు చెటియొకటి తీసికొనిరి. ప్రాతఃకాలమగుచుండెను. ఈ నాల్గు గుఱ్ఱములును వడిగా నడువఁ దొడఁగెను.

ముందుఁబోవుచున్న నాల్గు గుఱ్ఱములు నాగియుండెను. వారు ముందువంకఁజూచుచుండిరి. ఆవయిపున నొక చెరువుండెను. వారా చెరువుదగ్గఱ ప్రాతఃకృత్యములు నిర్వర్తింపవచ్చునని తలఁచి గుఱ్ఱములనాపి తమవెంటనే కొంచె మాలస్యముగా వచ్చుచున్న స్వజనము రాకకై చూచుచు నుండిరి.

ఇంతలో నా నలుగురలో నొకఁడు కెవ్వునఁ గేక వేసెను. వెంటనే కడమ మువ్వురును ప్రక్కకుఁదిరిగి చూచిరి. వెనుక నుండివచ్చి సుందరీమణులును కుయుక్తిపరుఁడును భటుఁడును వారిని బల్లెములతో బొడిచిరని మీకుఁజెప్పవలయునా?

రెండు పక్షములవారును గొంచెముసేపు పోరిరి. కాని ముందుగాఁదిన్న బలమైనగాయములచేత మొదటి నల్గురు పడిరి. పాపము వారు ప్రార్థించుచున్నను, సుందరీమణులు వారించుచున్నను విడువక, ఆ కుయుక్తిపరుఁడును, భటుఁడును, ఆ నల్గురలోఁ గొన యూపిరితోనున్న వారినిం బొడిచి చంపిరి. ఒక్కనిముసములో ఆ నల్గురు పరలోకమున కేగిరి.

---

# ఇరువదియైదవ ప్రకరణము

## ప్రతిఫలము

ఆ భటులు నల్గురును జచ్చిరి. ప్రాతఃకాల మాయెను. మందమారుతము నిర్మలముగానున్న యాకసమున హాయిగా వీచుచుండెను. వెలుతురు కొంచె కొంచెము హెచ్చగుచుండెను. వెన్నెలపెంపు నశించిపోయెను. మన సుందరీమణు లిరువురును మేలి ముసుగులను సొగసుగా సవరించుకొనిరి. వారి ముఖములు సరిగాఁ గన్పడుటలేదు. కుయుక్తిపరుని కన్నులా వారిజాక్షుల ముఖపద్మములమీఁదికి స్వారిచేయుచుండెను. వారి మేలి ముసుగులనుండి యప్పుడప్పుడు నొక విధమయిన క్రొత్త మందహాసములు జనించుచుండెను. ఆ చిఱునగవుల యందుఁ బెద్దయర్థమున్నట్లు తోఁచుచుండెను. కాని దానిని మనము గ్రహింపఁజాలము. ఆ కుయుక్తిపరుఁడు మాత్రము తన యందలి మోహముచే నా మందహాసము లట్లు పొరలి వచ్చుచున్నవని యనుకొనుచుండెను. కామాంధులు, మోసమును గుర్తింపఁజాలరని లోకమున వాఁడుక. అయినను సర్వత్ర కాముకులు మోసమునే కాంచుదురని సిద్ధాంతముచేసి చెప్పఁజాలము. చెప్పిన నది కల్ల.

ఆ నల్గురును జచ్చినవెనుక, యీ నల్వురును చెఱువు గట్టుపైకి నెక్కిరి. అచ్చట ప్రక్షాళనాది ప్రాతఃకాల క్రియలు నిర్వర్తించు కొనుటకు మిక్కిలి యనుకూలముగా నుండెనని వారందఱు దీర్మానించుకొనిరి. సుందరీమణు లొక పచ్చిక తావునం గూరుచుండిరి.

వారి మందహాసములు, వారి విలాసములు, ఆ కుయుక్తి పరుని హృదయమును నీరుజేయుచుండెను. ఎప్పుడా సుందరీ మణులు తనయంకపీఠిం గూర్చుందురా యని యతనిమనస్సు త్వరపడుచుండెను. ఆ యిరువురును దన్ను ప్రేమించిరని యతండు తలంచెను. కాని యందులకు ప్రతి బంధకముగా నచ్చట, ఆభటుం డొకండు కలండు. అతనికి మఱొక సంకటము కూడంగలదు. ఆ యనాగరకునకు నొక సుందరీమణి నొసంగ నతని కిష్టములేదు. అతండెప్పుడు తన్నుంజంపి యా సుందరీ మణులం గైకొనునో యని భయము. సందేహామయ మన స్కులకుం బ్రపంచమంతయు సందేహామే. అంతయు భయమే. వారికి శాంతి యుండదు.

ఆ భటుని హృదయముకూడ నట్లే చలించుచుండెను. వారిని విడిచి దూరమేగుట కతని కిష్టములేదు. కాని యతని కింత సందేహములేదు. తనకితండే యపాయముం జేయకున్నను తాను దూరముగాం బోయినచో గుఱ్ఱములపై నెక్కి యా ముగ్గురును బాఱిపోవుదురని లోపల భయముకలదు. అతండు

కూడ నా సుందరులవంక మాటిమాటికి వీక్షించుచుండెను. తనమీఁది ప్రేమచేతనే వారట్లు మందహాసములు చేయుచున్నారని యతఁడును భావింపఁ దొడంగెను. అతని మనమునకది యంతకంతకు హర్షమును గల్గించుచుండెను.

ఆభటుఁ డట్లు జగన్మోహినీ స్వర్ణకుమారులవంకఁజూచుటకు యుక్తిపరున కసహ్యముగానుండెను. చూడుడు! ఒక్కనిముసములో నెట్టి విచిత్రభావము లుదయించుచున్నవో? ఆ యిరువురహృదయములందును బరస్పర ద్వేష ముదయించెను.

జగన్మోహినీ స్వర్ణకుమారులముఖమునఁ జింతకన్పట్టదేమి? విజయసింహ రాధాకుమారులను వరించిన కాంతారత్నములేనా వీరు? అయినచో వారికి సంతోషముగానున్నదేమి? వారిముఖములనుండి వెల్వడుచున్నయా ఆగడపు జిఱునగవుల కేమని యర్థముకలదా? నిష్ప్రయోజనముగా నట్లేల నవ్వవలయును? ఆ కుయుక్తి పరుఁడా భటునివంకఁజూచి యిట్లనెను.

'ఓరీ! భీమన్నా! యిటురారా'

'అయ్యా! సిత్తం. ఎందుకుండి?'

'నాలుగు పల్లుతోముకొను పుల్లలను విఱుచుకొనిరారా'

అతని కది యిష్టములేదు. కాని యింతలో.నేమివచ్చునని యతడందు కంగీకరించెను. దూరమేగుట కతనికిష్టములేదు. నాల్గుదిశలకును దృష్టిసారించెను. ఇరువది ముప్పది గజ

ములలోనే యొకచెట్టుండెను. ఆచెట్టేమిచెటో, దానిపుల్లలు పల్లుదోముకొనుటకు పనికివచ్చునో రావో, అతఁడు పరీక్షించి చూడలేదు. పైకెక్కి పుల్లలను విఱుచుచుండెను.

ఆచెట్టు క్రిందికేగి కుయుక్తిపరుఁడు పైనుండి పడుచున్న పుల్లల యాకులు దీయుచుండెను. అతఁడు నాల్గయిదు పుల్లలుకోసి 'యికచాల్లే' అని దిగివచ్చుచుండెను. కుయుక్తిపరుఁడు పుల్లల యాకులు తీయుచున్నట్లు నటించుచునే ఆచెట్టుమొదలు దగ్గఱకు వచ్చెను. ఆస్కంధము మిక్కిలి పొడవైనది, లావయినది. ఆ భటుఁడు దానిని గాఁగిలించుకొని ప్రాఁకుచు క్రిందికివచ్చుచుండెను. మానిసి యెత్తువఱకును రాఁగనే మన కుయుక్తిపరుఁడు బొడ్డులోనున్న ఖడ్గముందీసి యాభటుని కుడిడొక్కలో నొక పెద్దపోటు పొడిచెను. 'ఛీ! కుక్కా? యెంతపన్నేశావురా!' అనుచు నాతఁడు క్రిందఁబడెను. అతనిపండ్లు పటపటమనుచుండెను. అతఁడొకసారి కాలెత్తి మన కుయుక్తిపరునిం దన్నఁబోయెను. కాని సాధ్యము కాలేదు. బాధహెచ్చెను. గిలగిల కొట్టుకొనుచుండెను. ఇంతలో మఱి యొకపోటువచ్చి కరమునం దగిలెను. పాపమతఁడు ప్రాణములు విడిచెను!

కుయుక్తిపరుని హృదయము పరిపూర్ణానంద మయమైపోయెను. అతని సంతసమునకు మేరలేదు. అతని భయము సందేహము సర్వమూ నాశమాయెను. భయ సందేహములను

నివర్తించుకొన్నట్లే యాచెఱువునందలి జలములలో స్నానము చేసి తనకలుషముంగూడఁ బోగొట్టుకొనందలంచి స్నానము చేసెను. ఎన్నిపాపములుచేసినను నరుఁడు గంగాస్నానముం జేసెనేని యవియన్నియు నశించునని యతని నమ్మకము కాఁబోలు !

అతనిహృదయము హర్షప్రపూర్ణమాయెను. శరీరము నంగల రక్తముపోయి నిష్కల్మషమాయెను. వెంటనే బయటికి వచ్చి క్రొత్తదుస్తులు తొడిగికొనెను.

అప్పుడే ప్రొద్దు పొడుచుచుండెను. ఆసుందరీమణులా స్థలముననే, అట్లే కూర్చుండియుండిరి. ఆ మేలిముసుఁగులు తీయలేదు. ఆ మందహాసము తగ్గలేదు. అత్యాతురతతో నతఁడ చటికేఁగింబోయెను.

'సుందరీమణులారా ! ఇఁక నన్ను ననుగ్రహింపుఁడు' అనెను. ప్రత్యుత్తరములేదు. మందహాసమే.

'మీ మేలిముసుఁగులుతీసి మీ కటాక్షవీక్షణములచే నన్ననుగ్రహింపుడు'

మరల మందహాసమే. ప్రత్యుత్తరములేదు. కాని 'మౌనమర్ధాంగీకార' మని యతఁ డుహ్వించుచుండెను.

'మీరు ముగ్ధలు. మీకు సిగ్గు స్వాభావికము.' అని యాసరసుఁ డందొక్క సుందరిని ముద్దుఁబెట్టుకొనెను. ఆమె

యతనిని గట్టిగాఁ గౌఁగిలించుకొనెను. పాప మెందుచేతనో కాని యూరసికున కది కష్టముగాఁదోఁచెను. గిలగిల తన్నుకొనెను. కాని పట్టువీడలేదు. ఆ సుందరి యిట్లుపలికెను.

'కాముకుఁడా! వీరు సుందరీమణులు కారు. ఆంధ్ర వీరులు. నీబలముం జూపుము'

అని యెత్తి యతనిం గుదిలించి నేలపై విసరివేసి త్రొక్కి పట్టెను.

ఆ యిరువురు సుందరీమణుల మేలిముసుఁగులు నొక్కపరి క్రిందఁబడెను. పరాక్రమమును సూచించు నిరువు రాంధ్ర వీరుల ముఖములు కుయుక్తిపరుని యెదుటఁ బ్రకాశించు చుండెను. ఒక్కదెబ్బతో నతఁడు గతించెను. ఆ యిరువురు నందు స్నానముచేసి విజయనగరము దారింబోవఁ జొచ్చిరి.

---

# ఇరువదియాఱవ ప్రకరణము

## కాలకూటము

'జ్ఞాతిశ్చేదన లేనకిం' అని యొక నీతిశాస్త్రవేత్త వక్కాణించెను. జ్ఞాతులలోఁ బరస్పరవైరము స్వాభావికముగాఁగల్గుచుండును. ఒక తల్లి కడుపునం బుట్టుటయా వివాద హేతువు? అట్లింతమాత్రమునుఁ గాఁజాలదు. ముందుఁ బరస్పరము కలహింపనున్న సోదరులే బాల్యావస్థయం దత్యంత ప్రేమతో మెలంగుచుందురు.

'మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః' అని మఱియొక కవి చమత్కరించెను. నిశ్చయముగా ధనమే ప్రధాన వైరకారణము. అచ్చటనే సోదరులకుఁ గక్షలు, విరోధములు. సర్వమునకు నదియే కారణము!

కాని యౌదార్య వృత్తిగలవారికి సముద్భవమగు నాక్రోధము చిరకాలమువఱకు నుండదు. వెంటనే నశించును. ప్రపంచము పెక్కురీతులు. కొందఱకా భావమే కలుగదు. మఱికొందఱు నాఁటివైరమునే సర్వకాలమును లోన నుంచుకొందురు. వారే విషపూరిత హృదయులు.

రాజకుమారులకుఁగల్గు వైరము దీనికింజాల భిన్నమైనది. ఒక తండ్రి కడుపునఁ బుట్టినవారిలో నొకఁడు రాజగును.

కడమ వారి కా గౌరవము లభింపదు. ఇది వారి హృదయముల నా జన్మమును దహించుచుండును. వారు స్వభావసిద్ధముగాఁ బౌరుషవంతులు. అందుచే వారు మఱింత దహింపఁబడు దురు. వారి కట్టియెడ సమయము తటస్థించినచో నేమి సంభవించును? రాజ్య విభాగము చేయుట కభిలషించుచుందురు. రాజ్యములోఁ బరస్పర కలహము లంకురించును. అపుడు శత్రు రాజులకు మంచి తరుణము చిక్కును.

చక్రధరుఁడు రాజవంశీకులలో నొకఁడు. అతనికి విజయ నగర సామ్రాజ్యమున వారసత్వము కలదు. కాని రామరాజు దానిని బలముచేతను, బుద్ధిచేతను, ఆక్రమించుకొనెను. అతఁ డేమి చేయుటకును అవకాశము చిక్కినదికాదు. అతనికి బాల్యమునుండియు రాజ్యకాంక్ష విస్తారము. కాని యతని పక్షము దుర్బలమై పోయెను. అతనికి రాజ్యసంపాదనము చేయుటకుఁ దగినంత సాయము చేయువారెవరు? అందుచే నతఁడు చక్రవర్తియగు రామరాజిచ్ఛా భరణములోఁ దృప్తి వహించుచుఁ గాలము గడుపవలసినవాఁడాయెను. అతని కది రుచించునా? తనకు గౌరవములేదు. రాజ్యములేదు. రాజ కార్య ప్రసక్తిలేదు. పరిపాలనలేదు. సామంత ప్రభువులు తన్ను సేవింపరు. రాజ్యములోఁ దనమాట నెవరును వినరు. ఇదియంతయు నతనికిఁ గష్టముగానుండెను. అయిన నతఁ డేమి చేయఁగలఁడు?

చక్రవర్తితో నెదుర్కొనుటకు మదించిన యేనుగులు, కాల్బలములు, గుఱ్ఱములు కావలయును. ధైర్యశౌర్య యుక్తులయిన యోధులు కావలయును. వీనినన్నింటిని సంపాదింపఁదగిన స్నేహితు లుండవలయును. రథము లుండవలయును. ఆయుధము లుండవలయును. ఫిరంగులు మొదలగు నవన్నియు నుండవలయును. ఇన్నిటిని సంపాదించుటకు తలసి నంత ధన ముండవలయును. ఇదియంతయు నతఁడు నెఱవేర్పఁ గలఁడా?

ఇఁకఁ గర్తవ్యమేమి? ఎట్లయినను రాజ్యము సంపాదింప వలయును. నేర్పుతో విషమయినను ద్రావింప వచ్చును. మెల్లఁ గా లోలోపలఁ గుట్రలుచేయ మొదలుపెట్టెను. చక్రవర్తిని మిక్కిలి ప్రేమించుచున్నట్లు నటింపఁజొచ్చెను. మృదుమధుర ముగాఁ జక్రవర్తికి నొచ్చకుండ మాటలాడఁదొడఁగెను.

వృద్ధుఁడైన రామరాజు స్వభావముచేతఁ బరులను నమ్మునట్టివాఁడు. అతఁడు కపటికాఁడు. కపటులవర్తన మతనికిఁ దెలిసినదికాదు. తనవలెనే లోకమును భావించెను. అంత కంతకుఁ జక్రధరుఁడు తన్నుఁ బ్రేమించుట విస్తారమైన ట్లతనికిం దోఁచుచుండెను. అందుచే నతఁడును, అంతకంతకుఁ దనకుఁ జక్రధరునందుఁగలప్రేమను వృద్ధికావించెను. అతనికి రాజ్య మున గొప్పయుద్యోగములిచ్చినచోఁ బాపమతనికి రాజ్యము లేని లోపము తీఱిపోవునని తలఁచెను. పెద్దయుద్యోగము

లన్నియు నిచ్చెను. క్రమక్రమముగా నతనికి సర్వాధికారము నొసంగు చుండెను. తుదకు సర్వరాజ్యకార్యములలోను, అతని సలహాను గైకొనుచుండెను.

ఇంతలోఁ, జక్రధరునకు మఱియొక యండదొరికెను. అది యేదో మీరెఱుంగనిదికాదు. ఆయండ ఆదిల్‌శాహా. ఇతఁడు విజయనగరసామ్రాజ్య పాలనమున నెట్లు భాగము వహించినది మీరెఱుఁగుదురు. ఇట్లీ యిద్దఱును సమాన కాంక్షగలవారగుటచే మిత్రులైరి. ఏకాభిప్రాయవంతులకు మైత్రి సుకరము. వారిద్దఱు కొన్ని నిబంధన లేర్పఱచికొని విజయనగరసామ్రాజ్యమునుమ్రింగ నిశ్చయించుకొనిరి. అప్పటి నుండి యిద్దఱును గుట్రలుచేయుచు సమయము వేచియుండిరి.

విజయనగర సామ్రాజ్యమునకుఁ జాలకాలమునుండి మంత్రిత్వమును జేయుచుఁ బ్రసిద్ధిఁగాంచిన వంశమునందు బుద్ధిసాగరుఁడు జనించెను. అతఁడు వారితంత్రములను గ్రహించెను. అవి యతని కెంతమాత్రమును గిట్టినవికావు. స్వాభావికమగు వైరము తటస్థమాయెను. సమయమునుజూచి బుద్ధిసాగరునిం జంపవలయునని వారు నిశ్చయించుకొనిరి. కాని యతనిబుద్ధి యపారమైనదగుటచేఁ దప్పించుకొనుచు వచ్చెను. కడపటకు చెఱసాలలో వేయించుటయు, తుంగభద్రానదీ సమీపమునం జంపించుటకు యత్నించుటయుఁ గావించిరి.

ఈ ప్రయత్నము విఫలమగుట యతని ద్వేషమును క్రోధమును ద్విగుణముచేసెను. అతఁ డే దేశముననున్నను

దన్ను సాధించునని భయము. అతఁడు రేపు జఱుగనున్న మహాయుద్ధమునకు వచ్చుట చక్రధరునకుఁ బెక్కువిధముల నషము. తనయెత్తులకు నెదురెత్తులు పన్నును. విఘాతములు కల్పించును.

అందుచే నతఁడు చాలమంది చారులను సంపాదించి దేశదేశములకును బంపెను. ఎక్కడఁ గన్పడిననుసరే, అతనిం ద్రుంచి శిరస్సును రహస్యముగాఁ దెచ్చి తనకిచ్చిన వారి కేబది వేలరూపాయిల నిచ్చెదనని యేకాంతమున నాచారులకుం జెప్పి పంపెను. ఆచారులపైనఁ గొందఱనధికారులను నియోగించెను. వారెప్పటి వార్తల నప్పుడు తనకు రహస్యమందిరములలోఁ జెప్ప నేర్పఱచెను. ఇప్పుడు తానే మంత్రియు సర్వాధికారియునై నందునఁ గోశధనమును స్వేచ్ఛగా వెచ్చించుచుండెను. అతనికిఁ బ్రతి విషయమునను, తారానాథుండును, ఆదిల్షాహా యుం దోడ్పడుచుండిరి. తారానాథుఁడెప్పటి విషయము నప్పుడే గోల్కొండకుఁ బంపుచుండెను.

# ఇరువదియేడవప్రకరణము

## ఆంధ్రులు

గోల్కొండ నవాబు రామరాజచక్రవర్తిచే పంపఁబడిన రాయబారి నట్లు తిరస్కరించుట విజయనగర పట్టణములో నా బాలగోపాలమును దెలియవచ్చెను. బాల్యముదాటి వయసు వచ్చినప్రతి యౌవనుని హృదయమును రోషపూరితమాయెను. సైనికులు మండిపడిరి. యోధుల ఖడ్గము లప్రయత్నముగనే యెగిరి తురుష్కులవిధ్వంసనమునకుఁ బర్వులెత్తసాగెను. ఆ మహానగరమున నున్న యాంధ్రులు, కర్ణాటులు, ద్రావిడులు, ఇంతయేల! సర్వహిందూ జాతులును దురుష్కవినాశమును జేయుటకు సన్నద్ధులై యుండిరి.

వేలకొలఁది కుమారు లాంధ్రసామ్రాజ్యమునకుం గల్గిన యీపరాభవమును దీర్చుటఁగాని చచ్చుటఁగాని కావించెద మని తుంగభద్రాస్రవంతీ పవిత్రజలములను స్నానముచేసి పరిశుద్ధులై శపథముచేసిరి. ఆంధ్రయౌవనవతులు పురుషవేషము లందాల్చి యుద్ధరంగమునకుంబోవ సన్నద్ధురాండ్రై యుండిరి. వీరమాతలు తమ కుమారరత్నములకు వలయునేని సమరరంగమునఁజచ్చి యాంధ్రపౌరుషమును నిల్పుఁడని బోధించుచు వారినట్లుచేయఁ బ్రార్థించుచుండిరి. మహాకవులు వీరరసోత్సా

దకములైన గీతములచే పూర్వపుటాంధ్రయోధుల సుప్రసిద్ధ కీర్తిని, శౌర్యధైర్యములను గీర్తించుచుండిరి. గోల్కొండ సైన్యమును నాశముచేసి నవాబును బ్రాణములతోఁ బట్టుకొని తెచ్చి యిచ్చుటో లేక యుద్ధరంగమునఁ బ్రాణములు విడిచి వీరస్వర్గమును బొందుటో కావింతుమని నిర్భయముగాఁ ద్రికరణశుద్ధిగా వాగ్దానములను జేయుచుండిరి.

కృష్ణానది మొదలు కన్యాకుమారివఱకునుగల యాంధ్ర సామ్రాజ్యమునందలి యెల్లరాజులు, జమీందారులు, రాష్ట్రపాలకులు, ఉన్నతోద్యోగులు, బాలకులు, యౌవనులు వృద్ధులు, పిన్నలు, పెద్దలు, అందఱును గలిసి యాంధ్రజాతీయ సంకీర్తనములు చేయుచుఁ దమకు జయమిచ్చి తమ దేశమునకు యశముఁ గూర్పవలయునని దేవునిం బ్రార్థింపఁగడంగిరి. కొంచెము జ్ఞానము పౌరుషమునుగల ప్రతివీరుఁడునువచ్చి సామ్రాజ్య సైన్యమునం జేరుచుండెను.

ఇంతలోఁ దుచ్ఛుఁడును బాపియుఁ గ్రూరాత్ముఁడు నగు ఆదిల్షాహా రామరాజునకిట్లు కబురుపంపెను !

'మీరు నారాజ్యములోనుండి పూర్వము తీసికొన్న దుర్గములను నాకిప్పింపుఁడు. నేను మీయందు యథాపూర్వకమగు భక్తితోనేయుండి మీపక్షమునం బోరాడెదను. ఆయా దుర్గములనీయక మీరు తిరస్కరించినయెడల నేను మీపక్ష

మున నుండఁజాలను. శత్రువుల పక్షము వహింపవలసివచ్చును. అప్పుడు మీరు క్రోధమువహించినను లాభములేదు.'

ఇది గోరుచుట్టుపై రోఁకలిపోటాయెను. ఆంధ్రులకిది మఱింత కోపమును గల్గించెను. ఈయాదిల్శాహాకు రామరాజిదివఱకుఁ బెక్కుయుద్ధములలో సాయముచేసెను. ఇతర తురుష్కులు తనపై దాడి వెడలినపుడెల్ల వచ్చి రామరాజుపాదములు పట్టుకొనుచుండువాఁడు. అతఁడు దయఁదలఁచి తనసైన్యములను సాయమంపి యతనిని రక్షించుచుండువాఁడు. ఇట్లు పెక్కుగొప్పయుద్ధములలో రామరాజతనిని గాపాడెను. వేయేల? రామరాజు సాయము లేకున్నచో, ఆదిల్శాహాను దదితర తురుష్కప్రభువులు పాతాళ లోకమునకుం ద్రొక్కివైచియుందురు. తనవలన నింత సాయముపొంది, తనదగ్గఱకువచ్చి 'నాయనా! తండ్రీ!' యని పిల్చుచుండు ఆదిల్శాహా లోలోపలఁ దనరాజ్యములోనే కుట్రలు పన్నుచుండెననియుఁ దన కిట్టివార్త నంపుననియు నుదారహృదయుఁడగు రామరాజెఱుఁగఁడు.

ఆదిల్శాహా తియ్యని పలుకులు విన్నవారు నిజముగా, అతఁడు రామరాజును భక్తిచేతనే అట్లు పిల్చుచున్నాఁడని తలఁచిరి. అందుచే వారుకూడ తుదకతఁడిట్లు చేయునని యెఱుఁగరు. నమ్మకముగలవారు పరులహృదయమును, రాఁబోవు కష్టములను గనిపెట్టనేరరు.

విజయనగర పట్టణము కలఁగుచున్న మహాసముద్రము వలె నుండెను. దర్బారు గావింపఁబడెను. చక్రవర్తి నోటినుండి ఆదిల్షాహా యంపిన రాయబారము వినఁగనే ప్రజలుద్రేకముచే మండిపడిరి.

'ఆదిల్ శాహాను బట్టి ఖండఖండములుగా నరికినను బాపములేదు'

'ఓరీ! దురాత్మా! నిన్నటిదాఁక కుక్కవలె మావిజయ నగరమున సంచరించిన నీకెట్టి పరాక్రమము వచ్చినదిరా?'

'అయ్యో? ఆతుచ్ఛునిపైకి నన్నంపుఁడు. దేవరవారి యుప్పు తిన్నందులకు తీరువవలసిన ఋణమును దీరిచి ధన్యుఁడ నయ్యెదను'

'ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మికి నూతన యౌవనము సంప్రాప్తించుచున్నది. అందుచేతనే శత్రువులకిట్టి పోఁగాలము సమీపించుచున్నది'

'నా కా దుర్మార్గుంబట్టి తేవలయునని చాల గోర్కి కలదు. దేవర యానతిత్తురేని యతనిందెచ్చి తమ పాదపద్మములకడ నుంచెదను'

అనుచు కొందఱు గొణుగువారును, మఱికొందఱు వీరులు లేచి సభలోఁ బలుకువారునై యుండిరి. ఏకగ్రీవముగా సభ్యులెల్లరును యుద్ధముచేయఁ దీర్మానించిరి. సభ సంక్షోభింపఁ గడంగెను. కొందఱాంధ్ర జాతీయగీతములం బాడిరి.

మఱికొందఱు జయప్రార్థనలు సల్పిరి. 'ఆంధ్రమాతకు జయ్ జయ్' అను శబ్దములు దిగంతములం బ్రతిధ్వనించుచుండెను.

సైన్యము పెక్కు చిన్నచిన్న భాగములుగా విభజింపఁబడెను. అట్టి పెక్కు చిన్నభాగములపైన నొక్కొక సైన్యాధికారి నియమింపఁబడెను. వీరిక్రింద నుపసైన్యాధికారులుండిరి. సైన్యాధికారులపైనఁ బ్రధాన సేనానాయకులుండిరి.

సైన్యములోఁ బ్రతిభాగమునకును సమస్త పదార్థములు తెప్పించి యిచ్చు సంగళ్ళు స్థాపింపఁబడెను. శాకములు, భోజన సామగ్రులు, మిఠాయిలు, పండ్లు, ఫలములు, సర్వపదార్థముల నాయంగళ్ళలో నమ్ముచుండిరి. ప్రపంచములో నే భాగమునను గానరాని గొప్పగొప్ప వైద్యు లాసైన్య సముద్రమున నుండిరి. వారెట్టి గాయములనైనను నిముసములోఁ గుదుర్పఁగలరు. వారెఱుఁగని చికిత్సలుగాని మార్గములుగాని లేవు. వారిదగ్గఱఁ జిత్రములయిన పనిముట్లుండెను. వానిసాహాయ్యమువలన వారు వెంట్రుకలను నిలువుగా రెండుగాఁ జేయఁగలరు. అంతసూక్ష్మమైన శస్త్రసాధనములు నేఁడైనఁగలవా?

ఈభటులకుఁ గావలసిన యంశములను వస్తువులను సేకరించి తెచ్చుటకుఁ దగినంతమంది సేవకులు నియోగింపఁబడిరి. వారెప్పు డేకార్యముచేయవలసిన నప్పుడు దానినిజేయ నడుము కట్టుకొని సన్నద్ధులై యుండిరి. ఆ సైన్యమునకు, బియ్యము, రొట్టెలు, సంభారములు, మొదలగు సర్వవస్తువులు సంసిద్ధము

చేసిరి. వీరు లెల్లరు పొంగిపోవుచుండిరి. వార్తాహరు లెప్పటి వార్తలప్పుడు తీసికొనిరా నియమింపఁబడిరి.

రామరాజొక లక్షసైన్యమును దనతమ్ముఁడగు తిరుమల రాయుని కిచ్చెను. ఇరువదివేల గుఱ్ఱములు నీతని కే యియ్యఁబడెను. ఇంకొక గొప్పసైన్యభాగము వేంకటాద్రి కొసఁగెను. విజయసింహుఁడు మఱొక పెద్దసైన్యముపైన నధ్యక్షత వహించెను. తానొక గొప్పభాగమున కధ్యక్షతం జెందెను.

ఆ గొప్పసైన్యమాఱు లక్షలకుమించి కదలుచున్న మహాసముద్రమువలె నుండెను. పర్వతములు కదలుచున్నవో యన నొప్పుచున్న యేనుఁగులు వేలకొలఁది యుండెను. లక్ష గుఱ్ఱములుండెను.

# ఇరువది యొనిమిదవ ప్రకరణము

---

## తురుష్కులు

హిందూదేశమునఁ బశ్చిమ భాగమునఁ గొండలవరుస యొకటి కలదు. అది ప్రకృతి సౌందర్యమునకుఁదావు. దానినే యస్త్రాద్రియందురు. అందుఁ గృష్ణ గోదావరీ మొదలగు నదులు, శాఖానదులు పెక్కులు జనించుచుండును. ఆపర్వత శ్రేణియొక్క యుత్తరార్ధభాగము హిందూసామ్రాజ్యమును మహమ్మదీయులనుండి విముక్తినందించి, బానిస తనమును విముక్తిగావించి, స్వతంత్ర సామ్రాజ్యమును స్థాపించుటకై ప్రయత్నించి విఖ్యాతిగాంచిన మహారాష్ట్రులకు వాసస్థానము.

అందు, అహమ్మదు నగరను నొక పట్టణముకలదు. అది కృష్ణా గోదావరీ జన్మప్రదేశములకు సమీపముగానున్నది. అది పూర్వము గొప్పపట్టణమై ప్రసిద్ధికెక్కియుండెను. ఆ కాలమున నది యొకరాజ్యమునకు రాజధాని. ఆరాజ్యము పేరు 'అహమ్మద్ నగరు రాజ్య' మందురు. దానికి నిజాంశాహి యనియు మాఱుపేరుకలదు. ఆరాజ్యపుఁ బ్రస్తుతపు నవాబు పేరు బుర్హాన్ నిజాంశాహా.

ఒకనాఁటి సాయంసమయమున నతఁడును, అతని మంత్రియుఁగూడి యిట్లు లాలోచించుకొనుచుండిరి.

నవా:-తురుష్కులతోఁ దురుష్కులు కలహించుటచేతనే మీరన్నట్లీ విజయనగర సామ్రాజ్యము ప్రక్కలోని బల్లెమట్లు వర్తించుచున్నది.

మంత్రి:-దీని నణఁగఁద్రొక్కితీరవలయును. కాఫరులను హింసించుటయు, వారిని మతములోనికిఁ జేర్చుటయు మన ధర్మము. హిందూదేశములఁ దక్కిన భాగములయందు, కొద్దిగనో గొప్పగనో హిందువులు మనమతమును స్వీకరించిరి. కాని యీ రాక్షసిమూలమున మన మీ దక్షిణహిందూస్థానమున నొక్కని నేని మనమతమునం జేర్పలేకపోతిమి. దీనిని నాశము చేయకుంటిమేని మన మాన ప్రాణములు దక్కవు.

నవాబు:-నిశ్చయము. దేవుని యపరావతారమనందగిన మహమ్మదుగోరి హిందూదేశమున సామ్రాజ్యమును స్థాపించిన తరువాత, ఇంతటి సుప్రసిద్ధోత్కృష్ట సామ్రాజ్యము మరలఁ బుట్టియుండలేదు. ఇది క్రమక్రమముగా మన రాజ్యములంగూడ మ్రింగునట్లు తోఁచుచున్నది.

మంత్రి:-దేవా! హిందువులు మంత్రిత్వాది మహోన్నత పదవులను బొందుటగాని రాజ్యములను పాలించుటగాని దేవుఁడయిన అల్లా కిష్టముకాదు. కాని యిది పాపకాల మగుటచే హిందూసామ్రాజ్యములు జనించుటయు హిందువులు మంత్రిత్వాదులను వహించుటయుఁ దటస్థించు



చున్నది. ఇందుకు మనవారుకూడఁ గొంతకారణమే. మనవాబులలోఁ జాలమంది కాఫరులను మంత్రులనుగాను, సేనానాయకులనుగాను జేయుచున్నారు. ఇది యెంతయు హానికరము, పాపకార్యము.

నవాబు:- అది సత్యమే. ఆశక్తి తురుష్కులకుండక హిందువులకు లేనేలేదు. ఈమధ్యనొక ఫకీరు నాతో, ఇట్లేచెప్పియున్నాఁడు. ఒక ఫకీరేకాదు, చాలమంది ఇట్లే చెప్పుదురు. అందుచేత నేను నాగొప్ప యుద్యోగములనన్నిటిని మనవారికే యిచ్చితిని. అది మనధర్మము. పాలకులముగా మనము దేవునిచే విధింపఁబడితిమి. వారు మనకు బానిసలు. వారిని బాలకులనుగాఁజేసి గౌరవించుట తప్పే.

మంత్రి :- ఈయొక్క విజయనగర సామ్రాజ్యమువలన వారియాటలు సాగుచున్నవి. విజయనగరరాజులకుఁ గ్రమక్రమముగాఁ గండ్లు పొరలు గ్రమ్ముచున్నవి. భరతఖండమునఁ దమంత వారులేరని విఱ్ఱవీగుచున్నారు. గోల్కొండ రాష్ట్రము నవక్రపరాక్రమమునజయించి ఘానుపురదుర్గమును, బానగల్లుదుర్గమును లాగుకొన్నారు. అంతటితో వారు తమమదమును విడువలేదు. అతఁడిపుడు మనరాయబారులను సరిగా పూర్వమువలె మన్నించుట మానినాఁడు. మనరాయబారు లిపుడతనిముందు నిల్చుండి మాట్లాడవలయునట! ఎంతకష్టము! అతనితోఁగూడఁ బ్రయాణము చేయు

నపుడతని యాజ్ఞను గైకొని మఱిగుఱ్ఱము నధిష్ఠింపవలయు నట! దినదినము క్రొత్తయాజ్ఞలు బయలు దేరుచున్నవి.

నవాబు :-ఏమీ! ఇట్టి యాజ్ఞ లిదివఱకు లేవే? ఓరీ రామరాజా! నీకెంత పొగ రెక్కుచున్నదిరా? ఇంతకును మాలోమేమిది వఱకుఁ గలహించుటంజేసి నీయాటలు నేటివఱకు సాగు చున్నవి. ఇఁక సాగించుకొందువుగానిలే. మే మిదివఱ కాచరించిన పనులన్నియు నిపుడీ వాచరించుచున్నావుగా? అవి తురకలకుఁజెల్లును. వారు మీరాయబారులను నిల్వఁ బెట్టించి మాట్లాడవచ్చును. మఱి యేమేని చేయవచ్చును. కాఫరునకు నీకుఁగూడ నివి చెల్లునా! ఇంతకును వినాశ కాలము——.

ఇంతలో నొక సేవకుఁ డొక యుత్తరముం దెచ్చెను. మంత్రిగైకొని యిట్లు చదివెను.

'అయ్యా!

మీ దయవలన నన్నికార్యములును గొనసాగినవి. విజయనగర సామ్రాజ్యమును విధ్వంసముచేసి హాయిగా నిర్భీతిగాఁ గాలము గడుపుకొనవచ్చును. నేను మీరుగాక గోల్కొండ నవాబుకూడ మనలోఁ జేరఁగలఁడనుట మీకు విదితమే. ఇపుడు శ్రీబేదర్ నవాబు బర్ద్ శాహా కూడ నిందు లోఁ జేరినాఁడు. మనమతమును, ఆంధ్రులు నాశముచేసి పరా భవముచేయుచున్నారన్న మాట మీరు మఱువఁగూడదు.

అంతవఱకుఁ జదివెను. మంత్రికన్నీరు విడిచెను.

'కాఫరులను హింసించి తురకమతమునంగల్పుకొమ్మని దైవమువిధించెను. కాఫరులే తురక మతమునకు హానిచేయుచున్నారు. కాల మెంతమారినది. అగుఁగాక! దైవమా! మంచి కాలమువచ్చినది. మా నవాబులెల్లమరల నీపరిశుద్ధమ్మతమును స్థాపింపఁబూనుచున్నారులే'.—

నవా:- ఆహా! దైవమా! అల్లా! పూర్వము మాతాతలు మతముకొఱకై పాశ్చాత్యుల నెదిరించి విఖ్యాతినందిరి. ఇపుడు మాకీ మతయుద్ధములోఁగూడ విజయమిప్పించుము. మాకిట్టి యైకమత్యమును మీామతము కొఱకిచ్చినందులకు వందనములు.

అతఁడు మరలఁ జదువఁదొడఁగెను.

'మన మతధ్వంసమున కోర్వజాలక మనము యుద్ధమునం బ్రవేశింప వలసి వచ్చినది. కాఫరులను ధ్వంసముచేసి స్వర్గమును బొందవచ్చును. కావున మీాసైన్యములను వెంటనే తాళికోట ప్రాంతములకుం దెప్పింపఁ బ్రార్థించుచున్నాను.

శత్రువులు కూడ నాప్రాంతములనే విడియుదురని వాఁడుక. త్వరితము-త్వరితము.

చిత్తగింపుఁడు.'

వా రిరువురు వీరరస భరితులైరి.

'త్వరగాఁబోయి మనసైన్యములనెల్ల విభజించి యాయా భాగముల కాయా వీరులను సైన్యాధిపులనుగాఁ జేయుము.' అని నవాబు అనెను.

---

# ఇరువది తొమ్మిదవ ప్రకరణము

## జైత్రయాత్ర

స్వర్ణకుమారీ జగన్మోహినుల వృత్తాంత మేమయినదో మీ కేమేని తెలిసినదా? స్వార్థత్యాగులయిన యా యాంధ్ర వీరవతంసు లిరువు రెవ్వరో తెలిసినదా! స్వార్థత్యాగుల జీవితములు పవిత్రములు. ప్రాతస్సంస్మరణీయములు. వారికి మనము కృతజ్ఞతంజూపుట మనవిధి.

వీరు మిక్కిలి యవశ్యమగు నొక కార్యభారమును వహించి విజయనగరమునుండి గోల్కొండకువచ్చిరి. గోల్కొండలోనున్నప్పుడు వారికి స్వర్ణకుమారీ జగన్మోహినుల స్థితి తెలిసెను. వారిని తప్పించుటకైవచ్చి పాపము ప్రాణములను గోల్పోయిన మహారాష్ట్రసరదారులలో నొకరితో వీరికి బరిచయముండెను.

ఆహా! ఏమి, ఆ మహారాష్ట్ర సరదారుల సాహసము! వారు జగన్మోహినీ స్వర్ణకుమారుల రక్షణకొఱకుఁ దమ ప్రాణములనుగూడ నొసంగిరి. వారట్లేల చేయవలయును? మహాత్ముల హృదయములు కేవల పరోపకారైక ప్రయోజనములు. స్వార్థత్యాగము వారికి జన్మతోడనే జనించును. ఆ దేశాభిమాను

లీ సుందరీమణులు పొందుచున్న కష్టములంజూచిరి. వారి నెట్లైని రక్షింపవలయునని తలంచిరి. వేసవికాలమునందలి యత్యంత తీక్ష్ణసూర్యకర జ్వాలలచే మండి భస్మమయి పోవు చున్న వృక్షసంతతులను జూతుము. సాయముచేయము. ఊరకుందుము. కాని యేఫలమును గోరక నీలాంబుదము లతి శీతల జలబిందు నిక్షేపణము కావించి వానిని నూతైశ్వర్య సంశోభితములనుగాఁ జేయుచుండును. అది ప్రకృతి సిద్ధము.

నాఁటిరేయి చీకటిలో గోల్కొండనవాబు పట్టమహిషిని ముద్దుపెట్టుకొని యామెయొద్ద సెలవుంగైకొని విజయ నగరమునకుఁ బ్రయాణమైవచ్చిన యాసుకుమార కుమార ద్వయమును మరల నొకపరి మీా హృదయ సీమలయందు నిల్పుఁడు. వారెవరు?స్వర్ణకుమారీజగన్మోహినులు! గోల్కొండ నవాబు పట్టమహిషియే ఆ యుక్తిని బన్నినది. స్వర్ణకుమారీ జగన్మోహినులు నిజరూపములతోఁ బోయిన వారికిహాని గల్గు నని తలంచి యిట్లామెచేయించెను.

గోల్కొండ భటులు తమ్ము విడిచిపోయినవెనుక వార త్యంత కష్టముతో విజయనగరమున కరిగిరి. పాపము ! రాత్రి యుద్ధములో వారికి గాయములు తగిలెను. దీర్ఘప్రయాణముచే నలసిరి. విజయనగరముం బ్రవేశించుసరికి వారికిఁ బ్రాణ ములు సరిగాలేవు. అచ్చట నేడెన్మిది దినములలో స్వర్ణకు మారీ జగన్మోహినుల గాయములు గుదురఁ దొడంగెను.

కాని సోమశేఖరమూర్తికిం దగిలిన గాయములు మిక్కిలి భయంకరములుగా నుండెను. అతని యారోగ్యము నానాటికి క్షీణింపఁదొడఁగెను. దేహమున దౌర్బల్య మతిశయించెను. అన్నద్వేషము జనించెను. లోని కాహారము పోవుట లేదు. అందుచే శరీరమెల్లఁ గృశించుచుండెను. అతఁడు తా నిఁక విశేషకాలము జీవింపనని తలంచెను. అతనికిఁ గ్రమముగా రాధాకుమారుని వృత్తాంతము తెలిసెను. పూర్వము స్వర్ణకుమారిచేఁ బ్రేమింపఁబడిన రాధాకుమారుఁ డప్రయత్నముగా తమకు మరల దొరకినందుల కతఁ డపరిమితానందము నందెను. రాధాకుమార స్వర్ణకుమారులయు, జగన్మోహినీ విజయసింహులయు వివాహములు కండ్లారఁజూడవలయునని యతనికిం గోర్కెపుట్టెను.

వివాహప్రయత్నములు కావింపఁబడెను. శుభముహూర్తమున నత్యంతవైభవముతో స్వర్ణకుమారీ రాధాకుమారులకును జగన్మోహినీ విజయసింహులకును వివాహములు కావింపఁబడెను. విజయనగర పట్టణముననున్న రాజులు, మంత్రులు, జమిందారులు, విద్వాంసులు, అందఱును వివాహమునకు వచ్చి సమ్మానములంబడసిరి. విశ్వాసార్హుఁడయిన సేనాధిపతియగు విజయసింహుని తద్ధర్మపత్నిని, రాధాకుమారుని తద్ధర్మపత్నిని, తత్తదుచిత మణిమయాలంకార భూషణములచే రామరాజు సమ్మానించెను.

కొన్నాళ్లిట్లు వారు సంతోషమున నుండిరి. అంతట రామరాజు చక్రవర్తి జైత్రయాత్రకు బయలువెడలెను. మాతృదేశాభిమానముగల యావనులందఱు దిక్కుదిక్కులనుండి వచ్చి సైన్యమునం గలియుచుండిరి.

జైత్ర యాత్ర సంగతి వినగనే విజయసింహునిహృదయము పరిపూర్ణానంద సమేతమాయెను. అతనిఖడ్గ మప్రయత్నముగనే ఒఱనుండి వెలికివచ్చుచుండెను.

అతఁడు తనతండ్రియొద్దకేగి యాయనను తనకు, యుద్ధమునకుంబోవ ననుజ్ఞయిమ్మని ప్రార్థించెను.

అతఁడిట్లు చెప్పెను.

"నాయనా! మన తాతలనాఁటినుండి సుప్రసిద్ధమగు విజయనగరసామ్రాజ్యమును గనిపెట్టుకొనియుంటిమి. ఈ సామ్రాజ్యమే మనతల్లి. సర్వమును దెలిసిన నీకుం జెప్పవలసిన దేదియు లేదు. కాని తాత తండ్రుల పౌరుషమును గీర్తిని నీ వెప్పటికిని మఱువకుము.

నేఁడు హిందూదేశమంతయుఁ బారతంత్ర్యము ననుభవించుచున్నది. ఢిల్లీసామ్రాజ్యము నశించినది. దక్షిణ హిందూదేశములోని యుత్తరార్థభాగము మహమ్మదీయనవాబుల వశమైనది. కాని నాబిడ్డా! నీ విపుడున్న యీపట్టణము పేరనే దివ్య సామ్రాజ్యముకలదో ఆ యీ యాంధ్రసామ్రాజ్యము- విజయనగర సామ్రాజ్యము - మాత్రము బానిస రాజ్యము

కాదు. అది స్మృతియందుంచుకొని దానింగాపాడఁ బ్రయత్నింపుము. అట్టి యుత్కృష్ట స్వతంత్రసామ్రాజ్యమునకు సేవచేయు భాగ్య మబ్బినందులకు గర్వింపుము.

తురుష్కులు తంత్రపరులు. యుక్తులతో జయింతురు. వారిని మాత్రము కనిపెట్టియుండవలయును. కానియెడల జిత్తులచే వంచించి హింసింతురు.

కుమారా! ఆర్యావర్తము ధర్మయుద్ధములకుఁ బ్రసిద్ధికెక్కినది. నీకెన్నికష్టములు ప్రాప్తించినను యుద్ధధర్మములను మాత్రము తొలంగి పోకుము.

కృష్ణదేవరాయచక్రవర్తి గతించిన పిదప మరల నింత యుద్ధ మెన్నఁడును జరుగలేదు. పొమ్ము. కీర్తింగడించుము. నీకు జయము గల్గుంగాక!"

అతఁడు సెలవు తీసికొనెను. బయలుదేఱి తల్లికిమ్రొక్కి యుద్ధబిక్షను యాచించెను.—ఆమెయిట్లు చెప్పెను.

"నాయనా!

నీకు నేను జెప్పఁదగినదేదియు లేదు. కాని హిందూదేశము తురుష్కులచేత నానావస్థలం బొందుచున్నది. ధర్మములు నశించినవి. భూతదయ మాయమైపోయినది. పాపములు గోహింసలు సాధునాశనము సర్వత్ర వ్యాపించుచున్నది. వీనికన్నింటికిం గారణము పాపులగు తురుష్కులే.

అట్టి తురుష్కులను రమారమి రెండువందల వత్సరములనుండి తెగనటికి దక్షిణహిందూదేశమున విజయనగర సామ్రాజ్యము ధర్మసంస్థాపనచేసినది. నీ పూర్వుల పవిత్ర రక్తము నీయందుం బ్రవహించునేని శత్రురాజులను ధ్వంసముచేసి విజయనగర సామ్రాజ్యమును ఢిల్లీసామ్రాజ్యమునుగాఁ జేయుము. యుద్ధమునం దభిమన్యునివలె వర్తించిఖ్యాతిం గడించుము." అని చప్పున నాలుక కొఱుకుకొనెను.

'నాయనా! ఒక ముద్దుపెట్టిపొమ్ము' అని చెక్కిలి నొక్కి ముద్దుపెట్టుకొనెను. అతఁడు సెలవుగైకొని భార్య దగ్గఱకేగెను. కంట నీరుపెట్టుచుఁ దల్లిలోని కేగెను.

భార్య యతనికెదురుగా వచ్చెను. ఆ సుందరసుందరీమణుల హృదయములు నీరాయెను. ఆ చూపు నైక్యముం జెందెను.

అతఁడామె నొక్కముద్దు పెట్టుకొని మెల్లఁగా 'సుందరీ! సెలవిమ్ము. పోయివచ్చెదను' అనియెను. ఆ కన్నుల నుండి బాష్పములు క్రిందికి జారుచుండెను. అతఁడు వానిని రుమాలుతోఁదుడుచు చుండెను. ఆమె యిట్లనెను.

'చరణ కమలములనొత్తుచు నెల్లప్పుడు భర్తను ఛాయ కుండుట హిందూసుందరుల పరమధర్మము. కావున నన్నుంగూడ మీతోడం దీసికొనిపొండు. వచ్చెదను'

'సుందరీ! వీరపత్నీనామమును సార్థకము చేయుచున్నావు. కాని నీవంటి పూవుంబోడిని కదనమునకుం దీసికొనిపోయినఁ జాలకష్టములు వచ్చును. నేను వచ్చునందాఁక యోపికమై నుండుము. నా విరహము నీకెంత దుస్సహమో నీ విరహము నాకు నంతదుస్సహమే'

'మనోహరా! మీదగ్గఱనున్న నాకాకష్టములన్నియు సుఖముగాఁ బరిణమింపఁగలవు. మీరులేని యీగృహము నాకుఁ గారాగారము. నన్నీకారాగారమున బంధించి పోవఁకుఁడు. నాప్రార్థన మాలింపుఁడు. మన్నింపుఁడు'

'సుందరీ! తురకలతో ఘోరయుద్ధము జఱుగును. అందుఁబెక్కుమంది దేశరక్షణార్థము మడియనున్నారు. యుద్ధములో నే దెట్లగునో నిర్ణయింపరాదు. తురుష్కులు పాపాత్ములు. స్త్రీలచ్చటికి వచ్చిన మానరక్షణము దుర్లభము.'

'మనోహరా! నా యీముద్దు చెల్లింపరా? ఈ జగన్మోహినికూడ వలసెనేని దేశరక్షణకుఁ బ్రాణము లర్పింప సిద్ధముగానున్నది. పవిత్రజీవిత విభాసురులై కీర్తింగాంచిన యోధులే నశియించుచుండ నావంటి వ్యర్థురాండ్రుండి యేమిచేయుదురు? హిందూసుందరీమణులకు మానభంగముచేయుటకు తురకలే కాదు, ప్రపంచములో మఱెవరును సమర్థులుకారనుట మీరెఱుఁగరా? తురకలిదివఱకెన్ని సారులు చిత్తూరును సాధించి యందుఁ బ్రవేశించి విఫలమనోరథులైరో మీకు విదితము.

కాదా? పవిత్రమగు జౌహారుగాని, తీక్ష్ణములగు ఖడ్గములుగాని యున్నంతకాలము హిందూ సుందరీమణులకు మానభంగ భయము కలుగనేర్చునా? నాథా! చిన్నప్పటినుండియు నుదారాశయములతోఁ బెరిగితిమి. సమాన సుఖదుఃఖముల ననుభవించితిమి. స్నేహితురాలను. దాసురాలను. మీ యాజ్ఞ వహించుట నాధర్మము. విజయనగర సామ్రాజ్య రక్షణకై నాయోపినంత సాయమును జేయుట కేను తగనా? ఈ భిక్షను నాకుం బ్రసాదింపరా?'

అని ఆమె చెయిసాచి పెక్కువిధముల నతనిం బ్రార్థించెను. అతఁడు పెక్కు విధముల చెప్పిచూచెను. కాని సరియైన సమాధానములు మాత్ర మొసంగఁజాలకపోయెను. యోజించి యోజించిచూచెను. కాని యతఁడెందు వలననో యామెకోరిక ననుమతింపలేదు.

'స్నేహితురాలా! నీ హృదయమంతయు నేనెఱుంగుదును. కాని నిన్నుయుద్ధమునకు నేనిపుడు నాతోఁ దీసికొనిపో వలనుపడదు. అందులకుఁ దగినంత కారణము కలదు. నాకు సెలవిమ్ము. పోయివచ్చెదను'

ఆమె మఱి యిఁకలాభములేదని తలఁచెను. ఇంక నామె యతని నాకోర్కెకోరలేదు. కాని మనసున మాత్ర మేమో యోజించుకొనెను.

అచ్చటకప్పుడు రాధాకుమారుఁడు వచ్చెను. ఆయోధ వీరు లిరువురు గుఱ్ఱముల నధిష్ఠించిరి. స్వర్ణకుమారి విజయ సింహుని గుఱ్ఱమున కడ్డమువచ్చెను. 'బావా! సెలవు దయ చేయరా!' అని ప్రార్థించెను. కాని యతఁడు వలనుకాదనెను.

ప్రేమ మిక్కిలి చెడ్డది. అది బలమైనది. అమృతమయ మైనది. అది యీశ్వరదత్తము. దాని స్వభావము మన కగమ్య గోచరము. అది త్రాళ్ళులేకయె బంధించును. త్రాటితోఁ గట్టిన బంధనముల నితరులు త్రెంపవచ్చును. కాని యీబంధ నములఁ ద్రెంపుటకుమాత్రము ప్రపంచమున నెవరికిని సాధ్య ముకాదు.

ఆ సుందరీమణుల విలాస దృక్కులాసుందరుల చెక్కుల పైకిఁబ్రాకి ముద్దుపెట్టుకొనుచుండెను. ఆ సుందరుల చూపులు నాపనినే కావించుచుండెను. వారొండొరులను విడువలేక విడి చిరి. దృష్టిపథమునుదాటునందాఁక చూచిరి. కన్నులనీరు నిం చుచుఁ బరస్పరము ప్రేమతో భాషించుకొనుచుఁ జనిరి.

---

# ముప్పదియవ ప్రకరణము

## దుష్టగ్రహకూటము

1565-వ సంవత్సరము ప్రవేశించెను. ఉత్తరమున నక్బరుత్కృష్ట సామ్రాజ్యస్థాపనకుఁ బునాదులు వేయుచుండెను. దక్షిణ హిందూదేశమెల్ల విజయనగరసామ్రాజ్యచ్ఛత్రము క్రింద సౌఖ్యమనుభవించుచుండెను. మధ్యభాగమును బేదరు అహమ్మదనగరు గోల్కొండ బీజపూరు నవాబులు పాలించుచుండిరి. కాని దేశమెల్ల సంక్షోభించుచుండెను. రాజపుత్రులు విజృంభించి యనన్య సామాన్యపరాక్రమ ప్రతాపములచే శత్రుకులవిధ్వంసనము కావించుచుండిరి. మహమ్మదీయులు రాష్ట్రస్థాపనులకై ప్రయత్నించుచుండిరి. హిందువులు స్వాతంత్ర్యాభిలాషచేఁ బ్రాణములను విడువ సంసిద్ధులైయుండిరి. హిందూదేశమునం దెల్లెడలఁబౌరుషము, స్వాతంత్ర్యాభిలాష, ప్రతాపము, పరాక్రమము, శౌర్యము, దేశాభిమానము, మొదలగు గుణములు విస్తరించి సామ్రాజ్యముల నెల్లఁ గదల్చివైచుచుండెను.

ద్రోణానది కృష్ణాతరంగిణి కుపనది. కృష్ణా ద్రోణా సంగమమునకు సమీపమున సుప్రసిద్ధమగు తలికోటకలదు.

గోల్కొండ, అహమ్మదునగరు, బేదరు, బీజపూరు నవాబులు పరస్పరము ప్రోత్సాహపఱచుకొని రామరాజుతో మరల యుద్ధముచేయ నిశ్చయించి, పెద్దపెద్దసైన్యములం దీసికొని తమతమరాజ్యములనుండి బయలుదేరివచ్చి యిచ్చట విడిసిరి. ఆస్థలమునం గొప్పవిశాలమైన బయళ్లు కలవు. అవి యీసైన్యసముద్రములకు చాల వీలుగానుండెను. ఆ సైన్యములలోనున్న గుఱ్ఱములకును, ఇతర పశువులకును గావలసిన గడ్డియెల్లనచ్చటకుం జుట్టునున్న ప్రదేశములలో దొరకుచుండెను. పెక్కుమైళ్లవఱకుం దెల్లని శిబిరములతో నిండియుండెను. ఆ శిబిరములమధ్య విశాలములైన బజారులుండెను. ఒక్కొక్కపెద్ద బజారునకును, మఱియొక బజారునకును మధ్యనున్న శిబిరముల లోనిభటులెల్లరు నొక సైన్యాధ్యక్షు నధీనమున నుండిరి. అట్టి బజారులు వేలకొలందిగా నుండెను. కొందఱుద్యోగస్థులెప్పుడును, ఆసైనికులను వారిపై అధ్యక్షులను గనిపెట్టుకొని అప్పుడప్పుడువచ్చి పరీక్షించుచుండిరి. మధ్యప్రదేశముల నంగళ్లుంచిరి. ఇట్లా ప్రదేశమంతయు నూతనముగాం గట్టంబడిన యొక గొప్పపట్టణమువలె నుండెను.

ఆ శిబిరముల మధ్యభాగమున, అత్యున్నతములును, అతి మనోహరములును, అయిన గుడారములుండెను. అవి విశుభ్రకాంతులచేం దళదళ మెఱయుచుండెను. లోనంబ్రవేశించి చూచువారి కవి గుడారములవలెం గన్పట్టవు. వానిలో

విశాలములగు సభామందిర స్థానములును, పెద్దపెద్దగదులును కలవు. అవి నానాలంకార శోభితములై యుండెను. ప్రకృతి సౌందర్య సర్వస్వ నికేతనములైన యవనికలును, పట్టుచే నింపఁబడిన ముఖ్మల్ పరపులును, సుందరములయిన సోఫాలును గలవు. అవి నవాబుల మందిరములు. అట్టిదే అతి విశాలమైన గుడారమొక్కటి, ఈ సైన్యములకు మిక్కిలి దూరముగాఁ గృష్ణాస్రవంతీ సమీపమునం గట్టఁబడెను. దాని చుట్టును నాలుగైదు ప్రాకారము లుండెను. ఆప్రాకారముల చుట్టు వేలకొలఁది భటులు గావలి యుండిరి. దానికి వచ్చుటకు, ఆ సైన్యములోని భిన్నభిన్న స్థలములనుండి వచ్చు బాటలు పెక్కు గలవు. ఆ బాటలు మనోహరములుగా నుండెను. ఆ మందిరముయొక్క భూమి యెల్ల రత్నకంబళులతోను నానావిధములగు తీగెలును బూవులును జిత్రింపఁబడిన తివాసీలతోను, అలంకరింపఁబడియుండెను. మనోహరముగాఁ జిత్రింపఁబడిన చిత్రచిత్రములగు తెరలు పెక్కులుండెను. ఆ తెరలలోఁ జిత్రింపఁబడిన సుందరీమణులు జీవించిన వారివలెనే కన్పట్టుచు నుండిరి. అందలి కుడ్యములెల్ల రమ్యములగు విచిత్ర వస్తువులచే నలంకరింపఁబడి చిత్రవస్తు ప్రదర్శనశాలలోయన నొప్పుచుండెను. తన్మందిరోపరిభాగమెల్లఁ జాఁదినీలతో నొప్పుచుండెను. అవి పట్టువస్త్రములతో నిర్మింపఁబడి పెక్కువిధములయిన దీపములతో నొప్పుచుండెను.

ఒకనాఁటి రాత్రి తొమ్మిది గంటలాయెను. ఆ గుడారములో నొక విశాలమగు సుందర ప్రదేశమున నలుగురు పురుషులు నాల్గు పడకకుర్చీలపైఁ గూర్చుండియుండిరి. ఆ పడక కుర్చీలు పట్టుపఱుపులచే శోభిల్లుచుండెను. అవి సుందరతరములును, మృదులతరములునై యుండెను. ఆనాల్గుమూర్తులును తేజస్సమన్వితములై యుండెను. ఆ నల్గురు నాల్గురాష్ట్రములకు నవాబులు. ఒకఁడు గోల్కొండకు నవాబు. అతఁడు మనకుఁ బూర్వపరిచితుఁడే. అతనిపేరు కుతుబ్ శాహా. రెండవవాఁడు బేదరు దేశమునకు నవాబు. పేరు అలీబేరద్. మూఁడవవాఁడహమ్మద్‌నగరు రాజ్యమునకు నవాబు. అతఁడు బుర్హాన్ నిజాం శాహా. నాలవవాఁడు మనవిజాపురము నవాబయిన ఆదిల్శాహా.

ఇతఁడిట్లనెను. 'ప్రసిద్ధులయిన ఆంధ్రవీరులతో మనము పోరాడఁజాలము. తంత్రముల మూలమునంగాక కేవలము యుద్ధము మూలమున వారిం జయించుట మిక్కిలి కష్టము. ఆంధ్ర వీరుల పరాక్రమము, శౌర్యము, వర్ణనాతీతము. లోకప్రసిద్ధము. యుద్ధమునకుం బ్రవేశించినప్పుడు వారికిఁ బ్రపంచము తెలియదు. తమ్ముతాము మఱచెదరు. శత్రువులంబట్టి యూఁచకోఁత కోయుటకంటె మఱి వారి కన్యము తెలియదు. భార్యలను బిడ్డలను వారు తలంపనే తలంపరు. ఆత్మదేశ సంరక్షణమే వారిప్రాణము. దేశసేవయే వారి పరమధర్మము. అట్టి వీరులతో మనమెదిర్చి జయమందుట దుస్తరము. ఒకవేళ

కల్గినను మన సైన్యములు సర్వనాశము పొందకపూర్వ మది సిద్ధింపదు. కనుక మనము వారిని మోసముచేతనే జయింప వలయును. అప్పుడు మనసైన్యము విశేషించి నష్టముకాదు. శత్రువులను నాశముచేయవచ్చును. శత్రువులను, కాఫరులను జంపునప్పుడిట్టి మోసములుచేయుట శాస్త్రసమ్మతమే. దీనినే మన పెద్దలు పెక్కు యుద్ధములలో ననుష్ఠించి యున్నారు.'

'అవును. మీరన్నదంతయు సత్యము. వారిశౌర్యమును, పరాక్రమమును వినుటమాత్రమే కాదు, కనియుంటిని. నారాజ్యములోని ఘూర్జపురము, సాగిల్లు దుర్గములను స్వాధీనము చేసికొనునప్పుడు వారుచూపించినసాహసము, పరాక్రమము వర్ణింప నలవికాదు. తమరన్నదంతయు సత్యము. వారుయుద్ధముచేయుచున్నప్పుడా సామర్థ్యము, ప్రభావమును చూడవలసినదేగాని వర్ణింపరాదు. నరసింగరాయనియుద్ధమునందు మనసైనికులు వారికి రెండుదెబ్బలను 'గొల్లజాతులు' అని గోల్కొండ నవాబు మెల్లగాఁజెప్పెను.

'సత్యమే. నేనెఱుంగుదును. అందరి కమ్మసేనానుల పరాక్రమము చూచినను, వెలమవీరుల యత్యద్భుత సాహసముంజూచినను, రెడ్డియోధుల శక్తి పరిశీలించినను గుండెలు పగిలి పోవును' అని అహమ్మదనగరు నవాబు వాక్రుచ్చెను.

'ఏదేనొక వెఱవు యోచించి శత్రువులను వంచించుట నాకును సమ్మతమే. అందుకేమి యుపాయముంజింతింప

యుంటిరేని సెలవిండు. శత్రువులు పరాక్రమమున మించిన పుడు యుక్తిచే జయించుట రాజులకు ధర్మమే. కమ్మవారు, వెలమలు, రెడ్లు మాత్రమేగాక ఆ దేశమున వీరవతంసములు పెక్కులుగలరు. కాపులు రాజులు వారికిదీసిపోరు. కావున శ్రీ ఆదిల్షాహాగారు సెలవిచ్చినయట్లువారి నితరోపాయము లరసి యే యోడింపవలయును. కాఫరులనెట్లుచంపినను మనకు దోష ములేదు. అందును, ఈ దుర్మార్గులు మనకుఁబెక్కపాయము లను గష్టములనుఁ గలుగఁజేసియున్నారు. మసీదులను మన్ను చేసినారు. మతమును మారణము చేసినారు. కనుక, ఇట్టివారి నెట్లు విధ్వంసముచేసినను దైవము మెచ్చును.

గోల్కొండ:-ప్రస్తుతము కృష్ణానదిని దాటుటకు మనకు వీలు లేకుండఁజేసినారు. దాటుటకుఁ గావలసిన సామగ్రిని, ఓడ లను పడవలను వారు వశముచేసికొన్నారు. మనకిఁక, ఆవలి వైపునకుంబోవుటకు వలనుపడదు.

బేదర్:-కాని దీనికి మనమొక యుపాయముం బన్నవచ్చును. మనసైన్యమునురెండు పెద్దభాగములుగను ఒక చిన్నభా గముగను విభజించి పెద్దభాగములను రెంటిని కృష్ణకు దూరముగా వారికిం గనంబడకుండ నుంచి మధ్యనుండు చిన్న భాగమును, నదిపొడవున నిటునటుంద్రిప్పిన వారును దానివెంటందిరుగుదురు. అప్పుడు రెండవపెద్దభాగముల నె కాయెకి కృష్ణకావలకుం బోవఁజేసినచో వారుపోయి పడు

కల్గినను మన సైన్యములు సర్వనాశము పొందకపూర్వ మది సిద్ధింపదు. కనుక మనము వారిని మోసముచేతనే జయింప వలయును. అప్పుడు మనపక్షము విశేషించి నష్టముకాదు. శత్రువులను నాశముచేయవచ్చును. శత్రువులను, కాఫరులను జంపునప్పు డిట్టి మోసములుచేయుట శాస్త్రసమ్మతమే. దీనినే మన పెద్దలు పెక్కు యుద్ధములలో ననుష్ఠించి యున్నారు.'

'అవును. మీరన్న దెంతయు సత్యము. వారిశౌర్యమును, పరాక్రమమును వినుటమాత్రమే కాదు, కనియుంటిని. నారా జ్యములోని ఘూర్జాపురము, పానగల్లు దుర్గములను స్వాధీనము చేసికొనునప్పుడు వారుచూపించినసాహసము, పరాక్రమము వర్ణింప నలవికాదు. తమరన్న దెంతయు సత్యము. వారుయుద్ధ ముచేయుచున్నప్పు డా సామర్థ్యము,విజృంభణము చూడవలసి నదేగాని వర్ణింపరాదు. సరియైనయుద్ధమున మనసైనికులు వారికి రెండు రెట్లున్నను గెల్వఁజాలరు' అని గోల్కొండ నవాబు మెల్లగాఁజెప్పెను.

'సత్యమే. నేనెఱుంగుదును. అందలి కమ్మసేనా నుల పరాక్రమము చూచినను, వెలమవీరుల యత్యద్భుత సాహస ముంజూచినను, రెడ్డియోధులశక్తి వీక్షించినను గుండెలు పగిలి పోవును' అని అహమ్మదనగరు నవాబు వాక్రుచ్చెను.

'ఏదే నొక వెఱవు యోజించి శత్రువులను వంచించుట నాకును సమ్మతమే. అందు కేమేని యుపాయముంజింతించి

యుంటిరేని సెలవిండు. శత్రువులు పరాక్రమమున మించిన పుడు యుక్తిచే జయించుట రాజులకు ధర్మమే. కమ్మవారు, వెలమలు, రెడ్లు మాత్రమేగాక ఆదేశమున వీరవతంసములు పెక్కులుగలరు. కాపులు రాజులు వారికిదీసిపోరు. కావున శ్రీ ఆదిల్శాహాగారు సెలవిచ్చినయట్లువారి నితరోపాయము లరసి య్యే యోడింపవలయును. కాఫరులనెట్లుచంపినను మనకు దోషములేదు. అందును, ఈ దుర్మార్గులు మనకుఁబెక్కుపాయములను గష్టములనుఁ గలుగఁజేసియున్నారు. మసీదులను మన్ను చేసినారు. మతమును మారణము చేసినారు. కనుక, ఇట్టివారి నెట్లు విధ్వంసముచేసినను దైవము మెచ్చును.

గోల్కొండ :-ప్రస్తుతము కృష్ణానదిని దాటుటకు మనకు వీలు లేకుండఁజేసినారు. దాటుటకుఁ గావలసిన సామగ్రిని, ఓడలను పడవలను వారు వశముచేసికొన్నారు. మనకిఁక, ఆవలివైపునకుంబోవుటకు వలనుపడదు.

బేదర్:-కాని దీనికి మనమొక యుపాయముం బన్నవచ్చును. మనసైన్యమునురెండు పెద్దభాగములుగను ఒక చిన్నభాగముగను విభజించి పెద్దభాగములను రెంటిని కృష్ణకు దూరముగా వారికిం గనంబడకుండ నుంచి మధ్యనుండు చిన్న భాగమును, నదిపొడవున నిటునటుంద్రిప్పిన వారును దానివెంటందిరుగుదురు. అప్పుడు రెండవపెద్దభాగముల నెకాయెకి కృష్ణకావలకుం బోవఁజేసినచో వారుపోయి పడు

దురు. ఇది కొంతవరకును ప్రయోజనకారియని తోఁచు చున్నది.

అహమ్మద్:- ఆఁ! మంచి యుపాయము. మిక్కిలి యుక్తము గానేయున్నది.

గోల్కొండ:- తమ యుపాయము బాగుగనే యున్నది. కాని వారుకూడ మనవలెనే తమసైన్యమును మూఁడుగనో నాలుగనో చేసి మనలను వెంబడించిన?

బేదర్:-సాహసమునను బరాక్రమమునను వారు మనలను మించినను యోచనలో మనలను మించలేరు. ఇట్టి యోచనలు వారికిఁ దోఁచవు. పైగా వారికిపుడొక గర్వముకూడ గలదు. గతయుద్ధములలో నెచటను, ఎప్పుడును వారికి పరాభవము సంభవించినదికాదు. అందుచేత వారి కెన్నటికిని పరాభవము, అపజయము కలుగదని వారి నమ్మకము. ఆ యుద్దేశముచే వారిట్టియుక్తులకు దిగరు.

గోల్కొండ:-నిజమే. తెలివిలో వారు మనలకు జంకుదురు. మనపాటి యోజనాసమర్థత వారికి లేదు.

అహమ్మద్:-అట్లనుచున్నారేమి? వారికి బాపనయ్యలు లేరా? మూఁడులోకాలు మ్రింగివేయుట కొక్కబ్రాహ్మణుఁడు చాలు. తదితరులలోఁగూడ వారికిందీసిపోనివారు చాల మందిగలరు. ఏది యెట్లున్నను, ఆ యుపాయము మిక్కిలి మంచిది. మీరు చెప్పినట్లు చేసి చూచుట యుక్తమే.

ఆదిల్ :-మీరు చెప్పిన యీ యుక్తి సంస్తవనీయమే. కాని మొదట ఈ యుద్ధచతురంగమునకు వేఱొక యెత్తువేసి చూడవలయును.

అహమ్మద్:-అదియేదో సెలవియ్యండి.

ఆదిల్:-మనము మొట్టమొదట నొక టక్కుచేయుదము. మన సైన్యములను పైకి యుద్ధమునకా యత్తము కానట్లు నటింపించుచు లోన సర్వసన్నద్ధులమైయుండుచు రామరాజున కొక రాయబారి నిట్లు చెప్పుట కంపుదము. 'చక్రవర్తులైన తమసైన్యముంజూచి నవాబులు భయపడినారు. కావున వారియందు దయయుంచి సంధి కొడంబడుఁడు' అతనికి స్వాభావికముగా నమ్మకము విస్తారము. అదియునుంగాక స్వశక్తియందతనికి విశ్వాసము మెండు.

బేదర్:-బ్రాహ్మణులన్న జ్ఞప్తికివచ్చినది. అతనిదగ్గఱ విశ్వవిఖ్యాతింగాంచిన బుద్ధిసాగరుఁ డను మంత్రియున్నాఁడట. అతఁడు మేధానిధియనియు, అత్యద్భుత శక్తిమంతుఁడనియు, యుక్తిసందోహములకును దంత్రములకు నివాసస్థానమనియు వింటిని. అట్టివాఁడీ తంత్రములను సాగనిచ్చునా?

గోల్కొండ:- అతఁడిపుడు లేఁడు లెండు. అతఁడే యున్నచో మనతంత్రముల సాగనిచ్చునా?

అహమ్మదు:-అతఁ డేమైనాఁడు ? అట్టి మంత్రినేల రామరాజు విడిచెను ?

ఆదిల్ శాహా:- తంత్రములు కల్పించి రామరాజునకును, అతనికిని విరోధముకల్గించితిమి. రామరాజవి నమ్మి యతనిం జెఱసాలలోనుంచినాఁడు. పిదపఁజంపుటకుఁ బ్రయత్నము చేసితిమి. కాని సాగినదికాదు. అయినను, అతఁడిప్పు డిచ్చట లేఁడు. ఢిల్లీకిఁబోయినట్లు తెలియవచ్చినది.

గోల్కొండ:- అతని జాడ తెలిసినదికాదు. అతఁడు ఢిల్లీకేల పోయియుండెనో ?

ఆదిల్:-ఉద్యోగమునకు పోయియుండును.

బీదర్:-అంతేనా? ఢిల్లీశ్వరుని సాయమడుగుటకా ?

ఆదిల్ :-కాఫరులకు వారు సాయముచేయరు. అతనింబట్టి ఖయిదువేయించునట్లు నేను జేసెదను.

బీదర్:-ప్రస్తుతమున్న మంత్రి యెవరు ?

గోల్కొండ:-ప్రస్తుతమున్న వాఁడు మనవాఁడే. మనయాటలు సాగుటకు నదియే కారణము. అట్టిసాహాయ్యమే లేకయున్నచో మనము నల్గురముకలసినను, ఈ యాంధ్రచక్రవర్తిని జయించుట దుర్ఘటము. అతనిపేరు చక్రధరుఁడు.

అహమ్మదు:- చక్రధరుఁడీ కుట్రలోఁజేరుటకుం గారణమేమి ? రామరాజు మంత్రులను మిక్కిలి మన్నించుననియు వారి

తో వైరమును వహింపఁడనియు వాఁడుక. మఱి యితనితో నేలకలహించెనో కారణము తెలియదా ?

ఆదిల్:-అతఁడు రాజవంశములోని వాఁడు. చిన్నప్పటి నుండియు రాజ్యాశ యతనికి విస్తారము. రామరాజు దయచేత మన్నించి యతనికి గొప్ప యుద్యోగములన్నియు నిచ్చి క్రమముగా మొన్ననే మంత్రిపదవి నొసంగెను. రాజ్యము నేల్లని సంపాదించుట యే కర్తవ్యమని తలంచువాఁడగుటచేతఁ దత్కాంక్ష నేఁ గల్పింప నిందుచేరినాఁడు.

బేదర్:-మీరుచేయు కార్యములు దూరదృష్టి సమన్వితములు. బలే! మంచిపనిచేసినారు. మీయందు రామరాజునకు మొన్నటివఱకు విశ్వాసము మెండు.

ఆదిల్:-అవును.

అహమ్మద్:-మీయుక్తి మంచిదే. కాని సంధిషరతులు మాటే మాలోచించినారు? మంత్రి మనవాఁడు గనుక ఇది పడవచ్చును.

బేదర్:-అతనికైన యుద్ధపుఖర్చులు మనమిచ్చునట్లు చెప్పవలయును. లేనియెడల, అతఁడు దీని మొగము చూడనే చూడఁడు.

అహమ్మద్:-యుద్ధపుఖర్చు రమారమి యతని కీ సరికెనిమిది తొమ్మిది కోట్లు యుండవచ్చును. అంతయు నిచ్చెదమన్నచో నమ్మఁడు.

గోల్కొండ:-ఆఁ! అంతవఱకుఁగాకున్నను, ఆ మహాసైన్యము లకు ఆఱేడు కోట్లైనను వ్యయమై యుండును.

ఆదిల్:-మనము మూఁడుకోట్లుచెప్పిన బాగుగానుండును. అతఁడధమ మైదుకోట్లనయినను అడుగక మానఁడు. ఇట్లనక ముందుగా హెచ్చుచెప్పిన నంతగా నతఁడు నమ్ముటకు వీలుండదు.

బేదర్:-సరే మూఁడుకోట్లు ధనము పైనఁ గొన్నిదుర్గములను గాని కొంతదేశమునుగాని యీయవలయును.

అహమ్మద్:- బీజపూరులోఁ గొంతభాగము నీయవలయును. అట్లయినచో రామరాజునకుఁ దృప్తిగానుండును.

గోల్కొండ:- గోల్కొండ బీజపూరులలో దక్షిణమున నున్న కొంతరాజ్యమును, కొన్నిదుర్గములను, ఇచ్చునట్లు చెప్పుదము.

ఆదిల్:- అవు నిదియుక్తమే. కాని మఱియొకటి మనమడుగవలయును. జగన్మోహినిని తిరిగి శ్రీగోల్కొండ నవాబుగారి కొప్పగించుటకుం గోరవలయును. ఇదివారికిం గష్టముగా నుండునని మనమెఱుంగుదుము. కాని ఇట్టిషరతు లేకున్నచో, అంత బాగుండదు.

గోల్కొండ నవాబుహృదయమునఁ గల్లుమనియెను. ఆ సుందరీమణి పేరుచెప్పగనే యతనికి సహజమగు నుత్సుకత

జనించెను. ఆమెపోక కతఁడు చింతించినచింతకు మేరలేదు. నిద్రించినను, మేల్కొన్నను, మాట్లాడుచున్నను, లేచుచున్నను, చూచుచున్నను, ఆ సుందరి యతనికి ప్రత్యక్షమగుచుండును.

అహమ్మద్:- అవు నిది యత్యంతావశ్యకమగు నంశము.

గోల్కొండ:- దీనివలనఁ బ్రకృతము చెడునేమో! ఆంధ్రులు పౌరుషప్రధానులు. ఈ మాటవిన్నచో సంధిగింధి విడచి మీఁదఁబడుదురు. పైనం జింతించినఁ బ్రయోజనముండదు. అల్లాదయవలన మనకు జయముగల్గినపుడు విజయనగర పరిపూర్ణలక్ష్మితోఁగూడ జగన్మోహిని మనకు దొరకును. కావునఁ బ్రకృతభంగము చేయునట్టి దానికి మనము పోవకుండుటే యుక్తము.

ఆదిల్ శాహా కీ వాక్యము లమృతోపమానములు. అతఁడు కోరిన దట్టిప్రత్యుత్తరమునే.

బేదర్:-వారి కిట్టికోపము కల్గుటయు, కార్యవిఘాతుక జనించుటయు సత్యమే. అయినను ఇది యత్యంతావశ్యకము గదా ?

ఆదిల్:-ఒకవేళ నట్లుకావచ్చును. కాని—మీ యిష్టము.

గోల్కొ:-నాకు దాని నిందుఁ జేర్పకుండుటయే యిష్టము. ఆ మాట విన్నంతనే ఆవీరులకుం గోపము జనించును. అం

దుచే సంధి నాశమగును. మనయందఱ లాభముకొఱకును విజయనగరసామ్రాజ్య వినాశముకొఱకును నేనీ మాత్రము సహింపఁజాలనా? పిదప విజయము మనకుఁ జేకూరుటయు నాపె సిద్ధించుటయు నెట్లనికలదు. విజయము శత్రువుల దైనచో, ఆపె మనకెట్లును సిద్ధింపదు. మనకు వినాశము తప్పదు. ఇంతలో మనమింత త్వరపడు టుచితముకాదు. కావున దీనిని మనము వదలుకొంటయే మంచిది. నాకా సందేహములేదు.

బేదర్ నవాబునకును, అహమ్మద్‌నగరు నవాబునకును, ఇది సమ్మతమే. ఏలయన? జగన్మోహినిం గోరినయెడల శత్రుసమూహదుర్భరమయిన యాంధ్రజాతీయ ప్రతాపవహ్ని మరల నొకపరి విజృంభించి తమ్ముకాల్చివేయునని వారెఱుంగుదురుకాన వారు మఱిమాట్లాడలేదు.

ఆదిల్:-అది తమ చిత్తము.

గోల్కొండ:-నాకా ప్రమేయ మెత్తకుండుటే యిష్టము.

బేదర్:-సరే. వారట్లు స్పష్టముగాఁ జెప్పుచున్నపుడు మనము వేఱొకవిధముగా నుండఁదగదు.

ఆదిల్:-మీాయిష్టమే యనుసరింతము.

అహమ్మద్:-మనకు గుఱ్ఱములు తక్కువ. ఇది వారెఱుంగుదురు. అవి మనము కోరవలయును. ౧౫౦౦౦ గుఱ్ఱములు కోరినంజాలును.

గోల్కొండ:-మంచి సంగతి. అది అడుగవలసినదే.

బేదర్:-ఏనుగులుకూడ నయిదువందలు కోరుదము.

అహమ్మద్:-మఱియొక యంశముకూడ నున్నది. మనరాయబారులకు సరియైన గౌరవముచేయుట. ఇదివఱకు వారు రామరాజుముం దాయనయిష్టములేకుండ గుఱ్ఱములపైన నెక్కఁగూడదని యనుమతింజేసినాఁడట! దాని నిప్పుడు కొట్టివేయుటకుఁ గోరవలయును. మఱియు నతని సభామండపమున మన తురకరాయబారులను నిల్వఁబడు నట్లతఁడు చేయకుండుటకును, అతని రాయబారులను మనము గౌరవించునట్లు వారిని గౌరవించుటకును, తగు నాసనము నొసంగుటకును మన మిందు షరతు నుంచవలయును.

ఆదిల్:-ఇది ముఖ్యమైన వానిలో నొకటి. మఱి ముఖ్యాంశము లేమేనిగలవేమో ఆలోచింపుఁడు.

బేదర్:-మఱి ముఖ్యాంశములున్నట్లు తోఁచుటలేదు. ఇవి చాలునులెండు. నిజముసంధియైనఁ బెక్కుషరతులు గావలయును గాని వట్టిదానికిన్నేల? అయినను, ఇదివఱకే కావలసిన వన్నియు వచ్చినవి.

అహమ్మద్:-సరేకాని శత్రుపక్షము వారిసైన్యమంతయు నెంతయున్నదో సరిగా నెవరైన నిపుడు చెప్పఁగలరా?

గోల్కొండ:-ఆఁ! సిద్ధముగానే యున్నది. చక్రధరుని దగ్గఱ నుండి సర్వము వ్రాసిన కాగితము వచ్చినది.

అని యాకాగితముందీయ జేబులోఁ జేయి యుంచెను.

ఆదిల్:-కాగితమేల? ముఖ్యమైనవి నేను చెప్పెదను వినండి. కాల్బలమూఱులక్షలు. అశ్వములుమొత్తము లక్ష. ఏనుఁగులు మూఁడువేల యయిదువందలు. ఈ కాల్బలము తద్ధితర బలములతోఁగూడ మూఁడు భాగములక్రింద విభజింపఁబడి నది. ఒకభాగము రామరాజు క్రిందను, మఱియొకటి తమ్ముఁడైన తిరుమలరాయని క్రిందను, ఉంపఁబడినవి. వీరు ముగ్గురు సర్వసైన్యములకు నధ్యక్షులు.

గోల్కొండ నవాబింతలో కాగితముం దీసెను.

గోల్కొండ:-అవును. ఆ మూవుర క్రిందను పదునైదుగురు ప్రధాన సైన్యాధిపతులును, వారిక్రింద తొంబది యేడు గురు సైన్యాధిపతులును గలరు. వారు తమ క్రిందనున్న నాల్గువందల ముప్పదిమంది యుపసేనాపతులను జూచుచుం దురు. యుద్ధమునందు పరాజయమన్నమాట యెఱుంగక వేయికండ్లతోను బదివేల హస్తములతోను పోరాడుచు బలముతో సమానముగా బుద్ధిబలముంగూడ నుపయో గింపఁజాలిన మహాయోధులు ముప్పది యార్గురు కలరు. వారికిం గొంచెము జంకువా రయిదువందలు కలరు. పౌ రుష ప్రధానములయిన యుత్తమ వంశములంబుట్టి దేశసేవ

చేయుచు, ఆత్మదేశ సంరక్షణమే తమ జన్మవ్రతముగా భావించి తద్రక్షణకొఱకు సర్వస్వమును జయించిన యోధులు పెక్కువేలమంది కలరు.

అహమ్మద్:-మన పక్షమున నెవరి కెవరి కెన్నెన్ని సైన్యము లున్నవో యొకపరి సెలవిండు.

ఆదిల్:-మొదట నేను జెప్పెదను. మా కాల్బలమంతయు మూఁడులక్షలపదునైదువేలు. గుఱ్ఱములు పదునెన్మిదివేలు. సైన్యమంతయు మూఁడు భాగములుగాఁజేసితిని. అధ్యక్షులు, వారిక్రింద సైన్యాధిపులు, వారిక్రింద నుపసైన్యాధిపులు, ఇట్లు విభజించితిని. ఏనుగ లేడువందలు.

బేదర్:- గోల్కొండవారు చెప్పండు.

గోల్కొండ:-అహమ్మద్ నగరువారిది కానిండు.

అహమ్మద్:- మీరు చెప్పండు.

గోల్కొండ:-కాల్బలము మూఁడులక్షలు. గుఱ్ఱము లిరువది రెండువేలు. ఏనుగ లాఱువందలు.

అహమ్మద్:- మా కాల్బలము మూఁడులక్షలు. గుఱ్ఱములు ముప్పదివేలు. ఏనుగ లేడువందల యేబది.

బేదర్:- మా కాల్బలము రెండులక్షల యిరువదియైదు వేలు. గుఱ్ఱము లిరువదివేలు. ఏనుగులు మూఁడువందల యేబది. మా గుఱ్ఱములు శ్రేష్ఠములైనవి కావు.

ఆదిల్ :-గుఱ్ఱములు మనవన్నియుఁ గొంచెమించుమించుగా నొక్క టే విధమైనవి. రామరాజు గుఱ్ఱములతోఁ బోల్పఁదగినవి కావు. అవి యతి శ్రేష్ఠములు. విదేశములనుండి తెప్పించినారు.

అహమ్మద్ :-అవును. అశ్వశాస్త్రమును జదివిన పండితులాంధ్రులలోఁ జాలమందియున్నారు. రామరాజుకూడ ఆ శాస్త్రములోఁ గొప్ప పండితుఁడని విఖ్యాతింగాంచి యున్నాఁడు.

బేదర్ :- మనసైన్యమంతయుం గలిసి మొత్తము పదునొకండు లక్షల నలుబదివేలు. గుఱ్ఱములు తొంబదివేలు. ఏనుగ లిరువదినాల్గువందలు. గుఱ్ఱములలోను, ఏనుగలలోను మనము కొంచెము తక్కువైనను కాల్బలములో మనమే చాల హెచ్చు. సుమారు మనకాల్బలము వారికాల్బలమునకు రెట్టింపున్నది.

ఆదిల్ :-కాని మనకాల్బల మా కాల్బలముతోఁ బోల్పఁదగినది కాదు.

బేదర్ :-అది నిశ్చయమే.

ఆదిల్ :- అందుచేతనే రాయబారిని రేపే పంపి లోలోపల మన పనిని మనముచేయుచుండుట యుక్తము. అల్లా దయవలన మనమే గెలువ వచ్చును. మనకు ఫిరంగు లేడెన్మిది వందలు కలవు. వారికన్ని లేవు.

గోల్కొండ:-యుద్ధముకంటె మోసము చులకనగా మనకు జయమిచ్చును. యుద్ధమునకు విజయము దుర్లభముకాని మోసమునకు దుర్లభముకాదు.

అహమ్మద్:- సరే. రేపుదయమే నిశ్చితాంశమున కుపక్రమించుదము.

అందఱును నల్దిక్కులు పరికించిచూచిరి. అప్పటి కప్పుడే రెండు జాములకు మీరినట్లు వారికిందోఁచెను.

---

# ముప్పదియొకటవప్రకరణము

రాయబారము

విజయనగర చక్రవర్తియొక్క మహాసైన్య సముద్రము విజయనగరము నుండివచ్చి కృష్ణకీవలవైపున తలికోటలో నున్న మహమ్మదీయసైన్యముల కెదురుగా విడిసెను.

నవాబులందఱుంగలిసి రాయబారి నంపిరి. ఆరాత్రి రామరాజ వెంకటాద్రియ తిరుమలరాయ చక్రధరులు నల్వురు నొకగుడారమునగూడి యిట్లాలోచింపఁదొడంగిరి.

చక్ర:- శత్రువులు మనయోధుల శౌర్య పరాక్రమాదులం దెలిసికొని భయంపడియుందురు.

తిరు:-దొంగతనముగావచ్చి యూళ్ళను దోఁచుకొనుటకును, గ్రామములను తగులఁబెట్టుటకును, హిందూసాధువులం బాధించుటకును దక్క ఆతురుష్కులెందుకు పనికివత్తురు!

వేంక:-హిందూదేశమును మోసముచేతనేకదా వారు జయించినది. లేకపోయిన మఱియొక విధముగా నన్యదుర్లభ పరాక్రమ నిధులయిన యార్యులు వంచింపఁబడుదురా?

రామ:- కాకయున్నచో వేయిజన్మములెత్తినను శత్రుహారిణ హారణదక్షుంబయిన పృథ్వీరాజసింహంబును గోరీ జయింపఁ

గలఁడా? మహమ్మదీయులు పట్టికుయుక్తిపరులు. దానిచేతనే వారిట్టి విజయములం గాంచుచున్నారు. నిశ్చయముగాఁ దలపోసిచూచినపక్షమున నే యుద్ధమున వారు న్యాయముగా పోరి గెల్చినారు? వ్రేలుమడచి లెక్కించుఁడొక్కఁడేని కలదేమో?

మానవులలోఁ జాలమందికడ నొకవింతయిన స్వభావమున్నది. ఆ గుణముకలవారికది స్ఫురింపదు. దానినే ఆత్మశక్తి విశ్వాస మనవచ్చును. అట్టి విశ్వాసముకలవాఁడు తనకే విధమైన యపజయమునుగల్గునని నమ్మడు. ఎట్టి వ్యవహారమునందును శంకింపఁడు. ప్రతివిషయమునను దనకే జయము సిద్ధమనియు, పరాజయముతనకుఁగలలోఁగూడఁ గలుగదనియు నతఁడు త్రికరణశుద్ధిగా నమ్మును. ఈవిశ్వాసముచేతనే కర్ణుఁడు తానెన్నిసారులోడినను అర్జునుని జయింపఁగల్గుదుననియే నమ్మెను. అత్యంతతీవ్రమగు ఫాల్గుని తీక్ష్ణప్రహారమతని శిరమును ద్రుంచువఱకు నతఁడా నమ్మకమునువీడలేదు. ప్రపంచమున నమ్మిచెడినవారిచర్యలను వారుచదువుదురుగాక! పఠింతురుగాక! వల్లింతురుగాక! దానిని మాత్రము స్వవిషయమునకు సంబంధింపఁజేయరు. రారాజు దుర్యోధనుఁడీ యాత్మశక్తివిశ్వాసవశుఁడగుటం జేసియే, భీష్ముఁడు పడినను ద్రోణుఁడీల్గినను చతురంగ బలములు హతమగుచున్నను, కాల్బలములు కాలిపోవుచున్నను, యుద్ధమును విడిచినవాఁడుకాఁడు. రావణునకును, అందుచేతనే,

ఇంద్రజిత్తుగతించినను, విభీషణుఁడు శత్రుపక్షము నవలంబించినను, లవమేని చలనము కల్గినదికాదు. ఇట్టిగుణమే హిందూదేశమునందలి పెక్కుసామ్రాజ్యములను, రాజ్యములను నాశముచేసినది. ఆత్మశక్తివిశ్వాసపరులకు గర్వము, నిర్లక్ష్యభావము సహజగుణములు. అవియే వారికి విషముగాఁ బరిణమించుచుండును. కాని, కాలమాసన్నమగునందాఁక వారు దానింగ్రహింపఁజాలరు. ఆవిశ్వాసమే గర్వవిరహితమై దూరదృష్టిసమేతమైనపుడు ఫలప్రదమగును. అది మనుజులకు సర్వసిద్ధినొసంగును.

చక్ర:-ప్రకృతము షరతులలో ధనమిచ్చుట మిక్కిలి తక్కువగా నున్నది. మనకింతవఱకైన యుద్ధవ్యయ మాఱుకోట్ల డెబ్బదియయిదు లక్షలు. పోనిమ్ము, రాజ్యమేని కొంత యిత్తురన్న నది చాలకొంచెము. ఆ యిచ్చు ప్రదేశమంతయు నొకకోటి రూపాయలైనను జేయదు.

తిరు:-సంధియేల ? పైన మీయిష్టముకాని నాకు సంధి యిష్టములేదు. ఏమిసంధి ? తెగి పోరి శత్రురాజులంద్రుంచి యీ తురుష్కరాష్ట్ర చతుష్టయమును మన విజయనగర సామ్రాజ్యమునం గల్పుకొంటయే నాకభిమతము.

వేంక:- అన్నగారూ! నిజమండి. ప్రధనభూమియందు విజృంభించిన కంఠీరవంబులోయన, తురుష్కహరిణచయంబలనుబట్టి చెఱకుఁగట్టలను నఱికినట్లు నఱుక నెంతయుఁ గా

క్షించుచున్న మనన్సైనికులకుందగిన సమయంబుచిక్కినది. ఇట్టి సమయంబును వృథాపోనిచ్చుట మంచిదికాదు. సామ్రాజ్య రక్షణకై సర్వస్వమును, ఈయ సిద్ధముగా నున్న మనవీరవరుల పరాక్రమ సంపదనొకపరి రుచిచూచినంగాని తురుష్కకులపాంసనులు భయంపడి మనను గన్నెత్తి చూచుట కేని వెఱవరు.

చక్రధరునకుఁ దిరుమలరాయ వేంకటాద్రుల స్వభావములు తెలియును. ప్రస్తుతము సంధితంత్రము సరిగా నడవకున్నచో అతనికిం గష్టము. విజయనగర సామ్రాజ్యసైన్యములను మోసపుచ్చుట కంతగా వీలుండదు. అందుచేతఁ దిరుమలరాయ వేంకటాద్రివీరుల వచనము లతనికిం గర్ణకఠోరములై యుండెను. అతని ముఖ మిపుడు రామరాజ చక్రవర్తివంకఁ జూచుచుండెను. అతఁడిట్లనెను.

'సోదరులారా! సామ్రాజ్యకార్య నిర్వహణభారమును మీరువహించి యుండకపోవుటచే నట్లనుచున్నారుగాని యుద్ధము మాటలతో నగుకార్యముకాదు. మీరు మహాయోధులగుటచే మీకది రుచించును. కాని యుద్ధమున జయము మనకేయగునో వారికేయగునో మనముచెప్పఁజాలము. ఒకవేళ జయము మనకైయైనను మనము చెందునష్టమింతని వచింపఁగలమా? సంధియందన్ననో ఆభయము లేదుగదా? రాజకార్య నిర్వహణ చతురునకు సామ దాన భేదములు

వ్యర్థమైనప్పుడుగాని దండోపాయము నుపయోగింపంజనదు. ఒకవేళ జయమే సిద్ధించు ననుకొనుఁడు. అప్పుడు మాత్రము మనకు లాభము కల్గునని యా మీతలంపు? ఎందఱు సుందరీమణులు విధవలై పోవుదురు? ఎందఱు మహాయోధులు నశింతురు? ఎన్ని క్షామములు సంభవించును? ఎన్నియూళ్లకుఁ గష్టనష్టములు కల్గును? కావున నెన్నివిధములం జూచినను యుద్ధములకుంబోవుట మనకుఁ గార్యముకాదు'

ఆ యిరువురును మఱి మాట్లాడలేదు. కొంతసేపూరకుండిరి.

రామ:- అవును. అయిదుకోట్ల రూపాయిల నైనను కోరకున్నచో మనయుద్ధపు ఖర్చులు బొత్తుగాఁ జాలవు. ఇఁక దేశము మాటపేరేగాని వారు మనకిచ్చినదేలేదు. అది యంతయు నిదివఱకు మనచే జయింపఁబడినదే. జయింపఁబడిన రాజ్యమునే మరల మనకు నిత్తురఁట!

చక్రధ:-ఇందు రాచూరు పానగల్లు మొదలగు మనపూర్వ దుర్గములు మాత్రమే చేరియున్నవి. ఇవి యిదివఱకే మనక్రిందనున్నవి. వీరిత్తుమన్న ప్రదేశమునకంతటికిని గలిసి వత్సరమునకు నాల్గులక్షల రూపాయలేని శిస్తురాదు. అందు మూఁడువంతులు మనపూర్వపు ప్రదేశముల మీఁదనే వచ్చును. ఇఁక నొక లక్షరూపాయాలువచ్చు. దానినా వారిచ్చునది?

వేంక:-బహుశః వారిది మనకు దానము చేయుచున్నట్లు భావించుచున్నారు గాఁబోలు.

చక్ర:-అట్లేయున్నది.

రామ:-బీజపూరు గోల్కొండలనుండి చీల్చి గోవా, తలికోట, బీజపూరు, కోవిలకొండ, రాజుకొండ, కమ్మంమెట్టులవఱకు నున్న ఖండమును గోరిన సరిగానుండును.

చక్ర:-అవును.

తిరుమ:-మఱియొక అంశము జ్ఞప్తికి వచ్చినది. గోల్కొండ నవాబు కూతురు నూర్జహాను, మన ప్రధానసైన్యాధికారులలో నొకఁడయిన ప్రతాపసింగుని మోహించినది. ఆపెను మఱియొక తురుష్క యావనునికీయుట కామె తండ్రి యుద్యోగించు చున్నాఁడట. ఆమె నితనికిచ్చుటకును ఆమె కోరికను భంగము చేయకుండుటకును మనము కోర వలసియున్నది.

చక్ర:-అగునతఁడు విశ్వాసపాత్రుఁడగు వాఁడు. దేశహితైకాభిలాషి. అట్టివానికి సాయమును చేయవలసినదే. మఱి యదియునుంగాక తురుష్కుల కన్నియలను మనవారు మ్లేచ్ఛులనియు నంటినం బాపము వచ్చుననియుఁ దలంచి ఢిల్లీ పాదుషా లెందఱు తమకన్న కూతుండ్ర నీయ నుద్యమించినను, అంగీకరించిన వారుకారు. మనమిప్పుడే నూతన మార్గమును ద్రొక్కవలయును.

వేంక:-అవును. నూతన సంస్కరణలుచేసి హిందూ సామ్రాజ్యమును భిన్నభిన్నములయి శకలములుగాకుండ బంధించి యుంచవలసిన కాలము వచ్చినది. హిందువులు మహమ్మదీయులు పరస్పర విరోధముతో నున్నంతకాలము మన మెన్ని విధములం జింతించినను భరతఖండమున కవిచ్ఛిన్న మగు నేకజాతీయభావ ముత్పన్నము కాఁజాలదు.

రామ:-హిందువులయు మహమ్మదీయులయుఁ బరస్పర వైషమ్యముల మూలముననే హిందూదేశము దోపిడులకును, రక్తపాతములకును మూలమగుచున్నది. స్వభావ సిద్ధముగా హిందువులకుఁ బరమతద్వేషమును, వారిని హింసింపఁ జూచుటయు లేకున్నను మహమ్మదీయులంజూచి వీరుకూడ నేర్చుకొనుచున్నారు. గత యుద్ధములలో మన సైనికులధిపతుల యుపేక్షచేతఁ గొన్నియకార్యములను మహమ్మదీయులకుం గావించియున్నారు. అట్టివానిని నిరోధించుట మనకుం గర్తవ్యము.

ఆ యీ యంశము లన్నియు రేపు సభలోఁ జర్చించి మన సేనానాయకులయుఁ దదితర లోకముయొక్కయు నను మతిం గైకొందము.

---

# ముప్పదిరెండవ ప్రకరణము

## నూర్జహాను

స్వాభావికముగా వినిర్మలమై నీలకాంతులను గ్రమ్ము చుండు నాకసమిపుడు సంజయతిక్రమింపఁగా వ్యాపించుచున్న చీకట్లచే నల్లముఖ్ మల్ గుడ్డవలెఁ బ్రకాశించుచుండెను. కాలపుంజిత్రకారుఁ డాగామిరాజ హృదయ రంజనార్థంబు చిత్రించిన చిత్ర విచిత్ర కుసుమంబులోయన, ఆకసపుందివాసి యందు నక్షత్రములు మనోహరములై వెలయుచుండెను. ఇట్టియెడఁ దురకనవాబుల యుద్ధశిబిరములలో నొక్కయెడ నొకదివ్య సుందరి కూర్చుండియుండెను. ఆమె కూర్చుండి యున్న ఆ శిబిరము గోల్కొండనవాబు నంతఃపుర విహార మందిరము. ఆమె మొగము సౌందర్యవిలాసమునకును, సిరికిని దావు. ఆమె కనులు నల్లనై అతిమనోహరములై పొడవుగా నుండెను.

ఆమె దేనినో యోజించుచున్నట్లుండెను. ఆమెముఖము కృశించియుండెను. తనువును గృశించియుండెను. ఆమె ముఖ మునుండి వెచ్చని నిట్టూర్పు లప్పుడప్పుడు వచ్చుచుండెను. ఆమె కచ్చటఁ జీకాకుగా నుండినట్లుండెను. ఆమె వాల్గను

లను జాపల్య మలంకరించుచుండెను. ఆమె యిటు నటుఁ జూచుచుండెను. ఆసుందర విగ్రహ మెవరికొఱకో యెదురు చూచుచున్నట్లున్నది. ఆమె యే గోల్కొండ నవాబుకూతరు నూర్జహాను.

అంతలో నచ్చటికి మఱియొకసుందరి వచ్చెను. ఆమె చెలికత్తియ. ఆమె యందు నూర్జహానునకుం బ్రీతివిస్తారము. ఆమెయు నూర్జహానుం బ్రేమించెను. ఆమె తనశీతలహస్తమును నూర్జహాను కరమున నుంచి తాకి చూచెను. అది వెచ్చగా నుండెను. ఆమె యిట్లనెను.

చెలి:- అమ్మా! నూర్జహానూ! నీకీ జ్వరము ప్రతిదినము హెచ్చుచున్నది గాని తగ్గుటలేదు. ముఖపద్మము వాఁడినది. నానాటికి దేహము కృశించిపోవుచున్నది. కనులు లోనికింబోవుచున్నవి. నిన్నుజూచిన భయమెత్తుచున్నది. తండ్రిగారు నీమీఁది ప్రేమచేతనేకదా నిన్నువిడిచి రాలేక యుద్ధమునకు నిన్నుగూడఁ దీసికొనివచ్చినారు? నాకిది సామాన్యమగు జ్వరమువలెఁ దోఁచుటలేదు. జ్వరము నీకెన్నిసార్లు రాలేదు? ఒకటి రెండు దినములకంటె హెచ్చు దినము లుండునదికాదు. అదియునుంగాక నీ మన సెప్పుడును విచారమగ్నమై యేదో యాలోచించుచున్నట్లుండును. దానికిం గారణమేమి? మీతల్లిదండ్రు లనవరతముం జింతిలుచున్నారు. ఎంతమంది వైద్యు లెన్ని చికిత్సలంజేసి

నను వ్యాధి నానాఁటికి హెచ్చుచున్నది కాని తగ్గుటలేదు. ఇదియంతయుఁ జూడ నీకిది యేదేని చింతవలనం గల్గినదని తోఁచుచున్నది. వలయునేని ప్రాణములంగూడ నీ కొఱకీయ సిద్ధముగానున్న మావంటి చెలులకుఁ గారణమేమో నివేదింపరాదా? అడుగవలయునని చూచితినిగాని సమయము చిక్కినదికాదు. అంతయు నివేదింపుము. మావంటి చెలికత్తెలయెడ దాచినఁ బ్రయోజనము కలుగదు.

నల్లరేకుల చక్కందనము నెక సక్కెము లాడుచున్న యామెకన్నుల బాష్పములుగ్రమ్మెను. ముత్యములుధారగాఁ గురియుచున్నవోయన నవి బిందువులుగా భూమిమీఁదఁ బడుచుండెను. ఒక నిట్టూర్పు వెడలెను.

'చెలీ! నేను నీకడ నేమేని దాఁచి మెలఁగుదునా?'

'నేఁటివఱకును లేదు. కాని యిది యొకటిమాత్రము'

'అవును. నిశ్చయముగా నాకోర్కె చెప్పఁదగినదికాదు. అది చెప్పి ప్రయోజనములేదు. అది నాకీ జన్మమధ్యమునఁ దీరునదికాదు. రిత్తకోరికలంజెప్పి నిన్ను గష్టపఱచుటేలయని భావించి యూరకుంటిని'

'చెలీ! అట్లనకుము. నా యావచ్ఛక్తిని వినియోగించి చూచెదను. ప్రయత్నించినచో సాధ్యపడని దేదియులేదు. అంతచేతగాని దాననైన నీతోఁగూడ దుఃఖమును సమముగాఁ బళ్చుకొని యైన ననుభవింతును'

'వృథా నిన్నాయాసపెట్టి దుఃఖపెట్టుట నాకిష్టము లేదు. కాదు కూడదు గట్టిగాఁజెప్పుమన్నచోఁ జెప్పెదను'

'నీకు సందేహింపఁ బనిలేదు. వచింపుము. చెలికత్తెలకు సుఖదుఃఖములలోఁ బాలు వహింపకున్కి ధర్మముకాదు. నా యోపినంత సాయము నీకుఁజేసెదను. నావలనంగాక యున్నచోఁ బదంపడి విచారింతము'

కొంచెము సేపువఱకు నూర్జహాను మాట్లాడలేదు. ఆమె యేదియో యోజించుచుండెను. ఆమె ముఖమున మందహాస మస్ఫుటముగా నంకురించెను. అది విచారపరీవృతమై మంటిచేఁ గప్పఁబడిన మణివలె ప్రకాశించుచుండెను. ఎట్టకేలకా ముఖమునుండి ముత్యములు రాలఁజొచ్చెను.

'ఈ రిత్తకోరిక వెల్వరింపఁ దగినదికాదు. అయినను నీతోడ నెన్నియోసార్లు చెప్పవలెనని తలఁచియు మరల నిష్ప్రయోజనమని భావించి యూరకుంటిని. ఇపుడు నీవంటి చెలికత్తె యడుగఁగా దాఁచుటతగదు. నాఁడు మనమిరువురము గోల్కొండలో సరోవర స్నానముచేసి బహిస్స్నాథోపరిభాగమునుండి యిటునటు తిరుగుచుంటిమి. జ్ఞప్తియున్నదా?'

'ఆ! ఉన్నది. లేకేమి? నాఁడు తోఁడి యాడువారితోఁ జక్కఁగా నాడితిమి'

'అవును చెలీ! ఆనాఁటి సాయంకాలము-' ఊరకుండెను.

'ఏమి జరిగినది?'

'ఒక యుత్తమాశ్వమునెక్కి సర్వసౌందర్య మూర్తి యగు నొక రాజపుత్రుఁడా మార్గమున రాలేదా?'

'నాకా విషయమేమో అంతగా జ్ఞప్తిలో లేదు'

'జ్ఞప్తిలేకేమి! నీ విట్లనలేదా? 'ఆహా! చెలీ! చూచితివా యీ దివ్యసుందర విగ్రహమును? ఎంత మనోహరముగా నున్నది! కాని యది నిష్ప్రయోజనము సుమీ! అతఁడు హిందువుఁడైనాఁడు. తురుష్క యావనుఁడైన నెంత బాగుండును!'

'ఆఁ! స్మృతికివచ్చినది'

ఇరువురును గొంచెము సేపూరకుండిరి.

'అతనియందు నీ మనము లగ్నమైనదా యేమి?'

అవునని తలయూచెను.

'చెలీ! ఈ కోరిక నీకెట్లు లభ్యమౌను? అతఁడురాజకుమారుఁడుగదా? వారు తురుష్కులను ద్వేషింతురు. అతఁడు నీయందును నీవలెనే అనురక్తుఁ డయినంగదా నీకోర్కె సిద్ధించుట? సహజతురుష్కద్వేషియగు రాజపుత్రుఁడెట్లు నీయందు మక్కువ వహింపఁగలఁడు?'

'అది నేగ్రహించితిని. అతఁడు నాయందుఁ బ్రేమ వహింపకపోలేదు.'

'చెలీ! అయినను ఇది యెట్లు సిద్ధించును? మీరు మతాంతరులుగదా?'

'మతాంతరులైననేమి? మన తురుష్కులు కొందఱు రాజపుత్రాంగనలం బెండ్లియాడుట లేదా? నిన్న నేకదా అక్బరు రాజపుత్రస్త్రీని బెండ్లియాడినది? మనతురుష్క సేనాధిపతి పుత్రిక యొకతె రాజపుత్రుం బెండ్లియాడలేదా? మతము నకు కొద్దివారైననేమి? గొప్పవారైననేమి?'

'మీతండ్రిగారి కిది సమ్మతముకావలదా? నిన్ను మీ తండ్రిగారు సేనాధిపతియగు మీర్జకుం బెండ్లిచేయ నిశ్చయించు చున్నారు.'

'త్రికరణశుద్ధిగా నేనతనిని వలచితిని. మఱియొకని నెట్లు పెండ్లియాడుదును? స్త్రీలు మనోవాక్కాయ కర్మల నొకనినే వరింపవలయునని మనశాస్త్రములు చెప్పుటలేదా? మనసా నమ్మినవారిని విడిచి వేఱొకనిం జేపట్టుట యుత్తమ సాధ్వీ లక్షణమగునా?'

'స్త్రీలు స్వతంత్రురాండ్రుకారు. నీతండ్రియిష్టముకాని యొకని వరించుటకును, ఇంకొకని వరియింపకుండుటకును నీ యిష్టమేమున్నది? నీతండ్రి మీర్జకుం బెండ్లిచేయఁబూని యుం డఁగా ఆయన నాపూన్కినుండియెట్లుమరల్చి నీమనోరథమును సంపూర్తి చేసికొనఁగల్గుదువు?'

'నాకట్టిసంబంధము వలదని నానిశ్చితాభిప్రాయమును జనకునకు నివేదింతునా?'

'నీవు నివేదింతువే యనుకొమ్ము. అతఁడు దానికెన్నఁటికి నంగీకరింపఁడు. అప్పుడు నీవేమి చేయఁగలవు? ఇట్టియన న్యాభిప్రాయముంబూనినందుచే నీకుఁగల్గు లాభము సున్న. అది యెప్పటికిని నెరవేరదు. పైన జననీజనకులకుంగష్టము సంభవించును సుమీ!'

'ఎన్నికష్టములు వచ్చినను నానిశ్చితాభిప్రాయమును నేను వదలఁజాలను. ప్రాణములున్న నేనామహామహుని కరముంబట్టి సర్వసౌఖ్యముల నందఁగల్గుదును. లేనినాఁడుతృణమువలె నెంచి ప్రాణమును విసర్జింపనెంచితిని. అంతేకాని తదర్పితమగు నీతనువు నన్యుఁడెవఁడును తాకఁజాలఁడుసుమీ!'

ఆపెపొడవగు నల్లనికన్నులనుండి బాష్పములు స్రవింపఁ దొడంగెను. స్వరముమారెను. ఆమె మరల గద్గతికతో మెల్లఁగా నిట్లనెను.

'అయినను, నాకీజన్మ మధ్యమున తదీయసుకుమార కరస్పర్శభాగ్యముచేకూరదు. విచారనిలయమై, నిరంతరప్రస్రవద్బాష్పసమేత నేత్రయుగ్మమై నా యీజన్మమిట్లు కృశింపవలసినదే సుమీ!'

చెలికత్తెయు నామాట లాలకించెను. ఒడలు పులకించెను. ఆమెకును గనులనుండి వర్షధార లుపక్రమించెను. కాని యామె వానిని నివారించెను.

'పోనిమ్ము. నీతండ్రి యంగీకరించినను, అతఁడు నీకు లభించుననియు నీయం దతనికట్టి విశ్వాసముండుననియు మన ము విశ్వసించుటకుందగిన దృఢప్రమాణమేమి కలదు?'

'కలదు. అతఁడు నన్ను విశ్వసించును' అని తనవ్రేలి యుంగరముం జూపెను.

ఆమెతనువు పులకించెను. కను లానందద్యోతక స్వా నిమీలనముల నొనర్చుచుండెను. విలాసినీ విలాసవంతులకుఁ బరస్పర ప్రణయ యుక్తమైన ప్రథమ సమావేశముకంటె మఱి సంతోషములేదు. అది లజ్జాసమేతము. పరస్పర శరీరకంప సుకు మారము. మనోహరము! అత్యంత సుఖప్రదము. అది యా కోమలాంగుల కెన్నఁటికిని మఱపురాదు. చెలికత్తె చిఱు నగవు నవ్వెను.

చెలికత్తె నూర్జహాను భావముం జక్కఁగా గ్రహించెను. ఆమె తనహృత్స్థానమునుండి యొక చిత్రఫలకమును దీసి నూర్జహాను కరకమలమునం దుంచెను. ఆమెకట్లు చేయునప్పుడు చిఱునగవు దుర్నివార్యమై మొగమునఁ దోచుచుండెను. అమె గ్రహించెను. ప్రభాకరదర్శనమునఁ గమల ముకుళమువోలె నామె ముఖము ప్రఫుల్ల భావమును వహించెను. ఆమె మనో హరుని రూప మందుఁ జెక్కఁబడియుండెను.

కవులును చిత్రకారులును సమవ్యాపారముకలవారు. ఇరువురును మనోహర వస్తుసంచయములంజూచి లోకరంజ

నార్థము చక్కఁగాఁ జిత్రింతురు. కవులవలెనే చిత్రకారులును జిత్రించునప్పుడు స్వభావాతిశయోక్త్యలంకారముల సాయము వహింతురు. కాని యీచిత్తరువు సందతని దివ్యమూర్తి సంపూర్ణ సౌభాగ్యము అతిశయోక్తింజెందక యున్నను కొంచెంత నొందియుండలేదు.'

'అతఁడిపుడు విజయనగరసైన్యములలోఁ గృష్ణకావల ప్రక్కనుండును. పోయి తీసికొనివచ్చెదను. అందుకేమి చేయుమందువు?'

'అబ్బా! నాకిపు డేమియుఁ దోఁచుటలేదు. మనస్సెంతయు నలసియున్నది. ఇపుడు నేనేమియుఁ జేయఁజాలను.'



# ముప్పదిమూఁడవ ప్రకరణము

## మార్జ

సంధి నడచుచుండెను. ఇరుపక్షములవారును గృష్ణకు రెండు ప్రక్కలనుండిరి. యుద్ధచిహ్నములేవియుఁ గన్పట్టుట లేదు. అందఱును సంధియగునని తలఁచుచుండిరి. తురకలు మాత్రము హిందువులవలె ప్రమత్తులైయుండలేదు. ఎప్పుడు వచ్చి శత్రువులు మీఁదఁబడుదురోయని సిద్ధముగానుండిరి. హిందువులు సంధియగును గదాయని చూచుచుండిరి.

నాఁటిరాత్రి రామరాజాదులు యోజించినట్లు మఱునాఁడు మహాసభ కావింపఁబడెను. సామ్రాజ్యమునందుఁ బ్రసిద్ధిఁగాంచిన యెల్లవారును విచ్చేసిరి. నాఁటిరాత్రి వారు తలపోసిన మూఁడు షరతులను నేకగ్రీవముగాఁ బ్రజలు, రాజులు, మంత్రులు, యోధులు, అందఱు నొప్పుకొనిరి. అందుచే నవాబుల కిట్లు వర్తమానమంపిరి.

"మీరుకోరిన షరతులలో నీమార్పు లంగీకరింప వలయును. లేనియెడల మాకంగీకారముకాదు.

( i ) యుద్ధపుఖర్చులు మీరు మూఁడుకోట్ల నిత్తుమన్నారు. అది చాలదు. అయిదుకోట్లుగా దానిని మార్పవల

యును. మాకు రమారమి యిప్పటికిఁ బదికోట్లయినది. అయినను సంధియం దుభయపక్షముల సేమమును యోజించుట రాజధర్మము గావున నట్లుచేసితిమి.

(ii) మీరిచ్చెదమన్న దుర్గములును, దేశమును, ఇది వఱకు మా స్వాధీనములోనున్నవే కావున భూమిని హెచ్చింప వలయును. గోవా, తలికోట, బీజపూరు, కోవిలకొండ రాజుకొండ లుత్తరపు సరిహద్దుగాఁగల్గి పడమటిసముద్రము పడమటియెల్లగాను, గోదావరి తూర్పుటెల్లగాను గలప్రదేశము నంతయు మాకు నీయవలయును.

(iii) పై మార్పులు రెండునుగాక యొక క్రొత్తషరతును మేము కోరుచున్నాము. మీలో గోల్కొండ నవాబు కుమార్తె నూర్జహానును మా ప్రతాపసింగునకిచ్చి పెండ్లిచేయవలయును. తక్కినదెల్ల మాకంగీకారమే.”

ఇందులకుం బ్రత్యుత్తరమిచ్చుటకు మూఁడుదినములు వ్యవధినొసంగిరి. ఎట్లయినను రామరాజు పక్షమును సంధి నెపమున మోసగింపనెంచిన నవాబులు పై రెండు మార్పులకు నంగీకరించిరి. కాని మూఁడవ షరతునకు వారి కింకను గర్తవ్యము స్ఫురింపలేదు. ఆ యొక్క షరతువలన వారు తలంచిన దెల్ల వ్యర్థమగునట్లు కనంబడుచుండెను. ఆషరతున కంగీకరింప కున్న యెడల యుద్ధముసిద్ధము. ఇది వారుచేయఁదలఁచుకొన్న మోసమునకు విఘాతముఁ జేయును. కేవలమీస్థితిలో హిందు

వులు పోరఁబడరని వారెఱుంగుదురు. రెండుదినములు గడచెను. మూఁడవదినము సాయంతన మాయెను. గోల్కొండ నవాబున కేమియుం దోఁచలేదు. తదితర తురుష్కప్రభువుల చిత్తము లెట్లున్నను గోల్కొండ నవాబు చిత్తము నూర్జహానును ప్రతాపసింగునకు నీయ నంగీకరింపలేదు. వారయినను ఇట్లుచేయుట యుక్తమని పైకిఁజెప్పలేదు. మఱుచటిదినము గోల్కొండనవాబు తన హృదయమును వ్యక్తముచేయక తప్పదు. ఎట్లని యితర నవాబులు సంధికి రాయబారమును నడుపుటే యుక్తమని తలంచుచుండిరి. అతనికిని లోన నట్లే యుండెను. అందుచేతనే అతని మనస్సేమిచేయుటకును దెగకుండెను.

అతఁడొంటరిగాఁ గూర్చుండి యుండెను. అతఁడేమేమో యోజించుకొనుచుండెను. చీకటిపడెను. అచ్చటఁగాని యాప్రాంతమునంగాని యెవరునులేదు. అతనికిప్పుడు నూర్జహాను ప్రతాపసింగుని ప్రేమించి కృషించుచున్న వార్తకూడఁ దెలిసెను. అతఁడిట్లు యోచింపసాగెను.

'ఈసందిగ్ధసమయము దుర్భరముగానున్నది. ప్రతాపసింగుత్తమవంశీకుఁడు, సుందరుఁడు. అదియునుంగాక కుమారిత నూర్జహా నతనియందు బద్ధానురాగయైయున్నది.' సమయమో సంకటమయమై విషమముగానున్నది. అతనికి నూర్జహానునిచ్చి పెండ్లిచేయనా? చేసిన నేమితప్పిదము? తప్పులేని

కార్యము నాచరించుటకేల జంకవలయును? నేఁడు తురుష్క యువతులు హిందువులను, హిందూయువతులు తురుష్కులను బెండ్లియాడుచుండుటలేదా?-ఛీ! అదియుక్తముకాదు. హిందువులు కాఫరులు. మతాంతరులై విగ్రహారాధనతత్పరులగు పాపులతో సంబంధబాంధవ్యములు చేయనగునా? అయినచో నీవిదివఱకేల పెక్కండ్రు హిందూయువతులతో విహరించితివి? ఇప్పుడు జగన్మోహినికై ప్రాణములనుగూడ విడువనేల సంసిద్ధమగుచుంటివి? కాదుకాదు. అదివేఱు. దైవసాక్షిగా ధర్మపత్నిగా నొకరితెను వరించుటయందును, వివాహమాడక యుపపత్నులనుగాఁ జేసికొనుటయందును భేదము చాల కలదు. అయినను ఆ విషయ మట్లుండనిమ్ము.

నేటితో న్యవధిమూఁడుదినములు నైపోయినవి. రేపు యుద్ధము ప్రారంభముగా నున్నది. ఇదివఱకు విజయనగరము వారితో నెన్నియుద్ధములు చేసినను, ఒక్కదానియందుఁగూడ మాకు విజయము లభించినదికాదు. ఒక్కహిందువునకు నల్గురైదుగురు తురుష్కులున్నను గెలువలేకపోయితిమి. అట్టిచో నిప్పుడు మాసైన్యము రామరాజుసైన్యమునకు రెట్టింపు మాత్రమేకలదు. ఇఁక మాకు విజయసిద్ధి యెట్లుచేకూరునో తెలియకున్నది. పాపము! నవాబులెల్లరు నన్నును, ఆదిల్షాహాను నమ్మి యుద్ధభూమికి వచ్చినారు. మాపక్షమే యోడినచో వారికంత ముఁకు నమ్మించి యురిపోసినట్లుండును. అంతేకాదు, మాకు

రాజ్యములు దక్కవు. అన్నియును ఆంధ్రులపాలు కావలసి వచ్చును. ఈయొక్క కారణముచే నిన్ని పాట్లు సంభవింప నున్నవి. కర్తవ్యమేమియుఁ దోఁపకున్నది. ఏమిచేయుదును.?

నావలన నిందలకిన్నిపాట్లుగల్గుటయేగాక తురుష్క ప్రపంచములో నాకుంగల్గు నిందలు చెప్పశక్యముగాదు. పెక్క వత్సరములనుండి సిరముగానున్న మహమ్మదీయ రాష్ట్రము లను నాల్గింటినొక్కసారిగా నాచేతితో నాశముచేయనా? చేసి నచో నల్గురు తురకలున్నచోటఁ దలయెత్తుటకు నాకు వీల గునా? ఎత్తఁగల్గుదునా?'

అంతలో నతనిమంత్రి యచటికివచ్చెను. నవా బతనిం జూచి 'కూర్చుండుఁడు' అనెను.

'కూర్చుండెదను కాని తమరేదో యోజించుచున్న ట్లున్నారు? ఏమది? మీముఖ మంత విచారవంతమయి యున్న దేమి?'

'లేదు. నేను సంధివిషయమునే విచారించుచున్నాను. ఇప్పటివఱకు నాకేమియుందోఁచినదికాదు. అంతకంటె మఱే మియులేదు. మీరేమి ఆలోచించినారు?'

'దీని కింతగా విచారింపవలయునా? నేనొక క్రొత్త పద్ధతిం ద్రొక్కందల్ఁచితిని. రండు, మీకంతయు నివేదించెను.'

మంత్రి శిబిర మచ్చటికిం గొంచెము దూరమునగలదు. ఆ ప్రదేశమెల్ల నిశ్శబ్దముగా నుండును. వారా శిబిరములనుండి

బయలు దేఱి కొంతదూరము పోవునప్పటికి నిర్జనమైన బయ లొకటి తగిలెను. వారు నల్దిక్కులకును దృష్టిని సారించి పరీక్షించిచూచిరి. ఎవరును గన్పడలేదు. ఆ బయలులో స్వారి చేయుచు మెల్లగా నిట్లు భాషించిరి.

'మీరాలోచించిన తంత్రమేది?'

'ఏమియును లేదు. మీ కుమార్తె నూర్జహానువంటి బాలికయొక్కర్తు విజాపూరులో నవాబు సేవయందున్నది. ఆమెను పూర్వము నే నొకసారి చూచియుంటిని. ఆమెను జూచిన మన నూర్జహానునుజూడ నక్కఱలేదు. ఇరువురును, ఒక్కతీరుగనే యుందురు. చిరపరిచయము గలవారు తప్ప నెవ రును వీరిరువురకు భేదమును గన్గొనం జాలరు.'

'అట్లయినచో నాపె మనకుఁ జాలనుపకృతి చేయఁ గలదు. ఎంత ధనమును ఖర్చుచేసినను ఆపె లభించినంజాలును'

'మొన్ననే ఆపెకొఱకును ఆపెతల్లికొఱకును గొందఱి సేవకుల నంపితిని. వారు పోయి యామెను దీసికొనివచ్చినారు. ఆమె యిప్పుడు నాశిబిరమున నున్నది. సరిగా మన నూర్జహాను వలెనే యుండును. ఆమెనే నూర్జహానని ప్రతాపసింగునకుం బంపుదము. తరువాతఁ గాఁగలకార్యమునువిచారింపవచ్చును.'

'ఆమె యిందు కొడంబడునా?'

'ఆమె సద్గుణవతి. స్వదేశాభిమానురాలు. ఈ కా ర్యము నత్యంత భక్తితోఁ జేసెదననియున్నది.'

'అయినచో మన కార్యము సిద్ధింప వచ్చును'

వా రిరువురు శిబిరమును సమీపించిరి. అందు ప్రవే
శించునప్పటికి ఆ సుందరి కూర్చుండియుండెను. ఆమె నిలువ
బడెను. ఆ మువ్వురు నుచితాసనములపైనం గూర్చుండి
రాజామెతో నేమో సంభాషించెను.

---

# ముప్పదినాల్గవ ప్రకరణము

## వివాహము

మార్జను గోల్కొండ నవాబుకూతురని మోసముచేసి మఱునాఁ డంపుటకు నిశ్చయింపఁ బడెను. ఆ కుట్ర యెవరికిని దెలియదు. నూర్జహాను మాత్రము దానిం దెలిసికొనెను. మార్జ తల్లియు, మార్జయు, ఆదిల్షాహాయు నందులకంగీకరించిరి.

సంధి నుభయపక్షములవారు నంగీకరించిరి. యుదములు మానివేసి ఇరుపక్షములవారును శాంతితోను, స్నేహముతోను, ఉందురని యెల్లరును నమ్మిరి. నేఁడు నూర్జహానును దమ సైన్యాధిపతియగు ప్రతాపసింగున కిచ్చి పెండ్లిచేయుదురని హిందూభటులెల్లరు నానందమున మునిగియుండిరి. రాజులు, సేనాధిపతులు, యోధులు, భటులు, అందఱును సాయంత్రమా పెండిలిం జూడ సిద్ధపడుచుండిరి. గోల్కొండ నవాబుయును మార్జనంపుట కామెను సర్వాలంకారభూషితురాలిం జేయించెను. సంధిపత్రములపైన నవాబులెల్లరును దస్కతులు చేసిరి. మనుష్యులు నీతికి ధర్మమునకును లోఁబడవలయును. కాని కాగితము లేమిచేయఁగలవు? ఇష్టములేని షరతులనెన్నియేని వ్రాసి యొడంబడికలు పెక్కులు సృష్టింప వచ్చును.

అవి యన్నియుఁ జెల్లించుట కిష్టపడనివారిం బైఁబడికొట్టునా యేమి ?

ఇరుపక్షములవారును గోల్కొండ నవాబు నిజముగాఁ గూఁతును బ్రతాపసింగునకిచ్చి పెండ్లిచేయునని నమ్మిరి. ఇంతలో నూర్జహా నొకతంత్రముఁబన్నెను. ఆమె తనసేవకురాలిని వెంటఁ బెట్టుకొని యితరు లెఱుఁగకుండ మార్జియు నామె తల్లియు నున్న శిబిరమునకరిగి వారికిం దనయుద్దేశమును వెల్లడించెను. మఱియుం బెక్కువేలుచేయు నాభరణంబుల నొసంగెను. ప్రతాపసింగునకుఁ దమతంత్రము తెలిసిన యెడల తమ్మేమి చేయునోయని వా రిరువురు భయపడుచుండిరి.

ఆ యాభరణములంజూచి సంతసించిరి. అంతకంటెఁ దమ విముక్తికి మఱి హెచ్చుగా సంతసించిరి. మార్జి వేష మును రాజసుత యలంకరించెను. రాజసుతవేషమును మార్జి యలంకరించుకొనెను. నిజముగా నా యిరువుర మొగముల లోను, దేహములలోను, తీరులలోను, భేదము లేశమునులేదు. ఉన్నను నిత్యపరిచయము గలవారుకూడఁ గనిపెట్టఁజాలరు. అచ్చటినుండి మార్జి నవాబుకూతురు వేషముతో నామందిర మును జొచ్చెను. నూర్జహాను మార్జివేషముతో నచ్చటనే యుండెను. నూర్జహాను ప్రతాపసింగుకడకుం బోయిన వెన్క మార్జియు నామె తల్లియు నడిరాత్రివేళ పారిపోవు నేర్పాటులు చేసికొనిరి.

సాయంత్రమాయెను. మార్జను నూర్జహానుగా నెల్ల రును భావించిరి. ఏనుగులతో గుఱ్ఱములతోను, తగిన భూష ణములతోను వైభవముగాను, ఆడంబరముగాను గోల్కొండ నవాబు కృష్ణా తీరముననున్న యా రామరాజు యుద్ధశిబిర ములలోఁ బ్రవేశించెను. అతనికిం దగిన గౌరవములెల్ల జఱుపఁ బడెను. రామరాజు, మంత్రులు, సేనాపతులు, ఇతరులు, అతనిం దగినవిధాన గౌరవించిరి. మహావైభవముతో నా రాత్రి యాపెండ్లి కావింపఁబడెను. కాని యా జఱుగుచున్న పెండ్లి తన కుమార్తెదేయని నవాబు లేశమేని యెఱుఁగడు. తన మోసము ఫలించినదని యతఁడు సంతసించుచుండెను.

హిందువులు తురుష్కనాథుని సుతను ప్రతాపసింగు పెండ్లాడం గల్గినందులకు సంతోషించుచుండిరి. ఆ యిరువురును స్ఫురద్రూపముకలవారు. లోకములోఁ జాలమంది యా సంబంధము తగినదేయని మెచ్చిరి.

నూర్జిహాను తన కోరిక యీడేరినందుల కపరిమితా నంద భరితురాలాయెను. ప్రతాపసింగు హృదయము కూడఁ బరిపూర్ణానంద సముద్రమునం దేలి యాడుచుండెను.

మోహమునకును ప్రేమకును భేదము చాలఁగలదు. మోహము వేఱు. ప్రేమ వేఱు. అది యిదికాదు. ఇది అదికాదు.

---

# ముప్పదియైదవ ప్రకరణము

నిద్ర

మరునాఁడుదయమున గోల్కొండ నవాబు పోవు నపుడు తాను వెళ్ళి యితర నవాబులనంపి వైచి దిరిగి విజయ నగరమునకు వచ్చెదనని చెప్పిపోయెను. రామరాజ వేంక టాద్రి తిరుమలరాయలును చక్రధరుఁడును వల్లెయని యతని నట్లు చేయుటకుఁ బురికొల్పుచుఁ దమ యానందముం దెలిపిరి.

కుతుబ్ శాహా యట్లు తన యుద్ధశిబిరములకుంబోయి కడమ బీజపూరు, బేదరు, అహమ్మద్ నగరు నవాబులంబిల్పించి కర్తవ్య మాలోచింపఁదొడంగెను. గోల్కొండ వారి సేనలు కొన్నిదక్కఁదక్కినవన్నియు నారాత్రి యచ్చటినుండి పోవుట కేర్పాటు చేయంబడియెను. యుద్ధమును మాని నవాబుల సైన్యములన్నియు స్వదేశమునకుం బోవుచున్నట్లు వార్తలను వ్యాపింపఁజేసిరి. నాఁడుదయము మధ్యాహ్నము కొన్ని శిబిర ములను పెఱికివేసిరి. భటులందఱు సాయంత్రమువఱకు సన్నా హములను జేయుచుండిరి.

రామరాజు పక్షము వారు నాఁడు గాక మఱునాఁడు సాయంత్రము తిరిగి విజయనగరమునకుంబోవ నిశ్చయించు

కొనిరి. అందుచే నిశ్చింతగా నా రాత్రియెల్ల నచ్చటంగడపి మఱునాఁడు ప్రయాణసన్నాహములు చేయవచ్చునని యూహించుకొని యూరకుండిరి.

సాయంకాలము కావచ్చుచుండెను. నవాబుల సైన్యములలో నాల్గింట మూఁడువంతులు బయలుదేఱి యుత్తరముగా గొందఱును, వాయువ్యపుమూలగాఁ గొందఱును, ఈశాన్యపుమూలగాఁగొందఱును వెడలిరి. వా రప్పుడుమాత్ర మేయాయుధములను గొనిపోవుచుండలేదు. కాని వలయునాయుధములెప్పుడు కావలసిన నప్పుడు దొరకుటకు వీలుచేయఁబడెను. వారుపోవునప్పుడు సర్వజనులును తమస్థానములం దప్పక యుద్ధమందేయేభాగముల నెవరెవరి యాధిపత్యములలో మెలఁగుదురో అట్లే పోవుచుండిరి. అందుచే నాసైన్యములలో నెవరున్నది యెవరు లేనిది యెవరేని క్రొత్తవారు మోసము చేయుటకు వచ్చినది సులువుగా నెఱుఁగవచ్చును. ప్రొద్దు గ్రుంకఁగనే దీపములు వెల్గించి కొందఱు హస్తములలో ధరించి యితరులకు మార్గములఁ జూపించుచుండిరి. వారి ననుసరించి సర్వసైన్యములును నడచుచుండెను. ఆసైన్యసముద్రముల ప్రయాణభేరులును కలకలములును బ్రపంచమెల్ల నిండిపోయెను. క్రమక్రమముగాఁ బ్రొద్దుగ్రుంకినకొలఁది వారి చప్పుడులును తగ్గుచుండెను. ఎన్మిది తొమ్మిది గంటలగు సరికి వారిఁకఁ జప్పుడు చేయుటయు మానిరి. నిశ్శబ్దముగా నొకరితో నొకరు మాట్లాడకుండఁ

బోవుచుండిరి. అధికార్లు తమతమ పనులను జాగ్రత్తతో నిర్వర్తించుచుఁ దమ యధికారములలో నున్నవారిని వారి స్థానములం దప్పి పోకుండఁ జేయుచుండిరి. భటులెల్లరు జాగరూకులై ప్రమత్తత నందక తమతమ మార్గములలో మెల్లఁగా నడచుచుండిరి.

అర్ధరాత్రమాయెను. ప్రపంచమెల్ల నంధకారబంధురమై యుండెను. కాఱుచీకట్లు సర్వత్ర వ్యాపించి దృష్టిని చొరనీయకుండెను. నాల్గుదిక్కుల యందెచ్చటను మానవ సంచారము కానవచ్చుటలేదు. సమీపస్థకృష్ణాతరంగిణీమధ్యస్థతములై మండూకతండంబులు బెక బెక మని యత్యంత కఠోరములగు దీర్ఘధ్వనుల నాచరించుచుండెను. ఆధ్వనులు మాత్రము దిగంతములయందుఁ బ్రతిధ్వనించుచుండెను. ఆస్రవంతికిం బ్రాంతము లందున్న పచ్చిక బయళ్ళలోఁ జిన్న చిన్న కీటకములు కీచుకీచుమని ధ్వనించుచుండెను. ఆరాత్రి భయంకరమైయుండెను. అచ్చటచ్చట నాతరంగిణికి సమీపములం దున్నయడవులలోఁ గ్రూరమృగములు తమకు యుక్తములైన తెఱంగుల నినాదములు సల్పుచుండెను.

శత్రుపక్షము వారు బయలుదేఱి పోవుదురను వార్త రామరాజునకును దత్సర్వసైనికులకును, ఇతరులకును దెలిసెను. వారు బయలుదేఱి పోవుటను లెస్సగాఁ బ్రయత్నించి చూచిరి. తమకు విశ్రాంతికలుగునని తలంచిరి. చాలకాల

మునుండి వారికి పాపము రాత్రులయందు నిద్దురలేదు! నేఁడు కుంభకర్ణులవలెఁ బ్రపంచమెఱుఁగక హాయిగా నిద్రంపవచ్చునని సంతసించిరి. అర్ధరాత్రము సమీపించెను. రామరాజు సైనికులెల్లరు హాయిగా నిద్రించిరి. యోధులు నిద్రించిరి. సేనాధిపతులు నిద్రించిరి. వేంకటాద్రి తిరుమలరాయాదులు నిద్రించిరి. ఆ నిద్ర వట్టినిద్రకాదు. గాఢనిద్ర. గుండియలపైసం జేతులనుంచుకొని మైమఱచి నిద్రించు నమూల్యమైన నిద్ర.

విజయనగరసామ్రాజ్య సైన్యశిబిరములలోపలను వెలుపలను, ముందు బజారులందును, ఆవశ్యకములైన సర్వస్థలంబులందును దీపములు వెలుంగుచుండెను. ఆ సర్వ సైన్యముల చుట్టును, మధ్యను పెక్కువందలమంది రక్షకభటులు మాత్రము నిద్రింపక కావలికాయుచుండిరి. కొందఱు రక్షకభటులు శిబిర శ్రేణులమధ్యమున నున్న వీధులవెంట నిశ్శబ్దముగా సంచరించుచు నెచ్చట నేమి జఱుగుచున్నదియుఁ జూచుచుండిరి.

అట్టి భయంకరమగు నిశాసమయమున నిరువురు మానవులు విజయనగర సైన్య శిబిరముల కభిముఖులై నవాబుల సైన్యముల వైపునుండి యత్యంత వేగముతో గుఱ్ఱములను బరుగెత్తించుచు వచ్చుచుండిరి.

వారి గుండెలు దడదడఁ గొట్టుకొనుచుండెను. ఆదడదడను వీక్షించితిమేని వారిగుండెలు నిజముగాఁ బగులునని

మన మనుకొందుము. వారి యాతురత వర్ణనాతీతము. వారు గుఱ్ఱములం బరువెత్తించుచు విజయనగర సైన్య శిబిరములకు మిక్కిలి సమీపమునకు వచ్చిరి. వారి కప్పుడు దీపములకాంతి కనంబడుచుండెను.

వా రా దీపముల వెలుతురున నటునిటుంబరికించిరి. సమీపములో మానవు లెవ్వరును వారికిం గానరాలేదు. వారు స్వారి మానలేదు. వారి యాతురత అంతకంత కతిశయించు చుండెను. వారిట్లు భాషింపఁదొడంగిరి.

'శ్రీధరా! చూచితివా విజయనగర సామ్రాజ్యమున కెంతలో నెంతటి విపత్తులు వచ్చుచున్నవో? ఆహా! దైవ మా! నీచేతలు విచిత్రములు. రాజ్యముల నిమునములోఁ గూలం ద్రోతువు'

'అవును. సజ్జనులయిన వారి మంత్రముంగానక దుర్జను లయు ద్రోహులయు, పాపులయు, తంత్రములంగాని రాజ్య మేలు వారి కాపదలు రాకయుండునా?'

'అయినను, అందులకు వారిం దూషించి ప్రయోజనము లేదు. తమనోటతాము మన్నుం గొట్టుకొనవలయునని యె వరు నెన్నఁడును దలంపరుకాని వినాశకాలము సంప్రాప్తమగు నప్పటి కిట్టి బుద్ధిని దైవము కల్గించును'

'చూచితివా చక్రధరుఁడు నేఁడేమి చేసినాఁడో? శత్రు రాజుల పోకను రామరాజెఱింగియు, ఏకాలమున నేమివచ్చు

నోయని కొంతమంది వేగుల వారిని కృష్ణాతీరమునకుఁ బోయి రాత్రి తెల్లవారు వఱకు నేమేని యాపదలు సంభవింప నున్నచో మాకెఱిఁగింపుడని చెప్పి పంపఁగా వారికి జక్రధరుఁడు మఱియొకపనిని గల్పించి వారి నాపనినుండి తప్పించి నాఁడు.'

'అవును. స్వతంత్రముకలదు. స్వకార్యము నెట్లేని నెగ్గించు కొనవలయును. ఇఁక నే పనిచేయకుండును? కాని తుదకితని నాదిల్ శాహా నాశనముచేయునని మాత్రమెఱుంగఁడు. పాపము! వృథాగా సామ్రాజ్యనాశమును తన నాశమునుకూడ చేయ సాహసించినాఁడు. ఏమికానున్నదో! ఇంతకు దైవవిధి కాక మానదు'

'ఇంతలో వారు కృష్ణదాటుదురు. నేనటుపోయి ముందు తిరుమలరాయల సైన్యమును మేల్కొల్పెదను'

'అవును. నీవు రాధాకుమార ప్రముఖనిఖిల యోధవర సైన్యాధిపతి వర్గములను మేల్కొలిపి యిటు వేంకటాద్రి సైన్యములలోనికి రమ్ము. నేను రామరాజు సైన్యములం బ్రవేశించి విజయసింహాదులను మేల్కొల్పెదను. తరువాత వేంకటాద్రి సైన్యములలోనికివచ్చి నిన్నుం గలిసికొని కర్తవ్యాంశముం జెప్పెదను. ఇప్పుడు వ్యవధిలేదు. రక్షకభటులను సేవకులను సేవకురాండ్రను దాసీలను గన్పడ్డవారినెల్ల సైన్యముయొక్క నాల్గు మూలలకుంబంపి వారినెల్లరును మేల్కొను

నట్లు చేయుము. నేను యుద్ధభేరీలను వాయించునట్లు చేసె దను. త్వరపడుము! త్వరపడుము!!'

'అట్లే' అని యాతఁడు గుఱ్ఱమును ఆవలివైపునకుం దోలెను. ఇరువురు నాయుద్ధశిబిరమున ప్రవేశమునకుందగిన సాధనంబులను రక్షక భటులకుఁజూపి లోపలఁ బ్రవేశించిరి.



తాళికోట
యుద్ధము.
క్రీ.శ. 1565.
విజాపురము.
గోల్కొండ
బీదరు
అహమ్మదునగర్
కృష్ణానది
తాళికోట
కృష్ణానది.
తిరుమలరాయలు
వేంకటాద్రి
రామరాజు.

# ముప్పదియాఱవ ప్రకరణము

## యుద్ధము

ఒక డట్లు రామరాజు క్రిందనున్న సైన్యములలోఁ బ్రవేశించి యెల్లరను మేల్కొలుపుచుండెను. 'శత్రువులువచ్చుచున్నా'రను కేకలు నల్దిక్కులయందును బ్రతిధ్వనించు చుండెను. రక్షక భటవర్గములు నాల్గుమూలలకును పరువులెత్తి తమకుఁదోఁచిన చందానం గేకలు వైచుచు నెల్లసైనికులను యుద్ధమునకుం బురికొల్పుచుండిరి.

కొందఱు కండ్లు నులుముకొనుచు లేచుచుండిరి. మఱికొంద ఱుల్కిపడుచుండిరి. కొందఱు నిద్రనుండి లేవలేక లేపవచ్చిన వార్గిం దిట్టుచుండిరి. 'తురుష్కులువచ్చుచున్నా'రన్న మాటలు చెవింబడఁగనే పండ్లు పటపటమని పించుచు కొందఱు ఖడ్గములకేగుచుండిరి. 'ఏరిరా? తురుష్కులెక్కడ?' అని కొందఱు కేకలువైచుచు బరువెత్తుచుండిరి. కొందఱులేచి తమయస్త్రములను సిద్ధముచేసికొనుచుండిరి.

రణదుందుభులు భూమ్యాకాశమధ్య ప్రదేశమునంతను వ్యాపించుచుండెను. కొందఱు అొండొరులం బ్రోత్సహించుకొనుచు, యుద్ధసన్నద్ధులగుచుండిరి.

శ్రీధరుఁడు తిరుమలరాయల సైన్యములను మేల్కొ-
లుపుచుండెను. రాధాకుమార విజయసింహప్రముఖ మహా
యోధులు మేల్కాంచిరి.

ఆయుధాగారములందెరచిరి. సేవకులు వేలకొలఁది పోయి యే యే శిబిరములలో నే యే భటుల కే యే యాయుధములు కావలయునో తెలిసికొని వారికవియెల్లం దెచ్చియిచ్చుచుండిరి. ఎవరికేఁదోచిన చందాన వారు పాటుపడుచుండిరి. యోగియు శ్రీధరుఁడును ప్రవేశించి యింకను గడియకాలేదు. అప్పుడే తురుష్కులు రామరాజు సైన్యమును సమీపించిరి.

వారి సైన్యములలో దీపముల నన్నింటిని ఆర్పివేసిరి. అందుచే వారు దృష్టికిం గోచరించుటలేదు. కాని పుడమి యీనినట్లు లక్షలకొలంది భటులు ఏనుగులు గుఱ్ఱములు వచ్చి పడుచుండెను.

ముందు వచ్చి యెంత మేల్కొలిపినను విశేషకాలము వ్యవధి లేనందున సర్వసైన్యములును మేలుకొనుటకు వీలు గలుగలేదు. నిద్రావస్థలో నున్న కొందఱను తురుష్కులు శిబిరములలోఁ బ్రవేశించి నఱకుచుండిరి.

రామరాజు, వేంకటాద్రి తిరుమలరాయలు, విజయసింహుఁడు, రాధాకుమారుఁడు మొదలగు వారెల్ల సైన్యములం బురికొల్పి యుద్ధమునకు సన్నద్ధము చేయుచుండిరి.

కడమ తురుష్క సైన్యములువచ్చి యీవైపున రామరాజుతోఁ బోరుచుండఁగనే కృష్ణకావల దిగువడియుండిన గోల్కొండ నవాబును, అతని సైన్యములును వచ్చి హిందువుల సైనం బడిరి.

హిందువుల సైన్యములవలెనే ఆ నల్గురు నవాబుల సైన్యములును మూఁడు భాగములుగా విభాగింపఁ బడెను. ఆదిల్షాహ తిరుమలరాయని, గోల్కొండ నవాబు వేంకటాద్రిని, అహమ్మద్నగరు బేదరు నవాబులు రామరాజును, ఎదుర్కొనిరి.

పోరు ఘోరంబాయెను. సూర్యోదయమగుచుండెను. ఉభయ పక్షములయందును వీరుల హృదయములు పొంగి పొరలుచుండెను. పెళపెళలు, తళతళలు, లోకమెల్ల నిండిపోయెను. క[illegible]ప్పుడప్పుడే పొడచూపుచున్న సూర్యుని కిరణములందు విశుభ్ర[illegible] ప్రకాశించుచుండెను. సేనానాయకులు నడిపిన భటులు పర్విడుచు నొండొరులందాకుకొనుచు పరాక్రమములం జూపుకొనుచుండిరి. పూర్వవైరముగల యోధు లొండొరులందార్కొని పౌరుష సూచక వాక్యములు పల్కుచుఁ దిట్టుకొనుచు స్వేచ్ఛగా యుద్ధమునం బ్రవర్తించి తలలను నఱకుకొనుచుండిరి.

నిముసములోపల రక్తము కాల్వలుగట్టెను. ఏఱులై పాఱఁదొడఁగెను. నదులాయెను. మహాప్రవాహ రూపము

నొందెను. అందు భటుల తలలు, మొలలు, కాళ్ళు, చేతులు ముక్కులు, మూపులు, వీపులు, తేలుచుండెను.

ఆకసమున స్వేచ్ఛారూపముగల దేవతలు సిద్ధులు, గంధర్వులు తదితర దేవయోని విశేషులును వచ్చి యా సమరము బక్షులరూపమునం దిలకించు చున్నారన్నట్లు కాకులు గ్రద్దలు రాబందులు మొదలగు పక్షిజాతులు సండి సూర్య కిరణ ప్రసారమునకుంగూడ నభ్యంతరము కల్గించు నట్లుండెను.

భటులను భటులు, యోధులను యోధులు, పరాక్రమ వంతులను బరాక్రమవంతులు, శూరులను శూరులు, ధీరులను ధీరులు, సేనాపతులను సేనాపతులు, పిన్నవారిని పిన్నవారు, పెద్దవారిని పెద్దవారు మార్కొనుచుండిరి. ప్రచలత్ కృష్ణ మహీంధ్ర పంక్తుల నధఃకరించుచున్న మహా కరీంద్ర రాజముల ఘీంకృతులు మిన్నుముట్టి, మన్నందట్టి దిక్కుల కెగఁబాకి యుద్ధభటుల కర్ణపుటములం జిల్లులుపోవు నట్లుచేసి పిఱికివారికి భయంబు నాపాదించుచుండెను. గండ శిలలవలె దుర్భేద్యములగు నాయేనుంగుల కుంభస్థలము లుత్తమ సేనానాయకులయు, యోధులయు, భటులయు భయంకరములయిన ఇనుపగదల దెబ్బలచేతను, మందు గుండు సామానుల చేతను బగిలి నేలపైనం బడుచుండెను. విరిగి పడుచున్న పర్వత పంక్తులగతి యేనుంగులు వీనుంగులయి నేలపైనం బడుచుండెను.

విధూతానేక మహాయోధ శిరస్సమూహములయిన యుత్తమయోధులచేఁ బ్రయోగింపఁబడిన నిశితశర పరంపరలును, ఖడ్గపరంపరలును, విశ్వవిఖ్యాత శౌర్యపరాక్రమధనులయిన సేనాపతులయు, యోధులయు శిరంబులను నిముసములోఁ ద్రుంచివేయుచుండెను. కొంద ఱశ్వికులు బాకులీఁటెలం గైకొని విజృంభించి రౌతులం బొడుచుచుండిరి. ఆ పడినరౌతుల శిరమ్ములనుండియు, దేహమ్ములనుండియుఁ బ్రవహించుచున్న రక్తముచేఁదడిసి తెల్లనియుత్తమాశ్వములెల్ల నెఱ్ఱంబడుచుండెను. మహావీరుల లోచనములు రక్తకాంతి విభాసురములై భయంకరము లగుచుండెను. పేరువడిసిన వీరులెల్లరు నొండొరులం దాకికొనుచు నత్యుత్సాహమునం బోరాడుచుండిరి. భటులశిరములు కెందామర పూబంతుల గతిఁ బ్రకాశించుచు నేలపైఁ బడుచుండెను.

శత్రుహృదయ విదారణాతిదక్షదారుణ శతఘ్ని వ్రాతప్రోద్భవానూన భయంకర నిర్ఘోషములు దశదిశాంతరప్రదేశములు నిండి లోకమునకెల్లం జెవుడు కూర్చుచుండెను. ఒక్కొకఫిరంగి బ్రద్దలై సమీపస్థానేక భట గజ హయాదుల జీవములం గొనుచుండెను!

తుపాకులలోఁ దోటాలుపెట్టి కొందఱు ప్రయోగించుచుండిరి. కొంద ఱాయుధములం బారవైచి గ్రుద్దుకొనుచుండిరి. మఱికొందఱు తన్నుకొనుచుండిరి. ఇంక కొందఱు పొడుచు

కొనుచుండిరి. కొందఱు పర్వెత్తుచుండిరి. కొందఱు వారి వెంటఁబడి తరుముచుండిరి. కొందఱితరులంజుట్టుబట్టిలాగుచుండిరి. మఱికొందఱు లాగఁబడుచుండిరి. కొందఱు బాహువులతోఁ బోరుచుండిరి. కొందఱుక్రోధావేశమున నితరుల ఱొమ్ముల పైనెక్కి వక్షస్థలమ్ములంజీరి ప్రేవులంజించి తమకు జందెములుగాఁ జేసికొని ద్వితీయ నృసింహావతారులై ప్రవర్తించుచుండిరి.

రణశిక్షా కుశలులగు కొందఱితరులు తమ్ముంగొట్టు దెబ్బల నన్నింటిని దప్పించుకొనుచు వెనుకకు ముందుకు ప్రక్కకుఁ దిరుగుచు, ఇచ్చవచ్చినవిధాన నల్దిక్కుల మసంగి భటుల తలలఁను జిత్రవిచిత్ర ప్రకారములఁ బంటపైరులఁగోసిన చందానం గోయుచుండిరి. బట్టలు వరుసలుగగూడి వీరుల యుత్తమగుణములను శౌర్యధైర్యములను నాసముచేయుచు వారి భటులరక్త నాళములయందు నూత్నరక్తముం బ్రవహింపఁ జేయుచుండిరి.

ఆంధ్రదేశ మాతయొక్క విశుభ్రయశ స్సంపదలను వృద్ధిఁ బొందించుటకుఁగాను పూలబంతుల నొసంగునట్లు తమ శిరంబుల నొసంగి త్రిలింగరాజ్యలక్ష్మిని విస్తరింపఁజేసి, యా రాజ్యమందు దురుష్కులు కాలు పెట్టకుండునట్లు కావించి, రాజ్యములుచేసి సేనానాయకత్వములను వహించి, మంత్రి పదవులంబడసి యాంధ్ర భూమియందుఁబూజ్యతను, ఉత్కృష్ట

స్థానమును నాఁడును నేఁడును వహించిన కమ్మ, వెలమ, రెడ్డి నాయకుల యశస్సా యుద్ధభూమియందు స్తుతి పాఠకులచేతను బట్టులచేతను బాడఁబడుచుఆయుద్ధవీరుల దేహములను మఱచునట్లు చేయుచుండెను. వారి పౌరుషము, బలము, తేజము నాత్మ జవ సత్త్వములను దాల్చుచుండెను.

ఆ వీరుల కప్పుడు తండ్రులుగాని తల్లులుగాని పిల్లలుగాని మఱేదిగాని స్ఫురించుటలేదు. 'స్వదేశ రక్షణ. స్వదేశ రక్షణ' యని వారి హృదయములు జపించుచుండెను. వారి శరీరములోని, ప్రతి నాళమునందును శౌర్యము స్ఫురించుచుండెను.

తురుష్క వీరులును 'మహమ్మదీయమత రక్షణము. మహమ్మదీయమతరక్షణ' మని మంత్రించుచుండిరి. హిందువులను నాశనముచేసి పవిత్రమగు తమ మతమును రక్షింపుమని అల్లాను ప్రార్థించుచుండిరి. కాఫరులను జంపి స్వర్గలోకమును బొందుఁడని కొందఱు ఫకీరులు [illegible] ప్రోత్సహించుచుండిరి. మఱి కొందఱు అల్లా తమకుం బ్రత్యక్షమయ్యెననియుఁ దమకే విజయము సంప్రాప్తమగునని సెలవిచ్చెనాఁడనియుఁ జెప్పి మహమ్మదీయుల సైన్యసమూహములను సంతోష తరంగములయందు మునుగునట్లు చేయుచుండిరి.

యుద్ధములు మహాపురుషులు [illegible] శాపములని చెప్పవచ్చును. తరతరములుగ జనులు నశింతురు. దేశమున

బందిపోట్లు హెచ్చును. అరాజక మగును. కోట్లకుకోట్లు ధనము వ్యయ మగును. దేశములో నెలకొనియున్న శాంతి నశించును.

కొందఱకుఁ గాళ్ళు పోయినవి. మఱికొందఱకు వేళ్లు తెగినవి. కొందఱకు ముక్కులు చెక్కులైనవి. కొందఱకుఁ బాదములు పాడయినవి. కొందఱకు తొడలు తెగినవి. కొందఱు హస్తములు పోగొట్టుకొనిరి. పాపము! వారిబాధలంజూడము! కొందఱు గిలగిలమని కొట్టుకొనుచున్నారు. కొందఱు తెగిన యంగములవలనం గల్గినబాధ సహింపలేక తమకుఁ దామే పొడుచు కొని చచ్చుచున్నారు.

---

# ముప్పదియేడవ ప్రకరణము

## ఆదిల్శాహా పరాభవము

వీరుల చరితములు భాషణములు మనలను పులకాంకితులం జేయును. వారి పరాక్రమమును గన్గొనఁజూచుట తటస్థించునేని మనమేమగుదుమో నర్ణింపఁజాలము. ఇపుడా యుద్ధమునం దెవరెవరిం దా రొక్కని యెట్టెట్టులు సమరమును జేయుచున్నారో చూతము.

ఆదిల్శాహా తిరుమలరాయల పక్షములు రెండు నొండొంటిం దాకినవి. కొంతవఱకు నిరుపక్షములవారును సమానముగాఁ బోరిరి. ఆంధ్రవీరులు ప్రాణముల కాశింపక శత్రువుల పయింబడి చేతికివచ్చినట్లు నఱకుచుండిరి. ఆదెబ్బలకుం దాళఁజాలక కొంతసేపయిన తరువాతఁ దురుష్కులెల్లరును జెల్లా చెదరై పోవుచుండిరి.

ఆదిల్శాహా అదిచూచి సహింపనోపక వచ్చి తనసైనికులం బ్రోత్సాహముచేసి మరల శత్రువులమీఁదికిఁ దోలుచుండెను. ఇరుపక్షములందును బ్రధాన వీరశిఖామణులు పెక్కండు గతించిరి. భటుల పోకకు లెక్కలేదు. వందలు, వేలు, పదివేలు, గతించిరి.

ఆదిల్ శాహా సైన్యము నాల్గుమూలలను దిరుగఁ జొచ్చెను. ఆ సమయమున నతనిని దిరుమలరాయ లడ్డగించెను. ఆదిల్ శాహాను గాపాడవలయునని పెక్కండ్రు తురుష్కులుచేరి ప్రాణముల నొసంగుచు దిరుమలరాయని సమీపించుచుండిరి. హిందూయోధులు వారి నడ్డగించి తరుముచుండిరి. అచ్చటకు రాధాకుమారుఁడుచేరి శత్రువుల తలలను బంతులు నఱకినట్లు నఱకుచుండెను. తిరుమలరాయలు గొట్టు దెబ్బల నన్నింటిని ఆదిల్ శాహా సహించుచు నతనితో ఘోరముగాఁ బోరుచుండెను. కాని వేంకటాద్రి యతని యేనుంగుం జంపివైచెను. అతఁడు క్రిందికిదుమికి ప్రాణములను సంరక్షింపం బూని పర్విడుచుండెను.

తిరుమలరాయ లతనిం బట్టుకొని ‘ఓరీ! పాపాత్ముఁడా! హీనుఁడా! కృతఘ్నా! నిన్న మొన్నటివఱకు ‘తండ్రీ! తండ్రీ’ యని మా యన్నగారిం బిలుచుచు శత్రువులతోఁ గలిసి నేఁడు యుద్ధమునకు వచ్చితివా? నేఁటితో నీ పాపములు సర్వము తగిన ఫలము నందుచున్నవిలే. నీవంటి పితృద్రోహులకుఁ దగిన శిక్ష యీశ్వరుఁడు చేయకుండునా? అది యీలోకముననే నీకు సిద్ధించుచున్నది. విజయనగర సామ్రాజ్యముచేసిన సాయమువలనఁ బెక్కుయుద్ధములలో విజయంబుం గాంచి యింతవాఁడవై యిట్టి ద్రోహముం జేయుదువా? శత్రు ద్రోహీ! ఇదిగోఁ జచ్చితివి’ అని ఖడ్గమును ఝళిపించెను.

కడసారి ప్రయత్నముగా నతఁడొకసారి తన ఖడ్గమును విసరెను. కాని అది వమ్మాయెను.

అతని కనులనుండి నీరు స్రవించెను. ప్రాణముపోవునని యతఁడు లోలోన నేడ్వసాగెను. ఏమిచేయుటకును దోఁచలేదు. అతఁడు చేసిన ద్రోహములను, పాపములను నతండు స్మరించెను. దుఃఖించుచుండెను. ఈ యుద్ధము తనకొఱకే వచ్చెనా యేమి యని యతఁడు పరితపించుచుండెను.

అతని సైన్యములన్నియు నావఱకే పాఱిపోయెను. కాని యింతలో నొక తురుష్కవీరుఁ డచ్చటికి పరుగెత్తివచ్చి యా తిరుమలరాయుని హస్తము నున్నట్లుగాఁ దెగనఱికెను. ప్రేటుతిన్న పెద్దపులివలె రెండవచేతం గత్తింగైకొని యా తురుష్కుం బొడిచి విజృంభించెను. ఇంతలో, ఆదిల్ శాహా పాఱిపోయెను.

రాధాకుమారుఁ డతనిని వెంబడించెను కాని యింతలో నతని నొకతురుష్కయోధుఁ డడ్డగించెను. రాధాకుమారుఁ డతనితల నొక నిముసములో స్వకీయతీక్ష్ణకరవాల ధారకర్పణముచేసెను. అతనిమూర్తి తేజోవంతమైయుండెను. ఆనాఁడు నిజముగాఁ బ్రపంచమెల్లనుం గలిసివచ్చినను అతనిం జయించుట దుర్లభముగా నుండునట్లుండెను. అతనిశరీరము రక్తసిక్తమై యెఱ్ఱగాఁ బ్రకాశించుచుండెను. కన్నులెఱ్ఱగాఁ జింత

నిప్పులవలె నుండెను. సింహముంజూచి పాఱిపోవు లేళ్ళవలె శత్రువులు పారిపోవుచుండిరి.

తిరుమలరాయలు విజృంభించెను. ఆంధ్రయోధులు విజృంభించిరి. హిందువుల శక్తి తురుష్కులకుం దెల్లమాయెను. ఒక్కనిముసములోఁ దురుష్కవీరులు భటులు సేనాధిపతులు ప్రాణములం దక్కించుకొననెంచి యిచ్చవచ్చినట్లు చెట్లకు పుట్టలకు, గట్టులకు నల్దిక్కులఁబర్విడిరి. రక్తధారలు వెల్లువలై పారుచుండెను.

---

# ముప్పదియొనిమిదవ ప్రకరణము

## విజయము

భారతయుద్ధమున భీష్మునింగూర్చి చదివితిమి. కాని యా భారత పితామహునికంటె నెక్కుడువాఁడు తరువాత జన్మింపనేలేదని పెక్కురు పేర్కొనుచున్నారు. కాని తలికోట యుద్ధమున మధ్యందిన మార్తాండునివలె ప్రకాశించు రామరాజుం దిలకించిన వారెవరు నా మాటలను నమ్మఁజాలరు. అతని కిప్పు డెనుబదేం డ్లుండును. కాని యౌవనుని విధమున విజృంభించి యా యుద్ధమున శత్రు సంహారముం జేయు సైనికులను యోధులను బ్రోత్సాహించుచున్నపుడా దివ్యపురుషుని మనము చూచితిమేని మన మే స్థితిని వహింతుమో యీశ్వరుని కెఱుక.

విజయ సింహుఁడు నాఁడు చేసిన యుద్ధమును సరిగా స్వర్గమునందుండు దేవతలే వర్ణింపఁజాలరు. ఎక్కడఁజూచిన నతఁడే. ఎక్కడ విన్న నతని పౌరుషమే-ప్రతాపమే- తేజమే. నాఁడు విజయసింహుఁ డొక్కఁడు కాఁడు. ముగ్గురు, నల్గురు, పదుగురు, నూర్గురు వేయిమంది—ఏమూలఁజూచిన నతఁడే.

అతఁడు శత్రువుల సేనాధిపతులను యోధులను అతిక్రమించెను. భటులను ద్రుంచెను. గజములను సంహరించెను. యాశ్వనుల హరించెను.

ఇట్లు నిరాఘాట పరాక్రమమున మించి యతఁడు అహమ్మద్ నగరు నవాబుపైఁబడెను. శత్రువులందఱు చెల్లాచెదరయి పోయిరి. అతనితోఁగూడఁ గొందఱు యోధులుండిరి. ఆయోధులు శత్రుపక్షమువారి యోధులతోఁబోరంబోడంగిరి. విజయసింహుఁడహమ్మద్ నగరునవాబుపైకింబోయెను. అతఁడదిచూచి పాఱిపోయెను.

అహమ్మద్ నగరు బేదరు నవాబుల యోధులలో సాలబత్ జంగు, హుసనప్లి, ఇస్మాల్ ఖాన్ మొదలగు వారు విజృంభించి హిందువుల నూఁచకోతకోసిరి.

కాని విజయసింహ సాలబత్ జంగులకు ఘోరయుద్ధం బాయెను. సాలబత్ జంగు విజయసింహునిమీఁది కెగిరి యొక పోటు దీర్ఘఖడ్గమునం బొడిచెను. అది యతని హస్తమునం దగిలెను.

ఆ దెబ్బతో మూర్ఛిభవించిన పౌరుషరాశియోయన నతఁడాతనిపైఁ బిల్లపిడుగువలె నెగిరిపడి గట్టిగాఁజుట్టుకొని బంధించివైచెను. అతఁడు తప్పించుకొనఁజూచెను. కాని విజయసింహుఁడతని శిరముం దునిమెను.

రామసింహుఁడనుమఱియొక హిందూసేనాని హుసనల్లీపైకి విజృంభించెను. చాలసేపు వఱకు నా యిరువురుం బోరి తుదకు కీర్తిశేషులైరి. తురకల సేనానాయకులెల్లఁ జచ్చుటఁ జూచి యాభటులు భయపడి పారిపోయిరి. ఈ పక్షమునం గూడ హిందువులకే విజయము సంప్రాప్తంబాయెను.

# ముప్పదితొమ్మిదవ ప్రకరణము

## స్వామిద్రోహము

ఇట్లంతటను హిందువులకే విజయములు తటస్థించుటచేం జేసి వారికి గర్వము కొంచెము హెచ్చెను. పైన వారికాయాసమును హెచ్చెను. శత్రువుల సైనికుల నెంత నఱికినను జీమల బారులవలె నింకను వచ్చుచుండిరి. విధివిరామము లేక యుండెను.

రాజ్యాంగ పాలనము మిక్కిలి కష్టమైనది. రాజులు తామేర్పఱచుకొను మంత్రులు సేనాపతులు మొదలగు వారిని మిక్కిలి యోజించి మఱి యుద్యోగములలోనికిం జేర్చుకొనవలయును. సామాన్య భటులలోం గొలదిపాటి వ్యత్యాసము లుండినను అంత కష్టముకలుగదు. కాని గొప్పయుద్యోగములు పౌరుషవంతులు జ్ఞానవంతులు స్వదేశాభిమానులు కాకయున్నచో దేశమునకెల్లను గొప్ప నష్టము సంభవించును. మంత్రులను సేనాపతులను నిర్ణయించుటయందే రాజ్యము యొక్క మంచి చెడ్డలు శుభాశుభములు నిల్చియుండును.

ప్రతాపసింగు పౌరుషవంతుడు ధైర్యవంతుఁడే కాని విషయలంపటుఁడు. నూర్జహాను ముఖ సుధాకర మండలముం

జూచినంతనే యతని హృదయము నీరై పోయెను. అతఁడు యుద్ధమునకుం బోవగడంగెను. ఆ సుందరి విగ్రహ మతని ముందు నిలిచెను. అతని కాళ్ళు మఱి చలింపలేదు. అతఁడిఁక యుద్ధభూమికి నడువ లేకపోయెను. పాపము! ప్రతాపసింగు వెంటనే తగిన ఫలము ననుభవించెను. అతని వర్తనము వేంకటాద్రికిం దెలిసెను. అతని హృదయము తీక్ష్ణకోపాగ్ని జ్వాలాదగ్ధంబై యుడుకుచుండెను. తోడనే నూర్గురు భటుల నంపి యాతని నున్నట్లు తీసికొనిరండని యాజ్ఞాపించెను. వారు పోయి కర్తవ్యమును తెలియంజేసిరి. ఆతఁడు నిరాకరించినం బ్రయోజనము కలుగఁజాలదు. వారితోఁగూడి వేంకటాద్రి కడకుంబోయెను. అచ్చటఁగల యోధు లెల్లరును అతని వర్తనముం ద్వేషించిరి,దూషించిరి. వేంకటాద్రి యిట్లనెను.

‘ ఛీ! నీచుఁడా! స్వదేశాభిమానమును విడిచి శత్రువగు గోల్కొండ నవాబు వారించినంతమాత్రమున యుద్ధమునకు రాకుండుట నీ కుచితమేనా?

చిన్నప్పటినుండియు నీకు సకల సంపదలను సర్వభోగ భాగ్యములను ఇచ్చి గొప్ప యుద్యోగమును గౌరవమును గల్గఁ జేసిన రామరాజ చక్రవర్తి యెడంగల భక్తి యెల్ల నేమిచేసితివి? గోల్కొండ నవాబు కూతును నీ కిప్పించినదెవరు? ఆ విశ్వాసమేని లోపల నుంచుకొనవలదా? ఇట్టి విశ్వాసహీను నేఖు చేయవలయునో నీవే చెప్పుము?’

ఆమాటలు వినఁగనే ప్రతాపసింగు హృదయమునఁ బశ్చాత్తాపము జనించెను. క్రోధము హెచ్చెను. అతని తప్పు నతనియంతరాత్మ యొప్పుకొనెను. అచ్చట యోధులు సేనాపతులు గలరు. వారలందఱ ముందట్టి మాటల సనిపించుకొని బ్రదుకుటకంటె నీచత మఱియుండఁజాలదని తలచెను. అతని కన్నులనుండి నీరు బొటబొటంగారుచుండెను. 'అయ్యో! నేను మాతృదేశ ద్రోహిని. పాపాత్ముఁడను. హీనుఁడను. స్వామిద్రోహిని——' అని తోడనే తన ఖడ్గమునుదీసి కంఠమునం గ్రుచ్చుకొని ప్రాణములు విడిచెను.

కాని యతఁడు యుద్ధభూమికి రాకయుండుటవలన వేంకటాద్రి సైన్యములో నొక గొప్పభాగము నష్టమును వహించెను. సైన్యాధిపతులులేని సైన్యములు నాయకుఁడులేని రాజ్యములవంటివి. యజమానులు లేని గృహములవంటివి. చక్రములులేని శకటములవంటివి. అట్టిస్థితియే వేంకటాద్రి సైన్యమునకును గల్గెను. అదియెల్లా చెదరగుచుండెను.

ఈతని సైన్యములు మధ్యభాగమున నున్నవని మన మెఱుంగుదుము. ఆభాగముననే తురుష్కులు ఫిరంగలనుభూమిలో నమర్చియుండిరి. ఆఫిరంగుల దెబ్బలచేతను, వాని మహాగ్ని జ్వాలలచేతను, పెక్కువేలమంది జనులొక్కపరి నాశమందిరి.

ఇదివఱకు సైన్యము మూఁడుభాగములనియు నందు తిరుమలరాయ రామరాయలకు విజయము సిద్ధించెననియు

మనమెఱిఁగియుంటిమి. ఇప్పుడు విజయమునందిన తిరుమల రాయ, రామరాజ చక్రవర్తు లిరువురు సేనలతో గూడవచ్చి వేంకటాద్రి పక్షమునం జేరిరి. తురకలును అక్లే యొక్కభాగముగాఁ జేరిరి. తురకలును హిందువులునుగూడి యిట్లు జయకాంక్షులై ఘోరముగాఁ బోరాడుచుండిరి. అచ్చటిసైనికులును యోధులును ప్రపంచమును మఱచియుండిరి. వీరులు యథేచ్ఛా విహారంబుచేయుచు శత్రువులను, అడ్డమువచ్చిన తమ వారింగూడ నఱికివైచుచుండిరి.

చక్రధర కృష్ణసర్పము రామరాజ చక్రవర్తిని మ్రింగి వేయఁజూచుచుండెను. ఇంతవఱకును రామరాజునకా ఘోర సర్పముయొక్క స్థితి తెలిసినదికాదు. అందుచే నతఁడునమ్మియే యుండెను. చక్రవర్తి మాపటివాండ్రనుగా నిరువుర తురకలను చక్రధరుఁడు ఇచ్చియుంచెను. అదియతఁడు కనిపెట్ట లేదు. ఇతరు లెవరును కనిపెట్టినట్లు మనకుందోఁచుటలేదు.

ఒక యోగిమాత్ర మెప్పుడును రామరాజు వెనువెంటనే వచ్చుచుండెను. అతఁడు నిముసమైన నెడబాసి యుండుట లేదు. చక్రధరుం డది కనిపెట్టియుండవచ్చును. కాని కాలమెల్లప్పుడును సరిగా నడువదు. ఆ యోగి తనలో నేమను కొనెనో కాని ముందునకు నాల్గడుగులు వైచి విజయసింహాలుం బిల్వఁ బోయెను.

ఆయోగి కాలుందీసి ముందుఁబెట్టగనే రాజుగారి మావటి వాండ్రకు చక్రధరుఁడేదో సంజ్ఞయొక్కటి చేసెను. ఆసంజ్ఞను దైవ వశమున రామరాజు చూచెను. కాని వ్యవధి లేదు. వెంటనే ఘోరఖడ్గమొకటివచ్చి యాతని వెన్నెముక ప్రక్కందాఁకి గొప్పగాయముచేసెను.

రామరాజు స్పష్టముగాఁ జక్రధరుఁడు చేయుసంజ్ఞను జూడఁదటస్థించుటంజేసియు, వెంటనే యాతఁ డనుకొన్నట్లు వ్యవధిలేకుండఁ దనకు ఖడ్గప్రహారము తగులుటంజేసియు, చక్రధరుని సంజ్ఞయొక్క అర్థమును సంపూర్ణముగ గ్రహించెను. కాని నిముసములో చక్రధరుఁడా స్థలమున లేకుండఁబోయెను. అతఁడే దారి నెట్లుపోయెనో ఆకష్టకాలములో నెవరును గన్పెట్టఁ జాలరైరి.

దైవికమను సత్యాద్భుతశక్తియొకటి కలదు. దాని తత్వమును మన మెఱుంగము. కాని యొక్కొక్కప్పుడు కలనైన మనము తలంపని కష్టములెల్ల మనకుఁ గల్గును. మఱియొకవేళ కాఱుమేఘములట్లు క్రమ్ముకొనియున్న మహాకష్టపరంపర నిముసములో మాయమైపోవును. అవి యెట్లు సంభవించునో మనకు గోచరముకాదు.

ఇంతలో దైవవశమున రామరాజెక్కిన యేనుఁగు బెదరెను. అది యతనిం బడద్రోసెను. అతఁడు నేలపైనంబడెను. అతని చుట్టును హిందువులును తురకలును గుమికూడ

చుండిరి. రెండు కక్షులకును పోరుజరుగుచుండెను. ఒక వాఁడి యగు ఖడ్గమెగిరి రామరాజుతలపై న తఁడింకను లేవకమున్నె పడఁబోవుచుండెను. కాని యింతలో ఖడ్గముతోఁగూడ నొక తురుష్కుని చేయి తెగి నేలపైనం బడెను. ఆ కొట్టినదెవరు ? విజయసింహుఁడు !

అతనివెంట యోగియుండెను. ఆయోగివెంట మఱి యొక యౌవన వీరుఁడుండెను. రామరాజుం జంప సిద్ధముగా నున్న తురుష్కుని హస్తమును నఱికినందులకుఁ గోపించి మఱి యొకతురుక విజయసింహునిపైన ఖడ్గమును వెనుక ప్రక్క నుండి విసరెను. ఆ దెబ్బవచ్చి యతని యెడమమోచేతి పై భాగమును రెండుతుండెములుగాఁ జేసెను.

ఆచేతివంక నావీరుఁడు చూచుకొనఁగానే అతనికిఁ బౌరుషము హెచ్చెను. తీండ్రించుచున్న యుత్తమ హర్యక్షముగతి నతఁడు విజృంభించెను. అతని కనులు రక్తమయములాయెను. అతఁ డాగాయమునకు గట్టుగట్టి మరల తురుష్కసేనపైన ద్విగుణీకృతమైన పరాక్రమమునం గవిసెను. ఆమూర్తి భయంకరము. కాలానల జ్వాలాసన్నిభము. అతఁడపుడు రెండవ రుద్రునివలె నుండెను. కాని యతనికిం గ్రమక్రమముగా నాయాసము హెచ్చెను. ఒక తురుష్కవీరుఁడువచ్చి తన ఖడ్గమును సరిగాఁ బ్రక్కనుండి యతని కంఠముపైన విసరెను. ఇంతలో హిందూయౌవన పురుషుఁడొకఁ డా దెబ్బను

తానుకాచుకొనెను. పాపమతనికిం బలమైనగాయము తగిలెను. ఆ యిరువురును మూర్ఛిల్లిరి. శ్రీధరుఁడు వారినచటనుండి తప్పించివేసెను.

రామరాజును మూర్ఛిల్లెను. అతనిని యోగి రక్షించి దూరముగాఁ గొనిపోయెను. కాని రామరాజు బ్రదుకునట్లు తోఁచలేదు.

ఇంతలో 'రామరాజుచచ్చె. రామరాజు చచ్చె' అని తురుష్కులు కేకలిడిరి. హిందువులు నిజముగా నతఁడు చచ్చెననుకొనిరి. తురకల కేకలును అర్పులును మిన్నుముట్టుచుండెను. క్షణములో సైన్యము నాల్గుమూలల నావ్యాప్తి వ్యాపించెను. హిందువులు చెల్లాచెదరయిపోయిరి. కొందఱతని కొఱకు వెదకుచుండిరి. తురుష్కులు వెంటఁబడి నఱకుచుండిరి.

తిరుమలరాయ లావార్తను వినఁగనే సహింపనేరక అతనిం జూడవలయునని రామరాజున్న స్థప్రదేశమునకు రాఁదొడంగెను. అతనింగూడ మోసపుచ్చి తురకలు నఱికివేసిరి.

అన్నగారి చావు తెలిసి వేంకటాద్రికూడ నతనింజూడ వచ్చుచుండెను. అతని నొకతురుష్క యోధుఁడు వెంబడించెను. ఆ యిరువురును ఘోరముగాఁ బోరిరి. ఆ తురుష్క యోధుఁడు గతించెను. కాని మఱియొకఁడువచ్చి వేంకటాద్రి తలపైన నొకపెద్ద దెబ్బకొట్టెను. అతని తల రెండుప్రక్కలాయెను. శక్తితగ్గుచుండెను. అయినను సహించి యాతురకం

